# కాఫీ రుచిని అధికంచేసే క్రొత్త తయారీ విధానము
# కాఫీ తాజాతనాన్ని అధికంగా సంరక్షించే క్రొత్త ప్యాకెట్

# క్రొత్త బ్రూక్ బాండ్ గ్రీన్ లేబిల్




ఇప్పుడు బ్రూక్‌బాండ్ వారు ఉపయోగిస్తూన్న క్రొత్తతయారీ విధానంవల్ల క్రొత్త గ్రీన్‌లేబిల్ కాఫీ రుచి ఇదివరకు కంటే చాలా అమోఘంగా వుంటుంది. అంతేకాదు ...,బ్రూక్‌బాండ్ వారిచే ప్రథమంగా ప్రవేశపెట్టబడిన క్రొత్త 'కీప్-ఫ్రెష్' ప్యాకెట్ కాఫీపొడి అప్పుడే చేయించిన కాఫీపొడిలాగ చెమ్మ ఎక్కకుండా వారాలకొద్దీ ఎప్పటికప్పుడే తాజాగా వుంటుంది.

## క్రొత్త గ్రీన్ లేబిల్

**అమోఘమైన రుచి విశిష్టమైన తాజాతనము**
**(ఇది బ్రూక్‌బాండ్ వారు మాత్రమే చేయగలరు)**

ఎన్నిక చేసిన కొన్ని పట్టణములలో మాత్రం లభించును.

OBM 7148 TG

## ✻ లోకంపోకడ — ఓమెక ✻

















**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభు ప్రసాద్

సంపాదకుడు

[1938 1972]

శుక్రవారం 3-12 '82

దుందుభినామ సం కార్తీక బ తదియ

సంపుటము 75 సంచిక 14

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

✻

ఆరు మాసాల చందా రు 42-90

పోస్ట్‌లో ఏడాది చందా రు 85 80

విడి ప్రతి వెల రు 1-50

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం

నటి జయప్రద

(ఫొటో : జగ్‌మోహన్)

# మనలో మాట

గత వారం దీపావళి సంచికలో ప్రచురించిన ★ ఉప్పులేని కూడు ★ ఉగాదం ★ నీ గుండె కార్చిన కన్నీళ్ళు; ఈవారం వేసిన ★ పిసినారి తపస్వి ★ మదర్పిత....తాంబూలాది .... ★ హాసినా ఉషలతో దీపావళి కథల పోటీలో రు. 600 లు బహుమతి పొందిన కథల ప్రచురణ పూర్తి అయింది.

ఎప్పటి మాదిరిగానే ఈ సారి కూడా పాఠకుల కోసం దీపావళి కథలపై బాలెట్ని, వ్యాసరచన పోటీని నిర్వహిస్తున్నాము.

పాఠకుల ఎన్నికలో బహుమతి పొందిన ఈ ఆరు కథలలో అత్యుత్తమమైన కథ పేరుని పాఠకులు ఈ కింద ఇచ్చిన బాలెట్ పత్రంలో పేర్కొనవలసిందిగా కోరుతున్నాము. అలాగే బహుమతి పొందిన ఈ ఆరు కథలనీ సమీక్షిస్తూ ఫుల్‌స్కేపు కాగితానికి మించకుండా ఒక సమీక్షా వ్యాసం రాసి, దానితో పాటు పూర్తిచేసిన బాలెట్ పత్రాన్ని జతపరచి పంపాలి. ఈ పేజీలో ఇచ్చిన బాలెట్ పత్రాన్నే ఉపయోగించాలి. వ్యాసం రాసినా రాయకపోయినా బాలెట్ పత్రాన్ని పాఠకులందరూ పూర్తి చేసి పంపవచ్చు.

వ్యాసమూ, బాలెట్ పత్రంతో రాసిన వారి పూర్తి పేరు, చిరునామా స్పష్టంగా రాయాలి. వ్యాసం పంపే కవరు మీద "దీపావళి కథలపై వ్యాసరచన పోటీకి" అని రాసి, సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520003 కి పంపాలి.

వ్యాసరచన పోటీలో మొదటి బహుమతి పొందిన వ్యాసానికి రు. 250, రెండవ బహుమతి పొందిన వ్యాసానికి రు. 150, మూడవ బహుమతి పొందిన వ్యాసానికి రు. 100 లు అందజేస్తాము.

పాఠకుల తీర్పును అనుసరించి బాలట్ లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు. 650, రు. 550, రు 450 లు అదనపు బహుమతులుగా అందజేస్తాము. మిగిలిన మూడుకథలకి ఒక్కొక్కదానికీ రు. 250 చొప్పున కన్సొలేషన్ బహుమతి లభిస్తుంది.

బాలట్, వ్యాసరచన పోటీ ఫలితాలతో పాటు ఈ ఆరుగురు కధారచయిత(త్రు)ల పరిచయాలని సంక్రాంతి సంచికలో ప్రచురిస్తాము.

పాఠకులంతా ఉత్సాహంగా పాల్గొని బాలట్ వ్యాసరచన పోటీలని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము.

స్థలాభావం వల్ల ఈ వారం కొన్ని మామూలు శీర్షికలని వెయ్యలేకపోతున్నాము

.................................................................

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

**బాలట్ పత్రం : ముగింపు తేది 4-12-1982**

**నాకు నచ్చిన దీపావళి కథ**

కథ పేరు : "............................................"

పంపిన వారి పూర్తి పేరు : ............................................

చిరునామా : ............................................

............................................

# పాపం! రాజీవ్‌గాంధీ!




పాపం రాజీవ్‌గాంధీ! ఆయన భారత దేశానికి ప్రధానమంత్రి కారు, కాలేరు — ఆయన తల్లిగారు ఎంత ప్రయత్నించినాసరే!

"నువ్వెలాగ చెప్పగలవు?" అంటారా? నేను జ్యోస్యుడిని కాను, సాముద్రిక శాస్త్రం నాకు రాదు. సంఖ్యాశాస్త్రం అంటారే అదీ రాదు నాకు అయినా చెప్పగలను.

అయితే, నేను ఈ మధ్యనే మోతీలాల్ నెహ్రూ తన కుమారుడికి రాసిన లేఖలో చదివాను. వీటిని నెహ్రూ స్మారక సంస్థ వారు వెలువరించారు. ఈ సంస్థ [నెహ్రూ మ్యూసియమ్]ని భరించేది ప్రజలు వారి డబ్బుతో ఈ పుస్తకాల్ని ఎందుకు వెయ్యాలి? పోనీ వేశారు, మోతీలాల్ తండ్రి తాలూకూ సాహిత్యం ఏదయినా కూడా ప్రచురిసారా? ఈయన ఢిల్లీకి కొత్వాల్‌గా పని చేశారని అంటారుకాని దానికి సాక్ష్యం ఇవ్వలేరు మోతీలాల్ నెహ్రూ లేఖలని వేసిన వారు. ఇప్పుడు దాని సంగతి మనకి అనవసరం.

నేను చదివిన లేఖలు జవహర్‌లాల్ ఇంగ్లాండులో చదువుకున్న కాలానికి సంబంధించినవి ఆయన హారో (బడి)లో రెండేళ్ళు కేంబ్రిడ్జి (విశ్వవిద్యాలయం)లో మూడేళ్ళు, లండన్‌లో "లా"ని చదువుతూ మూడేళ్ళు గడిపారు ఆయన "ఐ. సి. ఎస్" పరీక్ష రాద్దామని కష్టపడ్డారు కాని నెగ్గలేక పోయారు తన కుమారుడు 'ఐ సి ఎస్'లో చేరాలని మోతీలాల్ చాలా ఆశపడ్డారు అదే గనుక జరిగి ఉంటే నెహ్రూ 1947 ప్రాంతంలో, బహుశ న్యూఢిల్లీ - పి డబ్ల్యు. డి శాఖకి, కార్యదర్శిగా రిటైరయ్యేవారేమో! లేకపోతే, ఆయన అలహాబాదులో ఇన్‌కమ్ టాక్స్ కమిషనరు పదవీ విరమణ చేసి ఉండేవారు ఐ సి ఎస్. లో చేరలేక ఆయన భారతదేశానికి ప్రధానమంత్రి అయ్యారు.

మోతీలాల్ కార్యసాధకులు ఆయన అంత పైకి వస్తే అంతా తమ స్వంత శ్రమ వలననే ఆయన కష్టపడేవారు, ఇతరులచేత కష్టపడి పనులు చేయించేవారు తన భార్య ఆరోగ్యం బాగాలేకపోయినా ఆమెని యూరోపు అంతా తిప్పారు. ఆమెచేత గౌనులు వగయిరా వేయించారు అలహాబాదులో ఆయనకి కొందరు ఇంగ్లీషు స్నేహితులు ఉండేవాళ్ళు వాళ్ళకి ఆయన తరుచు విందులు చేసేవారు. వీళ్ళ సాయంతో మోతీలాల్ తన కుమారుడిని ఇంగ్లాండుకి తీసుకువెళ్ళి హారో (బడి) లో చేర్చారు. మోతీలాల్ ఇచ్చిన విందులని గురించి ఎన్నో కథలు; అవి మనకి అనవసరం. మనకి కావలిసింది ఆయన తన కొడుకుని గొప్పవాడిని చెయ్యటానికి పడినపాట్లు ఆ కొడుకు ఆరోగ్యం అంత బాగాఉండేది కాదు, తరుచు జలుబులతో బాధపడేవాడు తన తండ్రి ఆశలు ఏమిటో అతనికి అర్థం అయ్యేదికాదు కాశ్మీరీ బ్రాహ్మణులలో ఒక వింత గడసరితనం ఉంటుంది జవహర్‌లాల్‌లో పెంకితనం వేరే ఉండేది ఇవి రెండూ కలిపి తండ్రి ఆశలు నెరవేరకుండా అడ్డుపడ్డాయి. [మోతీలాల్ ఆశల క్రమం ఇది: తన ఏకైక కుమారుడు మంచి విద్యార్థి కావాలి, ఐ సి ఎస్ ఆఫీసరు కావాలి, కేంబ్రిడ్జిలో "రాంగ్లర్' బిరుదు సంపాదించు కోవాలి, బారిస్టర్ కావాలి ఈ ఆశల్లో ఏదో ఒకటి నెరవేరగలదని ఆయన ఆశ. చివరికి ఏమయింది?

జవహర్‌లాల్ చదువు అంత గొప్పగా సాగలేదు ఆయనకి లెక్కలు ఫిసిక్స్‌లో తక్కువ మార్కులు వచ్చేవి; ఆయన లాయరుగా వెలిగిపోలేదు; సీతాకోక చిలుక లాగ ఒక శాస్త్రాన్ని వదిలి మరొక శాస్త్రానికి మారేవారు; ఇదంతా చూసి తండ్రి మోతీలాల్ కోపం తెచ్చుకుని "ఏదో ఒకటి తేల్చుకో"మని హెచ్చరించేవారు. లండన్‌లో "బార్" కి చదువుతూ నెహ్రూ ఏమి చేశారు? ఆనవాయితీగా కొన్ని విందులు చేశారు, వీధుల వెంబడి షికార్లు వెళ్ళేవారు. 1912లో భారతదేశానికి తిరిగి వచ్చినప్పుడు మోతీలాల్‌కి ఎంత చిరాకు వేసిందంటే కుమారుడికి స్వాగతం చెప్పటానికి బొంబాయికి కూడా రాలేదు — అంతక్రితం ఆయన కుటుంబం సమేతంగా ఇంగ్లాండు వచ్చి కొడుకుని వెనక్కి తీసుకురాగలమన్నారు.]

నేను చదివిన ఒక లేఖలో మోతీలాల్ తన కుమారుడికి "ఇక్కడ నీకు ఖాళీలేదు" అని రాశారు అంటే, నీ సంగతి నువ్వుచూసుకో —అనేకదా అర్థం?

నెహ్రూ స్మారక సంస్థవారి పుస్తకంలో మోతీలాల్ రాసిన లేఖలు కనబడుతాయి కాని జవహర్‌లాల్ సమాధానాలు ఉండవు అయినా, ఒక సంగతి బాగా తెలుస్తూనే ఉంటుంది; అదేమిటంటే, మోతీలాల్‌కి తన



సోవియట్ యూనియన్ అధ్యక్షుడు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ లియోనిద్ ఇల్యిచ్ బ్రెజ్నెవ్ మాస్కోలో నవంబరు 10వ తేదీన అకస్మికంగా మృతిచెందారు.

కొడుకు రాజకీయాలలో చేరటం ఇష్టంలేదు. రాజకీయాలంటే, భారతీయ రాజకీయాలు మాత్రమే కావచ్చు. జవహర్‌లాల్ బ్రిటన్‌లో పత్రికలలో పడినవాటిని వేటినో గురించి తండ్రికి రాస్తారు. మోతీలాల్‌కి ఇది ఏమాత్రం నచ్చక కుమారుడిని గట్టిగా మందలిస్తారు. తన తండ్రి చేసిన ప్రసంగాలని జవహర్‌లాల్ పొగిడినా మోతీలాల్‌కి ఇష్టం ఉండదు.

మోతీలాల్ సలహా ఏమిటో తెలుసా? తన కొడుకు లండన్‌లో పెద్దవారిని కలవాలి, వారి పిల్లలతో స్నేహాలు చెయ్యాలి, ఐ.పి.ఎస్.లో చేరినప్పుడు ఈ స్నేహాలు బాగా పనికివస్తాయి. జవహర్‌లాల్‌ని లండన్‌లో 'జో' లేదా 'జాక్' అని పిలిచే వారని తెలిసిన మోతీలాల్ ఆనందానికి అంతు లేదు. ఒక అలహాబాదు జడ్జి మోతీలాల్‌కి రాస్తాడు — "మీ అబ్బాయిని లండన్‌లో కలిశాను, అతను చాలా బాధ్యతకలవాడు" — అని. మోతీలాల్‌కి ఈ ఉత్తరం రాజముద్ర వంటిది. దానిని ఎప్పుడూ జేబులో ఉంచుకునేవారు. దాని నకళ్లు తీయించి తన అన్నగారికి పంపారు. ఇక జవహర్‌లాల్ "జె. నెహ్రూ ఎస్క్వయిర్, ఎమ్.ఎ (కాంటాబ్), ఐ. పి. ఎస్." అనక తప్పదు, ముందు ఝాన్సీలో జిల్లా మెజిస్ట్రేటు. ఆపయిన వచ్చేన మెట్టు ఎక్కడమే కదా? చివరికి గవర్నరు ఉద్యోగం ఖాయం. ఎందు చేతనంటే, తండ్రికి ఎవరిని ఆశ్రయించి ఏ పనులు చెయించుకోవాలో బాగా తెలుసు. కాని, ఇదంతా జరగటానికి ముందు తన కుమారుడిని అసలయిన సిసలయిన ఇంగ్లిషు వాడిని చెయ్యాలి, అందుకనే హారో, కేంబ్రిడ్జిలు.

కుమారుడు ఇంత ఎత్తుకి చేరలేదు తన తండ్రికి చిరాకు పుట్టిస్తూనే తనకి కావలసింది సాధించటం జవహర్‌లాల్ ప్రత్యేకత. అసలు అది ఒక నెహ్రూ – ప్రత్యేకత అనవచ్చు. ఒక సెకెండ్‌క్లాస్ డిగ్రీతో అలహాబాదుకి తిరిగి వస్తారు జవహర్‌లాల్ నెహ్రూ. తండ్రి తన ఛాంబర్‌లో అలిగి కూర్చుంటారు. జవహర్‌లాల్ భవిష్యత్ ఏమిటి? ఏమో, అనిపించే కాలంలో ఆయన రాజకీయాలలోకి దిగారు. మోతీలాల్‌కి జ్ఞానోదయం అయింది. ఆయన తన "ఆంగ్లేజీ" ప్రదర్శనని మానుకుని, విందులు — వినోదాలని కట్టిపెట్టి, ధోవతి ధరించి ఒక పెద్ద జాతీయ నాయకులుగా మారిపోయారు. తన కుమారుడి మీద పెట్టుకున్న ఆశల స్వరూపం మాత్రం మారింది. జవహర్‌లాల్‌ని కాంగ్రెసు అధ్యక్షుడు చేస్తారు. అంతకి తక్కువ అయితే ఒప్పుకోరు.

ఇందిరాగాంధీ విషయంలో జరిగింది ఇంచుమించు ఇంతే. ఇందిర యూరోపులో చదివినా ఎక్కడా ఒక్క పరీక్ష పాస్‌కాలేదు. ఎన్నోఏళ్ళు తండ్రిని అంటిపెట్టుకుని ఉంటే చివరికి ఆయన ఆమెకి ఏదో పదవి ఇప్పించారు. ఇందిరా పెళ్లి చేసుకున్న ఫిరోస్ ఆమె కుటుంబానికి నచ్చిన వరుడు కాదు. ఇదీ నెహ్రూ కుటుంబ లక్షణాలలో ఒకటి. వయసుకి వచ్చిన నెహ్రూ ఎవరూ తలిదండ్రుల మాట వినలేదు. సంజయగాంధీ కూడా అంతే కదా? ఆయన మరీ దుడుకు వ్యక్తి, అంతే తేడా. సంజయ్‌ని డెహ్రాడూన్‌లో ఒక పెద్ద బడికి పంపారు. ఇంకా ఎక్కడికో పంపారు. చివరికి ఆయన ఒక కార్ మెకానిక్ అవగలిగారు. తన తల్లి చెప్పినట్టు చేసే అలవాటు ఆయనకి లేదు. ఇందిర ఏమో జవహర్‌లాల్ మాట వినేవారు కాదు, జవహర్‌లాల్ ఏమో మోతీలాల్ మాట వినేవారు కాదు. సంజయ్‌ని నెహ్రూల కుటుంబ వ్యాపారమైన రాజకీయాలలోకి దింపారు. నెహ్రూ లందరూ చేసేది ఈ వ్యాపారమే అనుకుంటే—

— రాజీవ్ సంగతి వేరు అనిపిస్తుంది. ఆయన తన పెద్దలు ఏమి చెబితే అది చేస్తారు. ఆయనలో పెంకితనం లేదు. అందుకనే, అనుకుంటూ ఉంటాను: ఈయన నెహ్రూ కుటుంబం వారి వ్యాపారానికి పనికిరారు, ఆయన నడపగలిగినదల్లా బోయింగ్ 737 విమానాలే అని. ★

## మనవి

డాక్టర్ సలహాలు, ప్రశ్నావళి శీర్షికలకి ప్రశ్నలు పంపేవారు తాము పంపే శీర్షిక పేరు రాసి కేరాఫ్ సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగర్, విజయవాడ – 520003 అన్న చిరునామాకి పంపాలి. రాసిన వారి పూర్తిపేరు, చిరునామా యివ్వడం ఎంతైనా అవసరం. —సం.



# పిసరంత గండె

శైంద్ర

దీపావళి కథల పోటీలో రు.600 బహుమతిపొందిన కథ

"అంకు లంకుల్... ఈ బొమ్మ చూసేవా... ఎంతబావుందో..." కళ్ళనిండా అంతులేని ఆనందం నింపుకుని, బొమ్మని గుండెలకు హత్తుకుని వచ్చిన పాప శంకరం ఆలోచనల్ని చెదరగొట్టింది.

"ఊఁ బావుంది పాపా, ఎక్కడిదీ?" ఆలోచనలు తేలి గాల్లో కలిసిపోయినా, అవి తెచ్చిన విషాదం ఉండ చుట్టుకుని గొంతులో అడ్డంపడడంతో మాట కూడా బరువుగా వచ్చింది.

"మరేం మా డాడీ నిన్న సాయంత్రం ఎగ్జిబిషన్కి తీస్కెళ్ళేరు కదా? అక్కడకొన్నారంకుల్...." గడ గడా చెప్పుకుపోతోంది పాప.

"అవును పాపా ఈ బొమ్మ కూడా నీలా చక్కగావుంది" అని మాత్రం అన్నాడు. "బొమ్మ నీకెలా ఆనందాన్నిస్తుందో నువ్వు నాకలా ఆప్యాయత నందిస్తున్నావమ్మా" అని లోలోన గొణుక్కున్నాడు.

"ఏమిటంకుల్ అంటున్నావు?"

"అబ్బే ఏంలేదు పాపా, జాగర్తగా దాచుకో" అన్నాడు ఉత్సాహం తెచ్చిపెట్టుకుంటూ.

"వరేనంకుల్, మమ్మీ పిలుస్తోంది వెళ్ళొస్తా," అంటూ చెంగు చెంగున వెళ్ళిపోయింది పాప.

పాప వెళ్ళిన దిక్కే కాస్సేపలా చూస్తూ ఉండిపోయేడు శంకరం.

పాప!

గుండ్రంగా చక్రాల్లా కళ్ళు తిప్పుతూ, టప్పు టప్పున రెండు చేతులు వూపుతూ, గల గల నవ్వేసే చిన్నారికి పిర్యాదు లేకన్నా వుంటుంది 'అంకు అంకుల్' అని పిలుస్తూ. పాపేగాని తనకు దగ్గరకాపోతే ఎప్పుడో తన జీవితం మరో మలుపు తిరిగేదేమో! మేస్టారన్నట్టు ఇది తన 'సెంటిమెంటా'?

"అదేంటి శంకరంగారూ! మా పాప వల్ల మీ జీవితం మలుపు తిరిగిందనుకుంటూ దాన్ని ముద్దు చేస్తున్నారే గాని ... అది కేవలం మీ సెంటిమెంటండీ." అన్నారు మేస్టారో రోజు

"దానికి మీరు సెంటిమెంటని పేరు పెడితే పెట్టండి కాని మేస్టారూ... నా జీవి

లాగాక పాప తెచ్చిన మలుపు మాత్రం నిజం '' అన్నాడు శంకరం

పాప వెళ్ళిపోయి పదినిమిషాలైనా అలానే చూస్తూ వుండి పోయిన శంకరం "పోస్ట్" అన్న కేకతో ఈ లోకంలోకి వచ్చేడు.

ఆతృతగా గుమ్మం దగ్గరకి వెళ్ళేడు. అది కేవలం తన ఆతృతేనని, కేవలం తన కోరికేనని శంకరానికి తెలుసు. దానికి తగ్గట్టుగానే ప్రక్క పోర్షన్ గుమ్మంలోనికి ఉత్తరం గిరాటువేసి వెళ్ళిపోతూన్న పోస్ట్‌మేన్‌ని చూసి, తిరిగి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

ఎక్కడ నుండి రావాలి ఉత్తరం?

ఎవరు రాస్తారు?

అసలు ఎక్కడైనా ఎవరైనా ఎవరున్నారు గనుక మరెందుకు 'పోస్ట్' అన్న కేకకు తను అంతగా ఆకర్షింపబడతాడు?

విరక్తిగా నవ్వుకున్నాడు శంకరం.

మధ్యాహ్నం రెండయింది

పాప స్కూలుకివెళ్ళింది. ఇటు మేస్టారూ, అటు బాబాయిగారూ వాళ్ళ వాళ్ళ డ్యూటీలకు వెళ్ళేరు ఎదుటి పోర్షనులో మధ్య వయసు ఆడాళ్ళంతా కబుర్లకి చేరినట్టున్నారు పెద్ద వయసు వాళ్ళు ఎండ వేడికి ఓ కునుకు తీస్తున్నారు.

మరంచేత కాంపౌండంతా నిశ్శబ్దంగా వుంది.

శంకరం గుండె కూడా నిశ్శబ్దంగానే కాదు భయంకరమైన నిశ్శబ్దంతో మూలుగుతోంది కడుపు ఆకలితో మాత్రమే కాదు దుర్భరమైన ఆకలి నొప్పితో వలుగుతోంది. మనసు ఆలోచనలతో కాదు .. వీటన్నటినీ అంతం చేసే అంతులేని ఆలోచనలతో కదిలిపోతోంది.

'కాంపౌండంతటికీ మగపురుగు తనొక్కడే. ఉద్యోగంలాంటి ఏ పురుష లక్షణమూ లేకుండా' పిచ్చిగా నవ్వుకున్నాడు శంకరం.

ఉద్యోగం లేకపోవడం ఎంతనేరం కింద చూస్తారీ మధ్యరకం కుటుంబీకులు! కనుబొమలు కిందికి దించి, కళ్ళు కుంచించి ఈ నేరస్థుడి గదివేపు చూసి మాటాడు కుంటున్నారు ఎదురింటి పోర్షనులోని ఆడవాళ్ళు.

మనస్సు చివుక్కుమంది శంకరానికి.

ఏంచేస్తాడు? బాధపడ్డం తప్ప...

ఆశ్చర్యమే!

ఉద్యోగం బాధలూ, ఉద్యోగం లేని బాధలూ, అప్పుల బాధలూ, అప్పులోళ్ల బాధలూ, తిండి బాధలూ, తిండి లేని బాధలూ, ఇంటి బాధలూ, ఒంటి బాధలూ ... ఇన్నీ అన్నీ కావుమరి. ఈతిబాధలన్నీ పడ్డాడు అన్ని బాధలు పడ్డ తర్వాత కూడా ఇంత చిన్న విషయానికి — అక్కడి ఆడవాళ్ళు ఉద్యోగం లేని తనని నేరస్థుడిలా చూస్తున్నారు అన్నంత చిన్న విషయానికే బాధపడే సున్నితమైన మనసు తన కుందంటే ఆశ్చర్యంకాదూ ...

పుట్టక ముందే తండ్రినీ, పుట్టేక తల్లినీ పోగొట్టుకున్నాడు. అనాథ ననిపించుకోకుండా ఓ శరణాలయాన్నే నాథుడిగా చేసుకున్నాడు. అక్కడ ఉన్నన్నాళ్ళూ ఇంత తిండీ, అంత లోకజ్ఞానమూ, మరంత మాత్రం తిండి పెట్టగల చదువూ ఇచ్చేడా నాథుడు!

దాంతో ఊరమీదపడి చెయ్యని పనులు లేవు, మానెయ్యని ఉద్యోగాలు లేవు

తెగిన గాలిపటం లాంటి తన బతుకూ, గాలికెగిరే ఎంగిలాకు లాంటి తన జీవితం ఎవ్వరికీ తెలియకుండా వుండాలని ... మారని ఇళ్ళు లేవు, చూడని ఊళ్ళు లేవు.

దొరికితే ఏ ఉద్యోగమో, కాకపోతే ఏ పనో, లేకపోతే ఏ కూలీయో చేసినపుడు చేతిలో నాలుగు డబ్బులాడితే కోరికలు తీర్చుకోవడమూ ... ఏదీ దొరక్క డబ్బుల్లేనపుడు కోరికలు అణచుకోవడమూ శంకరానికి తెలుసును అంతేకాని ఇన్నేళ్ల జీవితంలో అనుబంధాలూ, అనురాగాలూ, ఆప్యాయతలూ మొదలైన మాటలు శంకరానికేమాత్రం తెలియవు.

కథ పునిండిన పై వర్గపు మేధావులు సృష్టించిన రెండక్షరాలమాట ప్రేమ—దీన్ని సాహిత్యంలో ప్రవేశపెట్టి పూర్వకాలపు పురాణాల దగ్గర నుండీ నవీనకాలపు నవలల వరకూ పుంఖాను పుంఖాలుగా కథలు సృష్టించేరు వాటిని రాసేవారికీ తెలుసును, చదివేవారికీ తెలుసును — ప్రేమ కాదది కోరికని. అయినప్పటికీ మనకి తెలియకుండానే చిక్కుకున్న మిధ్యాలోకపు ప్రభావం వల్ల అది అబద్ధమని ఒప్పుకోము.

అయితే ప్రాక్టికల్ దృష్టి ఉన్నవాళ్ల కెప్పుడూ ఈ రెండక్షరాల మాటా, దాని మీద సృష్టించబడ్డ కథలూ, సినిమాలూ మొదలైనవి ఏ చెరుపూ చేయలేదు.

జీవితంలో ఎన్ని ఢక్కామొక్కీలు తిన్నప్పటికీ, ఆ అనుభవాల వల్ల ఈ అనుబంధాలూ, అనురాగాల పేరిట పన్నే వలల బారిన పడకుండా ఎంత నిక్కచ్చిగా ఉన్నప్పటికీ కొన్ని కొన్ని స్పందనలనీ, అనుభూతులనీ కొట్టిపారేయడానికి వీల్లేదన్న సంగతి మేస్టారి పాపని చూసేక శంకరానికి బోధపడింది పసి పాపలు కరోడాలాంటి వాళ్ల మనసుల్లోకి కూడా అల్లరి కత్తులు దూసి ఆప్యాయతలు చిమ్మగలరని స్పష్టంగా తెలిసింది.

"అన్నం తినకుండా మంచినీళ్ళు తాగేస్తున్నారేం అంకుల్, ఉండు నా జాంకాయ ఇచ్చేస్తాను, తిన్నాక మంచినీళ్ళు తాగుదువు గానిలే." అంటూ సగంతిన్న జాంకాయ తన నోట పెట్టినప్పుడూ ...

"నీ బర్త్ డే ఎప్పుడంకుల్? తెలీదా, పోనీ, ఈ రోజు నా బర్త్ డే కదా నువ్వూ ఈ రోజే చేసుకో, అందరికీ నీ వంతుకూడా చాక్లేట్లు నేనే ఇచ్చేస్తాను" అని పిల్లలందరికీ రెండేసి చాక్లేట్లు పంచినపుడూ ...

"అంకు లంకుల్, మరీ, మా మామయ్య లెటరాసేడంకుల్, మమ్మల్నందర్నీ హైదాబాద్ రమ్మనీ..." అని కళ్ళల్లో సంతోషం చక్రాలు తిరిగినపుడూ ...

"నిన్న నువ్వు కబుర్లు చెప్తూంటే వింటూ వుండిపోయాను కదంకుల్, మరేం హోంవర్కు చెయ్యడం మర్చిపోయేను, అందుకని మా టీచరివాళ కేనోక్లాక్సి రంకుల్" అవే కళ్ళల్లో కన్నీటి సుడిగుండాలు తిరిగినపుడూ ...

శంకరం గుండెల్లో అతనికే తెలియని కదలికలూ, అతనికే వినిపించిన చప్పుళ్ళూ అతన్ని జీవితం నుండి దూరం కాకుండా వుండనిచ్చేయి.

ఉద్యోగం పోయినపుడూ, పనిలేనపుడూ, కూలీ దొరకనపుడూ, ఆకలివేసినపుడూ, నిరాదరణ రుచి చూసినపుడూ, నిరాశ నిద్ర పుచ్చినపుడూ... ఎప్పటికప్పుడు జీవితం చాలిందా మనుకునే శంకరం పాప సాన్నిహిత్యంతో తన జీవితం పులకించిందను కున్నాడు. మలుపు తిరిగిందనుకుని సంతోషించేడు.

కాని ఇప్పుడు మళ్ళీ ఎందుకో నిరాశ ఆవరిస్తోంది శంకరాన్ని... జీవితాన్ని కబళించేలా

నిరాశగా మాటాడినపుడు మేస్టారూ,

# పిసరంత గుండె

ఎక్కింటి బాబాయిగారూ... ఎందుకేమిటని అడిగితే వచ్చే సమాధానంగా చెప్తాడు.

ఎందుకో శంకరానికి తెలుసు. మరీ ఒత్తిడి చేస్తే...

"ఆప్యాయతలూ, అనుబంధాలూ అన్నం పెట్టవు. ఆత్మాభిమానాన్ని పెంచుతాయి గాని..." అని ఓ డైలాగు చెప్పగలడు గుంభనగా, గంభీరంగా. అంతేకాని... "నా ఖాళీ కడుపుని ఎవరూ చల్లార్చగలరు? మ్యున్సిపాలిటీ వంపు నీళ్ళు తప్ప," అని ఆక్రోశించ లేడు.

ఎప్పుడైనా అతని ఆకలిబాధ కంపుకొడితే, దానవ పసిగట్టి చేతనైన సాయం చేస్తారు వాళ్ళిద్దరూ. నిరాశ నీరు కార్చేస్తూ వుంటే తమ పలుకుబడి ఉపయోగించి ఉద్యోగమో సద్యోగమో ఇప్పించడానికి ప్రయత్నిస్తారు.

ఆ సాయం భోజన రూపంలో చేస్తే... అవురావురని ఆకలి తీర్చుకోక సగం చచ్చిపోయిన అతని ఆత్మాభిమానం కాంపౌండులోని ఆడాళ్ళకి టిక్కులా కన్పించేది అతని ఉద్యోగం కోసం ప్రయత్నాల రూపంలో, చేస్తే చొరవా, చురుకుదనం చూపించక ముసుగు వేసుకున్న అతని మొగమాటం పొగరు మోత్తనంలా కన్పించేది.

స్పందనలనీ, ఆప్యాయతలనీ, ఆత్మాభిమానమనీ ఇదనీ అదనీ అతను పెంచుకున్న వన్నీ మధ్య రకం మనిషి తత్వమేగాని మరో హాటి కాదని శంకరం అర్థం చేసుకున్నాడు. ఈ గదిలోకి రాకముందు మొరటుగా, మొండిగా, బేఖాతరుగా ఒతికిన బతుకే నయమనిపిస్తోంది. అయితే ఇప్పుడు వెనక్కి వెళ్ళ లేడు మరి ముందుకే వెళ్ళదలిస్తే... ?

"పోస్ట్" అని కేకేస్తూ బాబాయి గారింట్లోకి ఓ ఉత్తరం విసిరేడు పోస్టుమేన్.

అప్పుడే సాయంకాలం డెలివరీ వచ్చేసింది!

ఇప్పుడు కూడా తనకేం రాలేదు.— అనుకున్నాడు శంకరం.

అవును ఏదీరాదు.

ఓ ఇంటర్వ్యూకార్డు... అబ్బే

ఓ అపాయింటుమెంటార్డరు... అబ్బోసి.

ఓ లవ్‌లెటర్... మొహం చూడు

ఓ ఉత్తరం... అంతోటి

అబ్బే .. తనకేం వస్తాయి ?

"మమ్మీ... ఒచ్చేసా..." మేస్టారి పాప కాన్వెంటు నుండి వచ్చేసినట్టుంది.

ఆకలి మళ్ళీ మళ్ళీ నేనున్నానని గుర్తుకు తెస్తోంది

గత జీవితంలో ఇలాంటి పరిస్థితుల్లో ఏ కూలిపని చేసైనా ఆకలి మంటని ఆర్పేవాడు శంకరం కాని ఇక్కడికి వచ్చేక కూలీనాలీ చేసే తత్వంపోయింది మధ్యతరగతి మెట్లెక్కేడు. మరంచేత మెహర్బానీలతో ఆకలికి ముసుగేయడం అలవాటైంది.

నీళ్ళు చిలకరించి ఆకలి మంటని తాత్కాలికంగా ఆరేడు.

"అంకుల్... ఏం చేస్తున్నారంకుల్..." ఇంట్లోకి వెళ్ళకుండా వాళ్ళ గుమ్మంలో నుంచునే గట్టిగా కేకేస్తోంది పాప.

"ఏం పాపా... ఎందుకూ...?" అంటూ కటికీలోంచి చూస్తూ అడిగేడు శంకరం.

'ఇవాళ స్కూల్లో మాంఛి పాఠం చెప్పేరు..."

"ఏం పాఠం... ?"

"అబ్బా... ఆఁ... నేనిప్పుడు చెప్పనూ... రేపు— రేపొద్దున్నే రాసి చూపిస్తానూ..." అంటూ లోపలికి వెళ్ళిపోయింది

ప్రతి విషయం తనకు చెప్పందే తృప్తి కలగదు కామోసు పాపకి... అదిగో... మళ్ళీ ఆప్యాయత మనసుని లాగేస్తోంది.

ఆకలి కొరికేస్తోంది పేగుల్ని.

ఇవాళే ఆశలకి సమాధి కట్టేయాలి. ఆకలి మంటల్ని మంట కలిపేయాలి.

గట్టిగా నిశ్చయించుకున్నాడు శంకరం.

కను చీకటి పడుతోంది చీకటి కళ్ళు తెరుస్తున్నట్టు అక్కడా అక్కడా ఒక్కటీ ఒకటీ వెల్తురు కిటికీలు మెరుస్తున్నాయి—

శంకరం చేసిన నిర్ణయం శంకరానిదే.

అంచేత తిరుగులేదు. అమలు వేయడం మానడం అతని చేతుల్లోనే వుంది. ఎవరో వస్తారనీ, ఏదో చేస్తారనీ, మరేదో జరుగుతుందని అతను నమ్మడు గాక నమ్మడు— జీవితం తెలుసును గనక.

వెల్తుర కిటికీల చీకట్లో కలుస్తున్నాయి.

శంకరం ఆకలీ, శంకరం బాధా, శంకరం జీవితం, శంకరం నిర్ణయం ఇవేవీ పట్టనట్టుగా నిదపోతోంది కాంపౌండంతా.

చక్రం తిరగడం ఎంతసేపు ?

"నా బతుకు నేను బతుకుతున్నానయ్యా.. మీకేదో ఒరగ బెట్టడానికి నేను రావడం లేదు.." అన్నట్టుగా సూర్యుడు లేస్తున్నాడు.

బండెడు పుస్తకాలతో, ఇంటి దగ్గర కూడా బండెడు చాకిరీ చేస్తేగానీ పని ఓమ్మంకేమీ లేకుండా క్లాసులో అడుగు పెట్టగలదు కాన్వెంటు పాప. మరంచేత సూర్యుడితోనే లేచి శంకరం చేత హోంవర్కులోని తప్పులు దిద్దించుకుంటుంది.

"ఏ లెటర్ టు యూ అంకుల్..." అంటూ తలుపు తట్టింది పాప.

ఎక్కడి నుండీ తనకు ఉత్తరం వచ్చే అవకాశం లేదన్న సంగతి శంకరం తెలుసుకున్నాడు. అయితే పాప చెప్పిన లెటరు తన టీచరు ముందు రోజు చెప్పిన మాంఛి పాఠమని శంకరానికి తెలిసే అవకాశం లేదు.



# ప్రతి వయసులోనూ మీకు తోడు.

అమ్మకి, నాన్నకి, పసివాళ్ళకి, అమ్మమ్మకి, తాతయ్యకి. హార్లిక్స్ అందరికీ ఎంతో మంచిది.

హార్లిక్స్ అంటే శాశ్వత ఆరోగ్యం.

అందువల్లనే కోట్లాది మంది 100కు పైగా సంవత్సరాల నుంచి హార్లిక్స్ మంచి గుణాలను విశ్వసిస్తున్నారు.

ప్రపంచ వ్యాప్తంగా ఉన్న డాక్టర్లంతా ఆరోగ్య సంరక్షణకు హార్లిక్స్ ఆదర్శప్రాయమైనదని శిఫారసు చేశారు. అంటే ఆశ్చర్యం లేదు.

హార్లిక్స్‌లో ఉన్న విలువైన, స్వచ్ఛమైన పోషక పదార్థాలను, వాటి మంచి గుణాలను కాపాడే విధంగా, తేలికగా జీర్ణమయే విధంగా అద్భుతమైన పద్ధతిలో మిశ్రమం చేశారు.

హార్లిక్స్ మీ కుటుంబ జీవితంలో భాగంగా ఉండేట్టు చూచుకోండి. మీ కుటుంబ సభ్యులందరికీ కావలసిన శక్తి నంతా సమకూరుస్తుంది.




మంచి పుష్టికరమైనది

HTD-HMM-7545TE

(గత సంచిక తరువాయి)

సూర్యుడస్తమించాడు. అంతవరకు కళకళలాడుతున్న కమలం అప్పుడు కనపడటం లేదని నిస్పృహతో తలవాల్చేసింది. సూర్యోదయంతో తిరిగి ప్రాణం పోసుకుని నిటారుగ నిల్చుంటుంది. రేపటి కోసం ఎదురుచూసే కమలంలా సాహిత్య — నిట్టూర్పుతూ — కంటికి కునుకు దూరమైతే మెత్తని పడక కూడా సహించనట్లు — మెదులుతూనే వుంది.

చల్లని తోటగాలి, కిటికీలోనుంచి గుప్పు గుప్పుమని వస్తున్న నైట్ క్వీన్‌ల సువాసనలు — పాడ్యమి చంద్రుని వెన్నెలకూడ మనస్సుకు ఆనందం కలిగించటంలేదు. చిరాకుగా చింతను కలిగిస్తున్నాయి. ఏది రుచించటంలేదు. దేనిమీద మనస్సు పోదు — కాని ఏదో కావాలి! కావాలి! అంటూ శరీరం జబ్బు పడినట్లు నిస్త్రాణగా వుంది. పడకపైనుండి లేచివచ్చి కిటికీ దగ్గర నిలుచుంది.

రాత్రులు సరిగ్గా నిద్ర లేకపోవటంతో కళ్ల చుట్టూ నల్లని వలయాలు ఏర్పడ్డాయి. మునుపటి హుషారు, అల్లరి ఏమైంది?

నీలాల నింగిలో నక్షత్రాలు మిణుకు మిణుకుమంటూ చంద్రుడు తమ యింటికి ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూస్తున్నట్లున్నాయి. అటుగా పోతున్న మేఘంతో తమ సందేశాన్ని విన్నవించుకుంటూ — రాయబారం నడుపమంటున్నాయి.

చంద్రుని చెంగట అల్లంత దూరంలో తనంత అందగత్తె లేనట్లు మురిసిపోతున్న వీనస్ తార — ఎప్పుడైనా చంద్రుని చేరుకుంటుందా? చంద్రుని చేరువగా వున్నందుకే మురిసిపోతూ తృప్తితో జీవితమంతా అలా గడిపేస్తుందా! వీనస్‌ను చూస్తుంటే అద్దంలో తన ప్రతిబింబం చూచుకుంటున్నట్లుగా ఉంది.

తనలో తనువూ, వయస్సు సరాగాలాడుతున్నాయి. ఇష్టమైనవాడు— ప్రేమించినవాడు కావాలనికోరుకునే సమయం. వెన్నెల చల్లగాలి తాపాన్ని కలుగచేస్తున్నాయి. ఒండొరులకు ప్రేమ వుంటే వారిద్దరిమధ్య ఏం నడుస్తుందో ఏకాంతంలో ఏం జరుగుతుందో తెలుసు. అనుభవం లేకపోయినా— అనుభూతులెన్నో! గవాక్షానికి ఆనుకుని నింగికేసి చూస్తూ; ''ఈ చల్లనిరాత్రిలో రవిచంద్ర ఏం చేస్తుంటాడో— తనలాగే విరహాగ్నిలో కాలి




పోతుంటాడా? లేక భార్య ప్రక్కన.'' ఇక ఆలోచించలేకపోయింది.

రవిచంద్ర కావాలన్న బలమైన కోరికతో శరీరం ఆరాటపడుతోంది. హృదయం ఆక్రోశిస్తూ వుంటే, దుఃఖంతో గుండెలు ఎగసెగసి పడుతుంటే— వచ్చి మంచాన్ని ఆశ్రయించింది సాహిత్య.

* * *

తూర్పు ఆకాశం ఎర్రరంగు పులుముకున్నది ఎర్రదనంలోనుంచి లేతలేత కిరణాలు పాడుచుకువచ్చి గవాక్షంలోనుండి వెచ్చగా— పడకపై వచ్చి పడుతున్నా సాహిత్యకు లేవాలనిపించలేదు. రాత్రి ఆలోచనలతో కన్నులు మూయనేలేదు. సుకుమార శరీరం అలసిపోయింది.తాపంతో వళ్లంతా కాలినట్లు, జ్వరం వచ్చినట్లు నీరసంగ వుంది— లేవాలని— పనికి పోవాలని అనిపించలేదు. నిరాశ నిస్పృహలు కృంగదీస్తుంటే పడకను అంటుకుపోయింది.

* * *

రవిచంద్ర ఎప్పటిలాగే ఆఫీసులో అడుగు పెడుతూనే సాహిత్య సీటువైపు చూశాడు. ఆమె కనిపించలేదు. ఆరోజు తను ఆఫీసుకు రావటం ఆలస్యమైంది. సాహిత్య వచ్చి ఎక్కడికైనా వెళ్లి వుండవచ్చు అనుకుంటూ తన గదిలోకి వెళ్లాడు.

క్లర్కు తెచ్చిన చెక్‌లమీద సంతకం చేశాడు ఆటెండర్ తెచ్చిన పోస్టులు చూశాడు. గోపి కథలు పట్టుకువచ్చాడు.

డెప్యుటీ ఎడిటర్ వచ్చి నవలల పోటీ విషయం మాట్లాడారు. ఇందరు వచ్చి వెళ్లినా సాహిత్య రాలేదు. అంతలో ఓ యువకుడు ఓ ఫైల్ పట్టుక వచ్చాడు. వస్తూనే ''నమస్కారం సార్'' అంటూ వినయంగ నమస్కరించాడు. కుర్చీలో కూర్చున్నాడు

''వాట్ కాన్ ఐ డు ఫర్ యు'' అన్నట్లుగ రవిచంద్ర చూశాడు. ఫైలు విప్పి రవిచంద్ర ముందుకు జరిపి అందులో వున్న కాయితాలు ఒక్కొక్కటే తీసి రవిచంద్రకు చూపుతూ ''సర్ నేను కార్టూనులు వేస్తాను...ఇవి ఎలా వున్నాయి?' అంటూ సగర్వంగ చూపించాడు.

''బొమ్మలు బాగున్నాయి...కాని . అంతకంటే బొమ్మలతో పలికించే మాటలు మరింకా బాగుండాలి ఒక్క చిన్న మాటతోనే గాలంలా నవ్వును పైకి లాక్కురావాలి. ఒక సంఘటనను వివరించితే అది కథ. అలాగే జీవిత సత్యాన్ని హాస్య రూపంలో పలికించేది కార్టూను...'' తన మనస్సులో మాట అతనికి అర్థమయ్యేలా చెప్పానా? అతను అర్థం చేసుకున్నాడా? లేదా? అన్నట్లుగా చూశాడు

అతను ఇబ్బందిగా అటు ఇటు కదిలి, ''సార్! నా బొమ్మలు బాగాలేవా? ఈమధ్య మీరు వేస్తున్న వాటికంటే లక్ష రెట్లు బాగున్నాయని మా ఫ్రెండ్స్ అన్నారు. మీరేమో ఇలా అంటున్నారు.''

రవిచంద్ర ఓర్పుగా ఆ కాయితాల వైపు చూశాడు. ''మీరు పత్రికకు పంపదలుచుకుంటే డ్రాయింగ్ పేపర్‌మీద ఇండియన్ ఇంక్‌తో వేయాలి... ఇలా పెన్సిల్‌తో..''

''కొత్తవాళ్లంటే చులకన — సులభంగ పైకి రానిస్తారా?'' ఫైల్లోవున్న కార్టూన్లు పాతవి ఏదో పైకి లాగి, కళ్లముందు వూపుతూ ''ఇందులో ఏముందని వేసుకున్నారు. మీరు చెప్పిన గాలం ఏదీ? ఎక్కడ గుచ్చుకోలేదే — నాకేకాదు నా ఫ్రెండ్స్‌కి కూడా నవ్వు రాలేదు. ఇక్కడా రెకమండేషన్ కావాలా? లేక డబ్బిచ్చుకోవాలా? లేక బాటిల్స్ పట్టుకురావాలా?'' గబగబ తన కాయితాలు సర్దుకుని తూర్పు గాలిలా వెళ్లిపోయాడు.

రవిచంద్ర గోపి వైపు చూసి భుజాలు ఎగురవేశాడు. అన్నీ పత్రికలకు పంపి వాళ్లు వేసుకోకపోతే విసుగెత్తిపోయాడు. ఓర్పు నశించిందేమో అని జాలిపడ్డాడు గోపి.

గోపి వెళ్లాక ఇంటర్ కమ్ బటన్ నొక్కాడు. సాహిత్య స్వరం వినబడుతుంది అనుకుంటూ వుండగా —

''సర్'' అంటూ కమల గొంతు వినిపించింది. కమల శరీరం సుకుమారంగా నూరు పైసల అమ్మాయిలా సిగ్గుపడటం తెలిసినా స్వరం బొంగురుగా వుంటుంది.

''కమలా! మీరా?! సాహిత్య ఏమైంది?''

''సాహిత్య రాలేదండి .. ఒంట్లో బాగులేదని — రాట్లేదని ఫోన్ చేసింది...''

''. ............''

''సర్''

''ఒంట్లో బాగోలేదా? ఏమిటి జబ్బు...''

''తెలీదుసార్... వాళ్లింట్లో ఎవరో ఫోన్ చేశారు.''

''మీరు ఒకసారి రండి అని ఫోన్ పెట్టేశాడు''

కమల పుస్తకం పెన్ పట్టుకువచ్చింది. అప్పటికి

**జరిగిన కథ—5 :** రవిచంద్ర 'రచన' వార మాస పత్రికలో మేనేజింగ్ ఎడిటర్‌గా పనిచేస్తుంటాడు. అతను ప్రముఖ రచయిత కూడా. ఫారిన్‌లో ఎం. బి. ఎ. చేసివచ్చినా అతనికున్న సాహిత్యాభిమానంతో ఈ పని చేస్తుంటాడు. అతను సాహిత్య ఇచ్చిన కవరులోని సారాంశం చదివి ఆశ్చర్యపోతాడు. తనకు పి.ఎ. గా చేరిన సాహిత్య టెంప్టేషన్ నుండి తప్పించుకోడానికి, రచయితలను ఇంటర్వ్యూ చేయడానికి ఆమెను పంపాలనుకుంటాడు రవిచంద్ర. కమలను తోడుగా తీసుకొని రచయితలు ఎక్కడ వుంటే అక్కడికి వెళ్లి ఇంటర్వ్యూ చేసి రమ్మంటాడు సాహిత్యను రవిచంద్ర. వీళ్లిద్దరికీ తోడుగా గోపీ కూడా వెళ్తాడు. అనుకోకుండా కలిసిన చిట్టారెడ్డిని ఇంటర్వ్యూ చేసి తమకు కావల్సిన సమాచారం రాబట్టుకొంటారు. తన అభిమాన రచయిత రవిచంద్రను ఎంతగానో ప్రేమించి ఆరాధిస్తున్న సాహిత్య అతనికి పెళ్లయిందనీ, ఓ కొడుక్కి తండ్రి అనీ అతని ద్వారానే తెలుసుకొని విలపించిపోతుంది. రవిచంద్ర భార్య లక్ష్మి, కొడుకు ధీరజ్‌లతో సంసారాన్ని ఆనందంగానే సాగిస్తుంటాడు. తన గురించిన సమాచారం తెలిసిన తర్వాత ఇక డ్యూటీకి రాదనుకొన్న సాహిత్య ఎప్పటిలా ఆఫీస్‌కు రావడం, ఇంకా నిన్ను ప్రేమిస్తున్నాననడం రవిచంద్రకు ఆశ్చర్యాన్ని, ఆమెపై ప్రేమను కలిగిస్తాయి.



గుర్తుకువచ్చిన లెటర్ డిక్టేట్ చేస్తూ మధ్యలో సాహిత్య ఇల్లు ఎక్కడవుందో తెలుసుకున్నాడు.

మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వెళ్లి—అక్కడ నుంచి— తార్నాకాలోని కార్ఖానాకు వెళ్లాడు. పనితో అక్కడ ఇక్కడ తిరిగినా సాహిత్యపైకే మనస్సు పోతూంది. ఎందుకు ఆఫీసుకు రాలేదు. ఏం జబ్బు చేసివుంటుంది ? అని ఒకమూల ఆలోచిస్తూనే వున్నాడు. సాహిత్య కనుపించకపోతే ఏదో వెలితిగా వుంది. చూడాలనిపించింది.

కమల చెప్పిన అడ్రస్సు ప్రకారం వెళ్లాడు లకడీకాపూల్ బాట ప్రక్కగా చూసుకుంటూ కారును మెల్లగా పోనిచ్చాడు.

డాక్టర్ సురేంద్ర ఇయన్‌టి స్పెషలిస్ట్ బోర్డు వుంది. ఆ ప్రక్క సందులోకి నేరుగా వెళ్లాడు. ఎదురుగా సిమెంట్ కలర్ రెండంతస్థుల భవనం వుంది. పెద్ద ఇనుపగేటు. గేటులోపల— క్రీమ్‌కలర్ అంబాసిడర్ కారు బయటనేవుంది. ఆ కారు ప్రక్కనే తన కారు ఆపి డోర్ లాక్ చేయకనే గేటు వరకు వచ్చాడు. సాహిత్య ఇంత పెద్ద ఇంట్లో వుంటుందా ! సరైన అడ్రస్‌కు వచ్చానా ? అని సందేహిస్తూ లోపలికి వచ్చాడు. అప్పుడు గుర్తుకు వచ్చింది ఆరోజు సాహిత్య అబిడ్స్ నుంచి చిరాగ్‌ఢిల్లీ లేన్‌లోకి వెళ్లిందని.

అక్కడదాకా వచ్చి తటపటాయిస్తూ వెనక్కి తిరిగి పోతూండగా— లోపలినించి— నేవీబ్లూ సఫారి డ్రస్‌లో పొడుగ్గా లావుగా, కాస్త బొజ్జ ఆ వయస్సుకు తగినట్లు బాగానే వుందనిపించేట్లువున్న వృద్ధుడు— గంభీరంగావున్నతను బయటకు వచ్చాడు అతన్ని చూడగానే హుషారుగా సంతోషంగా జీవితం గడిపేవాడిలా వున్నాడు.

అతను నవ్వుతూ వస్తూంటే రవిచంద్ర నిలుచుండిపోయాడు. బాగా దగ్గర అయ్యేదాక అతన్ని గుర్తించలేదు

"గుడ్ ఈవినింగ్ సర్" అన్నాడు గోపాల్‌రావు గార్ని చూసి. ఆయన రచన దిన వారపత్రిక సంస్థ యొక్క యజమాని— ప్రొప్రయిటర్ అని గుర్తించి చిరునవ్వుతో—

"రవిచంద్రా" అంటూ కరచాలనం చేస్తున్నట్లుగా ఆప్యాయంగ చెయ్యి అందుకుని వూపాడు. అంతలో పనిమనిషికి ఏదో చెపుతూ— తొందర తొందరగా. ఆయింటి గృహిణి బయటికి వస్తూ మెట్లపైనే నిలుచుండిపోయింది. ఎవరో అతిథి వచ్చాడు. లోపలకు వెళ్లాలా, ముందుకు వెళ్లాలా అన్నట్లుగా నిలుచుంది.

రవిచంద్రను లోపలికి తీసుకువెళ్లే ప్రయత్నంలో ఆయన వుండగా "మీరు ఎక్కడికో వెళ్తున్నట్లున్నారు."

"ఫరవాలేదు. మీతో మాట్లాడే వెళ్తాం..." లోపలకు దారితీశాడు.

"ఏమిలేదు. మన ఆఫీసులో పనిచేసే క్లర్కు ఇల్లు ఇక్కడే వుందని చెప్పారు... ఈరోజు రాలేదు వంట్లో బాగోలేదంటే ఇటు వెళ్తూ వచ్చాను..." ఆ విషయానికి ప్రాముఖ్యత ఇవ్వనట్లు చెప్పాడు.

ఆయన భార్యవైపు చూపి—

"నా భార్య... రవిచంద్ర.. మన పత్రిక ఎడిటర్ " అంటూ పరిచయం చేశాడు. నమస్కారాలు జరుగుతుండగా—

"ఏం పేరు... అదే ఆ క్లర్క్ పేరు ?"

"సాహిత్య !" మామూలుగా చెప్పాడు.

ఆయన, ఆమె ఒండొరులను చూసుకున్నారు ఆయన అతిహాసం చేశాడు. ఆమె ముసిముసిగా నవ్వుతూ లోపలికి వెళ్లి పనిమనిషితో—

"డాలీని రమ్మను..." అని చెప్పింది.

ఆయన ఇంకా నవ్వుతూంటే ప్రశ్నార్థకంగా చూశాడు.

ఆ జోక్ ఏమిటో తెలియక తికమకపడుతుంటే "సాహిత్య ఎవ్వరో కాదు – మా చిన్నమ్మాయి..." అన్నాడు నవ్వుతూ.

"మీకు తెలియదు కదూ సాహిత్య! డాలీ మా అమ్మాయని."

అడ్డంగా తల వూపాడు రవిచంద్ర.

"మన ఆఫీసులో చేరాక అది బాగుపడింది — నిలకడగా — కుదురుగా వుండటం నేర్చుకుంది. ఇదివరకటి అల్లరితనం — మొండితనం పోయాయి. మారిపోయింది." ఆ తల్లి సంతోషంగా చెప్పింది.

"వుద్యోగం చేస్తాను అంటే — ఆఫీసులో ఏం గొడవ పడుతుందోనని నాకు ఆ విషయాలు ఏవి తెలియవు అని చెప్పాను. యం. డి. గారిని పట్టుకుని వుద్యోగం వేయించుకుంది..."

వాళ్లిద్దరు రవిచంద్రను పొగడుతున్నారు. "దానికి కథల పిచ్చి ఎక్కువ — ఈమధ్య సీరియస్‌గా ఏదో కథ వ్రాస్తూంది. నిజంగానే ఇంట్రెస్ట్ వున్నట్లుంది. లేకపోతే ఇన్ని రోజులు నిలకడగా నిల్చోదు. జర్నలిజం చేయించమంటారా...?"

వాళ్లు చెప్పేది ఒక్కటి ఎక్కటంలేదు రవిచంద్రకు. సాహిత్య తను పనిచేసే పత్రిక సంస్థ యజమాని కూతురు. తనదగ్గర పనిచేస్తూంది. తను ఎన్నోసార్లు విసుక్కున్నాడు — కోపం ప్రదర్శించాడు. సాహిత్యను తనకు తెలియకనే ఎన్నోసార్లు నొప్పించాడు. అవమానించాడు — అలాగైన తన దారి నుండి తొలగిపోతుందనుకున్నాడు. ఆ టెంప్‌టేషన్ నుండి తప్పుకోలేని బలహీనతకు తనపై తనకు కోపం వచ్చి — ఆ కోపం సాహిత్యపై చూపేవాడు. ఎంతో అధికారం చెలాయించాడు. గొప్పగా, మురిపెంగా, మొండిగా పెరిగిన సాహిత్య ఎందుకు తన దగ్గర అబలగ, బేలగా, తలవంచుకుని ఏడ్చింది.

ఈ ఇంట్లో దొరకని సుఖం — సంతోషం ఆఫీసులో దొరికిందా? .. ఆలోచిస్తూనే ఎదుటి వాళ్లు చెపుతున్నది వింటున్నట్లుగా తలవూపుతూ... అటు చూశాడు. వాకిలి తెర పట్టుకుని కళ్లు విప్పారించి చూస్తూంది.

రవిచంద్ర అటు చూస్తుంటే ఆ వైపు చూసి "డాలీ! అక్కడే నిలబడిపోయావే? రా. ." అని అమ్మగారు పిలిస్తే,

"మీ బాస్ నిన్ను వెతుక్కుంటూ వచ్చారు" అని ఆయన పెద్దగా నవ్వుతూ పైకి లేచాడు. రవిచంద్ర కూడ లేచాడు.

"కూర్చోండి కాఫీ త్రాగి వెళుదురు...క్షమిస్తే మేము వెళతాం... సమయానికి వెళ్లకపోతే మా ఆవిడ రెస్ట్‌లెస్ అయిపోతుంది. కదలక మెదలక సినిమాలో మూడు గంటలసేపు కూర్చోవాలంటే బోర్..."

"పేకాటలో ఇరవై నాలుగు గంటలు కూర్చో గలరు" అని దెప్పి పొడిచింది ఆమె.

సాహిత్య మెత్తగా వచ్చి ఎదురు సోఫాలో కూర్చుంది. "పిల్లిలా వుంది మీ ముందు... పిల్లి కాదు... పులి" అని సాహిత్యను వుడికిస్తూ చెయ్యి వూపి భార్య వెనకాతల వెళ్లారు గోపాలరావుగారు.

ఆయన మాటలు— ఆకారం— స్వర్గీయ సినీ యాక్టర్ రంగారావును గుర్తుకు తెస్తున్నాయి.

ఆమె ప్రౌఢదశ దాటినా వృద్ధురాలిలా లేదు. నల్లని జుట్టు— పెద్దముడి వేసింది వెంకటగిరి చీరలో హుందాగా వుంది. (ఈ మధ్య అందరి

# రాగాగ్ని

జుట్టు నల్లగా వుంటోంది.) వయస్సుతోపాటు శరీరాన్ని శృంగదీయగ, నాగరికంగ, అలంకరించుకోవడంతో వయస్సు కనబడినా వృద్ధాప్యం దరిచేర నివ్వటం లేదు. తిండికి బట్టకు కొదవలేనివారిమాట వేరే చెప్పనక్కరలేదు. వారిని మానసికంగా ఇంకా యవ్వనంగా వుంచటానికి ఈ శతాబ్దంలో సినిమాలు, పత్రికలు— ముఖ్య కారణం అని చెప్పవచ్చు. వ్యక్తిత్వాన్ని నిలుపుకోవటమేకాక— మానసికంగా ఎంతో పెరిగారు.

పనిపిల్ల కాఫీ తెచ్చి రవిచంద్రకు ఇచ్చింది. కాఫీ కప్పు అందుకుని— సాహిత్యవైపు చూశాడు. ఎర్ర రంగు పెరికాటన్ మాక్సీలో— చిన్న పిల్లలా ముద్దుగా వున్న సాహిత్యను చూసి,

"సా... రీ..." అన్నాడు.

పెదవి చివర విషాదంతో వంపు తిరిగింది.

"ఎందుకు సారీ... అదొక్కటే మీకు వచ్చు"

సాహిత్య కంటి కొనుకుల్లో ఎరుపు చూశాడు

"మీకు తెలియనిది ఎంతో వుంది రండి" అంటూ పైన తన గదికి తీసుకువెళ్లింది.

అందంగా అలంకరించివున్న ఎ. సి. గదిలో సాహిత్యను చూస్తుంటే ఒంటెస్తంభపు మేడలో రాజకుమారి గుర్తుకు వచ్చింది. బాల్యం గుర్తు చేస్తూ అలమారలో బొమ్మలు వున్నాయి. కార్పెట్ పరచిన నేలపై గబగబ వెళ్లి ఒక రాక్‌లో వున్న పుస్తకాలు తీసి బల్లమీదకు వేస్తూ,

"నాకు "పతి" కథలు అంటే ఇష్టం— మీ నవలలు చదివి అంతులేని అభిమానాన్ని పెంచుకున్నాను— శైలిబట్టి, కథలుచెప్పే విధానం బట్టి, పాత్రలు నడిపే విధానంబట్టి — రచయిత వ్యక్తిత్వం తెలుసుకోవచ్చు మీరు సృష్టించే పాత్రలు పిరికివి కావు. ఎంతో వుదాత్తంగా వుంటాయి — ప్రేమ, మమతలు నిజంగా వుంటాయి. మీ హీరో అందంగా మనసున్న మనిషిగా ఎప్పుడూ పాఠకులకు ప్రత్యక్షమవుతుంటాడు. ప్రతి కన్నె మనస్సులో అలాటి ప్రేమికుడు నిలిచిపోతాడు. ఆ విధంగా మిమ్మల్ని ఆరాధిస్తూ వచ్చాను మీకు సన్మానం జరుగుతుండగా మిమ్మల్ని చూశాను. నవలా నాయకుడిలా వున్న మీరు నా మనస్సంతా నిండిపోయారు. మీపైన నా ప్రేమ, అభిమానం వుక్కిరి బిక్కిరి చేస్తుంటే అందరిలా మీ దగ్గరకు వచ్చి మాటాడలేకపోయాను. చివరికి ఆటోగ్రాఫ్ తీసుకోడానికి కూడ శక్తి లేకపోయింది

ఆ రోజు నుంచి — ఇష్టం, అభిమానం, ఆరాధన, ప్రేమలోకి మారాయి. ముందు వెనుకలు ఆలోచించలేదు. పిచ్చిగా ప్రేమించాను. నేను ప్రేమించినట్లు మీరు నన్ను ప్రేమించాలన్న ఆశతో మీ దగ్గర పనికి చేరాను. ఎన్నో ఆశలు పెంచుకున్నాను. మీకు పెళ్లి అయ్యిందని తెలిసినప్పుడు నా చుట్టూ చీకటి తప్ప ఏమి కనుపించలేదు. మీమీద కోపం వచ్చింది. నీ అంత దుర్మార్గుడు లేడని అసహ్యించుకోవాలనుకున్నాను కాని తెల్లవారితే చీకటి విడిపోయినట్లు ఆ కోపతాపాలు తొందరలోనే తగ్గిపోయాయి. నిన్ను చూడకుండా నేను వుండలేకపోయాను. నా ప్రేమ శాశ్వతం కాదని తెలిసినా— మీకు దగ్గరగా వుండాలనే బలవత్తరమైన కోరికకు లొంగిపోయాను కాని... కాని" కంఠం జీరపోగా దుఃఖం దాచుకోటానికి ముఖం పక్కకు తిప్పుకుంది

రవిచంద్ర ఒక అంగలో సాహిత్యను చేరి ముఖాన్ని పట్టి తనవైపుకు తిప్పుకున్నాడు. సాహిత్య కన్నులు సగం విచ్చుకున్నాయి అధరాలు కంపిస్తున్నాయి. వక్షస్థలం బరువుగా కదులుతున్నది సాహిత్య రూపు అతని హృదయంపై చెరగనిముద్ర వేసింది. ఆమె ప్రేమ అతనిని వివసున్ని చేసింది గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు.

ఎంత ఆధునిక భావాలున్నా స్త్రీ స్త్రీయే దేనికైనా పురుషుడే ముందడుగు వేయాలి. వారి మధ్య ప్రేమ పొంగి పొర్లింది— అతని మెడచుట్టూ చేతులువేసి లతలా పెనవేసుకుపోయింది.

సూర్యకిరణాల స్పర్శతో విచ్చుకున్న తామర పువ్వులా వున్న సాహిత్య ముఖాన్ని సుతారంగ దోసిట వుంచుకుని— ముక్కు చివర— సుతారంగా ముద్దు పెట్టుకుని— అక్కడ నుంచి అప్రయత్నంగానే అధరాలపై చుంబించాడు— ఆ స్పర్శకే సాహిత్య చిగురుటాకులా వణికిపోయింది మరింత మరింతగ దగ్గరకు చేర్చుకున్నాడు స్పర్శానుభూతిలో వూగిపోయాడు — ఇంకా, ఇంకా — కావాలి — ఎన్ని ఎన్ని రోజులుగానో హృదయాంతరాలలో దాగివున్న కోర్కె సగర్వంగ తలెత్తింది తొమ్మెర పూవులోని మకరందం కొరకు ఇంకా ఇంకా లోపలికి తొలుస్తూ పోయినట్లు, సాహిత్య భరిణ వంటి నోటిని వదలక, కలువ మొగ్గలలాంటి రొమ్ములపై సుతారంగ చెయ్యి వేసి మెత్తగా వత్తాడు — పువ్వు అందాన్ని వీక్షిస్తూ— స్పృశిస్తూ, ఆఘ్రాణిస్తూ, గ్రోలుతున్నట్లుగా సాహిత్యను అన్నివిధాల ఆనందింపచేస్తుంటే ఆమె పరవశించిపోతోంది. అతని ముద్దు వూపిరి సలపనివ్వటంలేదు అతను రగిలించిన రాగంలో శరీరం దూదిపింజంలా తేలిపోతూంటే — పరవశంలో — రవి, రవి, అని పిలవటంగాని, తన కన్నులు — వర్షిస్తున్నాయనికూడ గుర్తించలేదు సాహిత్య.

కన్నీటి బిందు వొకటి రవిచంద్ర చెంపకు తడిగా తగలగా, కళ్లు విప్పి చూశాడు — తనేమి చేస్తున్నాడో అప్పుడు గుర్తించాడు. ఇప్పటికే తనెంత హాని చేశాడో గ్రహించాడు

పువ్వులా వున్న సాహిత్యను, తను నలిపేస్తున్నాడు. తన అరచేతికి — చిక్కని చక్కని చనుమొన గుచ్చుకోవటంతో తెలుస్తూంది,సాహిత్యను తనెంతగా వుద్రేకపరిచాడో — తనెంతగా కోరుకుంటోందో గ్రహించి హృదయం సిగ్గుతో ముడుచుకుపోయింది. ప్రేమకు చావు బ్రతుకుల తేడా తెలియదు. అందుకే తను కన్నె మనసునేకాదు—కన్నె శరీరాన్ని దోచేస్తున్నా అడ్డు చెప్పలేదు ప్రాణం కంటె విలువైన మానాన్ని పెళ్లి అయినవాడికి అర్పించేస్తు ఆత్మార్పణం చేసుకుంటున్న సాహిత్యను చూస్తుంటే హృదయం మూలిగింది. ఉద్రేకం తగ్గింది తనను తాను సంబాళించుకుంటూ తామరాకుపై నీటి బిందువులా జారిపోయినట్లు— సాహిత్య బిగి కౌగిలి నుండి— మెల్లగా విడిపోతూ "సారీ :. సిగ్గుపడుతున్నాను... సాహిత్యా, నీ ప్రేమ మైకంలో ఏమి చేస్తున్నానో తెలియట్లేదు..."

**(ఇంకా వుంది)**

## విద్యార్థి లోకం వ్యాస రచన పోటీలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

ఈ ఇరువదవ శతాబ్దంలో ప్రపంచం అన్ని రంగాలలోను అభివృద్ధి సాధించుచున్న దనుటలో అతిశయోక్తి లేదేమో! ఈ పరిస్థితులలో దేశంలో కీలకపాత్ర నిర్వహించే విద్యార్థుల సమస్యలు అన్నీ ఇన్నీ అని చెప్పలేము. విద్యార్థులు దేశానికి వెన్నెముక లాంటివారు. "నేటి విద్యార్థులే రేపటి భావిపౌరులు" గదా! విద్యార్థుల, విద్యార్థినుల ఆశయాలు, ఆ ఆశయాలకి అవరోధాలుగా నిలిచే సమస్యలు, ఆ సమస్యల పరిష్కారానికి మార్గాలును పరిశీలించుదాం.

విద్యార్థినీ విద్యార్థులకు, ఉపాధ్యాయులకు మధ్య అవినాభావ సంబంధం ఉండాలి. ఇది వారి ఆశయాలలో మొదటిది. దీనివల్ల ఎటువంటి సమస్యలు వారి మధ్య చెలరేగవు. కాని ఇది సాధ్యపడుటలేదు. దీనికి విద్యార్థులు మరియు ఉపాధ్యాయులు కూడా కారణమే. ఇది పరిష్కారం కావాలంటే, విద్యార్థినీ విద్యార్థులు మరియు ఉపాధ్యాయులు లేదా అధ్యాపకులు ఒకరినొకరు అర్థం చేసుకుంటూ, అధ్యాపకులు విద్యార్థుల యెడ ఆప్యాయతను చూపుతూ, విద్యార్థులు అధ్యాపకుల యెడ విధేయత చూపుతూ ప్రవర్తించాలి.

విద్యార్థినీ విద్యార్థులలో ఉన్నత స్థాయికి ఎదగాలనే ఉద్దేశం ఉండటం సహజం. కాని చాలామందిలో ఈ అభిప్రాయం క్షీణించి పోతున్నది. దీనికి కారణం అధ్యాపకులు, కళాశాలలు అని చెప్పక తప్పదు ఆయా కళాశాలల వాతావరణం, అధ్యాపకుల తీరు ఆ విద్యార్థిని పూర్తిగా పెడత్రోవ తొక్కిస్తుంది. దీనికి ఉపాధ్యాయులు లేదా అధ్యాపకులు, కొంత వరకు ప్రభుత్వము కూడా తోడ్పడి వారు ఉన్నత స్థాయికి ఎదగడానికి అవకాశం కల్పించాలి.

విద్యార్థినీ విద్యార్థులలో ఎన్నో ఆదర్శ అభిప్రాయాలు,- అవగాహనలుకు చోటు ఇవ్వాలనేది విద్యార్థినీ విద్యార్థులలో ఉన్న మరొక ముఖ్య ఆశయం. దీనికి సహవిద్య ఎంతో అవసరం. సహవిద్య ఉన్నప్పుడు విద్యార్థినీ విద్యార్థులలో సదవగాహనలు ఏర్పడుతాయి. కులాలను, మతాలను మరిచిపోయి అంతా ఒక్కటే అనే అభిప్రాయము ఏర్పడుతుంది. జాతీయ సమైక్యతా జరుగుతుంది. వర్ణాంతర, మతాంతర వివాహాలకు అవకాశం ఏర్పడుతుంది. వరకట్న రాక్షసి అణగత్రొక్కబడుతుంది. కాని దీనికి మొట్టమొదటి అడ్డుగోడ ప్రభుత్వమే. రెండవది తల్లిదండ్రులు. దీనిని పరిష్కరించాలంటే తల్లిదండ్రుల ప్రోత్సాహం అవసరం ప్రభుత్వము సహవిద్యను ఏర్పాటుచేయాలి. విద్యార్థినీ విద్యార్థులు కూడ తమ కెదురయ్యే సమస్యలను గుండె ధైర్యంతో ఎదుర్కోవాలి.

విద్యార్థినీ విద్యార్థులలో ఉన్న మరియొక ముఖ్య ఆశయం "అందరు సమానమే" అనేది. దీనికి మార్పుకావాలి. "మార్పు అనేది సృష్టికి మూల రహస్యం" గదా! అన్ని మతాలు, కులాలు ఒక్కటే అని చాటిచెప్పాలి. కాని ఈనాడు దీనిని చిన్నాభిన్నం చేస్తూ మతాల పేరిట, సంస్థలు, పార్టీలు ఏర్పడుతున్నాయి, ఏర్పడినవి కూడాను. దీనికి రాజకీయ నాయకులు కూడా కారణమే. కళాశాలలో కొందరు అధ్యాపకులు కూడా కులమతాలను ప్రేరేపిస్తుంటారు. దీనికి పరిష్కారమార్గం కావాలంటే, మతాల, కులాల పేరిట ఉన్న సంస్థలును తొలగించి అందరు ఒక్కటే, అందరిలోని రక్తము ఒక్కటే అని చాటిచెప్పాలి. అధ్యాపకులు తమలోని తుచ్ఛ భావాలను తొలిగించి సమానతకు పునాది వేయాలి

విద్యార్థులలో ఉన్న మరొక ముఖ్య ఆశయం, తమ దేశాన్ని ప్రగతిపథంలో నడిపించాలని, మంచిపేరు తేవాలని, ప్రశాంతత నెలకొల్పాలని. దీనికి రాజకీయ నాయకులు, పాలకులు అవరోధాలుగా నిలుస్తారు. విద్యార్థులు కూడా ఎన్. సి. సి., ఎన్. యస్. యస్. వంటి వాటిల్లో పాల్గొని తమ దేశభక్తిని రేకెత్తించాలి. నిరుపేదలకు సహాయం చేయాలి. మారుమూల గ్రామాలకు రోడ్డు వసతి కల్పించాలి. వారికి విద్యయొక్క ప్రయోజనము తెలిపి నిరక్షరాస్యతను రూపుమాపడానికి కంకణము కట్టుకోవాలి. ప్రతి ఒక్కడు ఒక్కొక్కనికి బోధించిన ఈ దేశంలో నిరక్షరాస్యత మాసిపోతుంది. దీనికోసం ప్రభుత్వము కూడా కొన్ని సదుపాయాలను కల్పించాలి. విద్యార్థులను ప్రోత్సహించాలి. వారిలో దేశభక్తి రగులుగొల్పేటట్లు కార్యక్రమాలను చేపట్టాలి. మరియు విద్యార్థులో తెలివితేటలను పెంపొందించడానికి జాతీయ విద్యా పరిశోధనా శిక్షణామండలి (ఎన్.సి.ఇ.ఆర్.టి.) వంటి పథకాలను ప్రవేశపెట్టాలి.

విద్యార్థినీ విద్యార్థుల ఆశయాలు నెరవేరి, ఆ ఆశయాలకి అవరోధంగా నిలిచే సమస్యలుకు పరిష్కారమార్గాలు లభించినపుడు దేశము "మూడు పువ్వులు ఆరు కాయలు"గా దేదీప్యమానంతో వెలుగొందుతుందనడంలో అతిశయోక్తి లేదు. ★



## రచయిత పరిచయం

"పుట్టిన ఊరు కుగ్రామమైన శ్రీరాంనగర్ (కడపజిల్లా). 1964లో జన్మించాను. మా తండ్రిగారు టీచరు. పేరు ఎ.సి. చంగయ్య. మా తల్లి పేరు పార్వతమ్మ ఏడవ తరగతి వరకు నల్లపరెడ్డిపల్లెలో, ఆ తర్వాత 10వ తరగతి వరకు మాధవరంలో చదివితిని. 10వ తరగతి డిస్టింక్షన్‌తో పాసయ్యాను. మొదటిసారిగా వ్యాసరచనలో పాల్గొనడం 9వ తరగతిలో జరిగినది

కాలేజి చదువులను రాయచోటిలో కొనసాగించితిని. మా కాలేజిలోను, బయట (లయన్స్ క్లబ్ మొదలైనవి) పెక్కుసార్లు నిర్వహించిన వ్యాసరచన పోటీలలో నాకు ప్రథమస్థానమే దక్కేది. ఒకసారి యూనివర్శిటీ తరుఫున ఇంటర్ నుండి డిగ్రీవరకు చదువుతున్న విద్యార్థులకు "పాప్యులేషన్ స్టడీస్"మీద జరిగిన వ్యాసరచన, వక్తృత్వ పోటీలలో నాకే ప్రథమస్థానము రెండింటిలోను లభించినది.

ఇంటర్మీడియట్‌లో కాలేజి ప్రథముడుగా వచ్చాను. ఇంజనీరింగ్‌లో సెలెక్ట్ అయ్యాను. నేను అనంతపురంలోని జవహర్‌లాల్ నెహ్రూ టెక్నాలజికల్ యూనివర్శిటీ కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్, సివిల్ బ్రాంచ్‌లో, ఇంజనీరింగ్ రెండవ సంవత్సరం చదువుతున్నాను. నాకు వ్యాసరచనలన్నా, చిన్న చిన్న కథలు వ్రాయాలన్నా చాలా ఇష్టం.

నాకు వ్యాసరచన పోటీలలో ప్రత్యేక బహుమతి ఇచ్చి నన్ను మరింత ప్రోత్సహిస్తున్న "ఆంధ్ర సచిత్రవార పత్రిక"కు ఎల్లప్పుడు కృతజ్ఞుడినే."

— ఎ. బాలసుబ్రమణ్యము



# మదర్పిత... ...తాంబూలాది



దీపావళి కథలపోటీలో రు. 600/ బహుమతి పొందిన కథ

**పెద్ద మావయ్యగారి అమ్మాయి పెళ్ళండీ! – సుజాత పండక్కి వైజాగ్ వెళ్ళి మళ్ళీ హైదరాబాద్‌కి తిరిగి వస్తూనే చెప్పిందీ వార్త. కొంచెం ఇబ్బంది పడ్డాన్నేను.**

'మనం హైదరాబాద్‌కి ట్రాన్స్‌ఫరై వచ్చిన సంగతే తెలియదట అత్తయ్యకి, పాపం ఎంతో నొచ్చుకుంది. పదహారో తారీఖున వాళ్ళింట్లో పెళ్ళి. ఆ నాలుగురోజులూ వాళ్ళింట్లోనే ఉండాలి మనం అని శాసించింది.

ఊళ్ళోకొచ్చాం .... బాగుండదు అత్తయ్య వాళ్ళింటికి తీసికెళ్ళండి బాబూ అంటూ పోరుతూనే ఉన్నానా, తీసికెళ్ళేరు కాదు. వైజాగ్‌లో పెళ్ళి పిలుపులకి అమ్మా వాళ్ళింటికి వచ్చి నన్ను పలకరించేసరికి సగం ప్రాణం చచ్చిపోయింది నాకు.'

'అదికాదు సుజాతా ...'

'ఇంకేం చెప్పకండి. మీ చొరవలేని తనము ... మడికట్టుక్కూర్చునేతత్వమూవల్ల...మావాళ్ళందరికీ దూరమైపోతున్నాను. మీకో సరదా ఉండదూ ... కాలక్షేపమూ ఉండదు.'

'అయితే నువ్వే చెప్పు ... నేను మీ చుట్టాలిళ్ళకి తీసికెళ్ళలేదా ఇన్నాళ్ళూ ... ?

'తీసికెళ్ళకేం తీసికెళ్ళారు. మనం బందర్లో ఉన్నప్పుడూ ... గుడివాడలో ఉన్నప్పుడూ తీసికెళ్ళేరు. మరి మనం హైదరాబాదొచ్చి రెండు నెలలైంది కదా ... కనీసం ఒక్కసారైనా అత్తయ్య వాళ్ళింటికి తీసికెళ్ళేరా ... అహా, తీసి కెళ్ళేరా ... ?'

'ఒప్పుకుంటున్నాను. తీసికెళ్ళలేదు. కానీ ఎందుకు తీసికెళ్ళలేదో నీకు తెలీదా ?'

'ఎందుకు ... ?'

'భరద్వాజగారు ... అదే మీ పెద్దమావయ్య గారు మా ఆఫీసుకి జనరల్ మేనేజరు.'

'అయితే ...'

'అయితే ఏవిటి వెఱ్ఱిమొహం నువ్వునూ! నేను గుమాస్తాగా పనిచేసే ఆఫీసుకి ఆయన జనరల్ మేనేజరు – నాబోటిగాడు ఆయన బంగళా చుట్టుప్రక్కల్లో నిల్చున్నా నేరమే తెలుసా ?'

'అదే, ఆ ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సే మిమ్మల్నీ.. మీతోపాటు నన్ను ముంచుతోంది. మావయ్యెంత కలుపుగోరుగా ఉంటాడో ... అత్తయ్యెంత ఆప్యాయంగా చూస్తుందో ఎన్నిసార్లు చెప్పేను మీకు ? మీరూ మీ ఆఫీసూ ... ఆఫీసులో జనరల్ మేనేజరూ ... అన్నీ ఆఫీసులోనే వదిలెయ్యండి. ఇంటి దగ్గర ఆయన నాకు మావయ్య ... మీకు బాబాయ్, అర్థమైందా!'

'అర్థమౌతోంది ... !'

'కాబట్టి మనం పదహారో తారీఖున మావయ్య వాళ్ళింట్లో పెళ్ళికి పద్నాలుగో తారీఖునే వెళ్తున్నాము. నాలుగురోజులంది అత్తయ్య. కానీ మూడ్రోజుల్తోనే సరిపెడదామనుకుంటున్నాను.'

'కాదు... ఒక్కరోజు !'

'కాదు... మూడ్రోజులు !'

'కాదు... సుజాతా...!'

'కాదూ...కాదూ...కాదూ...మూడ్రోజులు !' అంటూ వంటింట్లోకెళ్ళిపోయిన సుజాతని చూస్తుంటే ఆఫీసులో బాసే జ్ఞాపకం వచ్చాడు... ఉన్నట్టుండి.

'వెధవ ఆఫీసూ... వెధవపనీ... ఎప్పుడూ ఉండేవేలే ! జీ. ఎమ్. గారి బంధువ్వి. ఆయనింట్లో

పెళ్ళి జరుగుతూంటే... నువ్విక్కడ కూర్చుని గాడిద చాకిరీ చేస్తున్నావని తెలిస్తే...నీకు శెలవివ్వక రాసిరంపాన పెడుతున్నానని నామీద కోపం రావచ్చు ఆయనకి. నాకెందుకు నాయనా ఆ మాట ? వెళ్ళు... వెళ్ళు.., రెండ్రోజులు . కాదు కాదు, నాలుగు రోజులు ముందుగానే వెళ్ళు !' అంటూ నన్ను బుజ్జగించడం..., 'బాబూ సీట్లో పని చాలా ఉండిపోయింది ఒక్కరోజు శెలవు చాలు సార్' అని నే బ్రతిమాలడం .. దానికి ఆయన 'వీల్లేదు... నాలుగు రోజులు వెళ్ళి తీరాల్సిందే' అని శాసించడం దీనంతటికీ కారణంగా ఆ రోజు పోస్టులో మా బాస్‌కీ నాకూ కూడా భరద్వాజగారి దగ్గర్నుంచి శుభలేఖలు రావడం .. నా కార్డు ఆయన చేతుల మీదుగా ఏదో ప్రైజు తీసుకున్నట్టు నేను తీసుకోవడం. ., ఆఫీసులో మిగతా జనాలు దీని గురించే ప్రత్యక్షంగా, పరోక్షంగా మాట్లాడుకోవడం... జీ. ఎమ్ అప్పుడిగా నా మొహాన ముద్ర పడిపోవడం... అంతా ఫ్లాష్‌బ్యాక్‌లో జరిగిన చిన్న కథ కళ్ళముందు మెదిలింది.

*           *           *

'ఐదేళ్ళక్రితం మన పెళ్ళిరోజుల్లోనే ఏ రోజు పెళ్ళంటే ఆ రోజే దిగేవారు జనాలు. ఇప్పుడు రోజులు ఇంకా మారిపోయాయి సుజాతా. మరీ రెండ్రోజులు ముందునుంచీ వాళ్ళింట్లో తిష్ట వేస్తే...నాకు చచ్చేంత మొహమాటంగా ఉంటుంది. కావాలంటే నువ్వు వెళ్ళు రెండ్రోజులు ముందుగా .. నేను పెళ్ళినాడు వస్తాను'— అని చిన్న బ్రెయిలు వేసి చూశాను.

నిజానికి మామూలుగా అయితే సుజాత ససేమిరా ఒప్పుకునేది కాదు .. ఏ ముహూర్తాన అన్నానో కాస్త బేరానికొచ్చింది

'సరే నేను రెండ్రోజులు ముందు వెళ్తాను. మీరు మాత్రం ఓ రోజు ముందు రావాలి! సరేనా!'

'అదికాదు సుజాతా... !'

'ఇంక లాభంలేదు మరి...!'

'సరేలే... అలాగే !'

*           *           *

కొంగు నడుంకి బిగించికట్టి వడ్డనలో బిజీగా ఉంది సుజాత నే వెళ్ళేసరికి. ఆలస్యంగా వెళ్ళినందుకు నన్ను నేనే తిట్టుకుంటుండగా. . సుజాత నా గురించే కాబోలు ఆ మధ్యవయస్కురాలికి చెప్పింది. రాకెట్లా వచ్చేసిందావిడ నా మీద కి. 'పరాయి ఇల్లా నాయనా... మొహమాట పడుతూ వరండాలో ఉండిపోయావు. పద. . పద కాళ్ళు కడుక్కో' అని మాట పూర్తి చెయ్యలేదు...సుజాత అరువు అక్కడ్నుంచి 'మా అత్తయ్యండీ' అని. 'నమస్కారమండీ' అన్నాను సభ్యతకి. 'మనలోమనకి నమస్కారాలేవిటి నాయనా ముందు భోజనానికి కూర్చో !' అరక్షణంలో కాళ్ళు కడుక్కుని సెటిలై పోయాను విస్తరిముందు.

చుట్టూ చూశాను. మా ఆవిడా . నా ఎదురు పంక్తిలో చివర కూర్చున్న మా జీ. ఎమ్ భరద్వాజ గారూ తప్పించి మరో మొహం తెలీదు నాకు.

మారు కావాలా, మొహమాట పడకండి, మరో లడ్డూ వేసుకోండి . విస్తరిలో ఏదీ పారెయ్యడానికి వీల్లేదు లాంటి అరుపుల్తో... కేకల్తో... గోలగోలగా ఉంది. ఎవరికివాళ్ళు కబుర్లు చెప్పుకుంటూ తినేస్తున్నారు. కబుర్లు చెప్పడానికి కంపెనీ లేదు కాబట్టి తిండి ధ్యాసలోనే పడ్డాన్నేను.

'అమ్మాయ్ సుజాతా, కాసిని మంచినీళ్ళు పొయ్యమ్మా !' భరద్వాజగారి గొంతుక వినేసరికి గగుర్పాటు కలిగింది నాకు.

'వన్ మినిట్ పెద్ద మావయ్యా !' అంటూ వడ్డిస్తున్న గిన్నెనో పక్కనపెట్టి మంచినీళ్ళు తెచ్చి పోస్తూ... నా గురించి ఎత్తింది కాబోలు.. 'ఎక్కడమ్మా మీ ఆయన ? కనపడరేం... నిజంగా వచ్చారా' అని ఆయన అనడం... నేను కంగారుగా అంట్ల చేత్తోనే నమస్కారం పెట్టడం ఒక క్షణంలో జరిగిపోయాయి.

'హవ్వార్యూ మూర్తిగారూ.. వెరీగుడ్, ఆలస్యంగానైనా వచ్చేరు – ఐ యామ్ వెరీ హ్యాపీ' అన్నారు.

నోట మాట పడిపోయి చిన్నగా నవ్వేను. నిజానికి ఆయన్తో మాట్లాడ్డం కాదు; చూసే అవకాశమే రాదు నాకు. అదే ఆలోచన్లలోపడ్డ నాకు దాదాపు మతి చెలించింది.

'చూడు సుజాతా. నాకు ఒడ్డించడానికి మీ అత్తయ్యుందీ... నువ్వు ముందెళ్ళి అబ్బాయికేం కావాలో కనుక్కో... మొహమాట పడకూడదండోయ్ మూర్తిగారూ, ఇది మనిల్లూ ?' అని ఆయన అనేసరికి –

'అలాగే సార్ ' అని నే ముసిముసిగా నవ్వే లోపల .

'సరి సరి సుజాతా ! నువ్వలా పెద్ద మావయ్య చెప్పినట్టు మీ ఆయన్నే పట్టుక్కూచుంటే ఏవీ అందక ఆకల్తో మేము గిలగిల తన్నుకుపోవాలి —' అంటూ ఛలోక్తి విసిరాడు నావైపు చిరునవ్వుతో ఓ ఆజానుబాహుడు.

'ఓకే చిన్నమావయ్యా, అలాంటి బెంగలేం పడకు. నీ కన్నీ వడ్డించిన తర్వాతే మా ఆయన సంగతి చూస్తాను. సరేనా ?' తిప్పికొట్టింది సుజాత.

'జస్ట్ జోకండోయ్ మూర్తిగారూ .. నిజంగా అనుకునేరు ! కోడలుపిల్ల ఏమంటుందా అని జోక్ చేశాను...' అంటూ సంజాయిషీగా నావైపు తిరిగాడాయన. 'చిన్నమావయ్యా !' అని మా ఆవిడ సంబోధించింది కాబట్టి ఆయన్ని భరద్వాజగారి

**"కార్తీక దీపాలు"**          (ఫొటో · ఏలేశ్వరపు నరసింహారావ్)



తమ్ముడిగా గుర్తించడం అంత కష్టం కాలేదు నాకు. సమాధానంగానో... అవ్యక్తమైన నా ఆవేదన గానో... ఎలా సరిపెట్టుకున్నాడో ఆయన నాకు తెలీదుగానీ... 'గో ఎ హెడ్ సార్' అనేశాను. హ్హహ్హహ్హా అంటూ కనుబొమ ఎగరేశాడాయన.

'సుజాతా ఈ వడ్డన కార్యక్రమం నే చూస్తా గానీ... సాయంత్రం టిఫెనూ కాఫీ సంగతి ఏం వెలగబెట్టేస్తున్నారో వంటవాళ్ళు మవ్వోసారి చూసి రామ్మా !'

'అలాగే అత్తయ్యా !–' క్షణంలో మాయమైంది సుజాత !

నాకు బాగా పరిచయం ఉన్న ఒక్క మొహం ఉన్నట్టుండి కనుమరగవగానే కాస్త ఇబ్బంది ఫీలయ్యేను — బుర్ర వంచుకుని తిండిమీద పోనిచ్చాను దృష్టి.

పులిహోర రాసి రాసిలా వడ్డించిందో మహాతల్లి. 'వద్దండి . వద్దండి' అని మొరపెట్టుకోబోయాను.

'అల్లుడ్ని సరిగ్గా చూడలేదని మా అమ్మాయి అలిగిందంటే... మా దుంప తెగిపోతుంది నాయనా, మొహమాటపడకు. నెమ్మదిగా తిను.' అంటూ మరో గరిటెడు పులిహోర వడ్డించేసిందావిడ.

ఇంతలో హడావిడిగా వచ్చేసిందో పద్దెనిమిదేళ్ళ అమ్మాయి. 'పిన్నీ... పిన్నీ... మల్లెపూలు వాడొచ్చాడు. ఎన్ని మూరలు తీసుకోమంటావు ? పెళ్ళి దండ లెన్నింటికి తీసుకురావాలని అడుగుతున్నాడు.'

'మల్లెపూలా... ? ఆ లెక్కలన్నీ సుజాతకే తెలుసు. వెళ్ళు, పెరట్లో ఉందది !'

ఆ వచ్చిన అమ్మాయికి నేను దొరకలేదు కాబట్టి బ్రతికిపోయాను. లేకపోతే తనింకేం వడ్డించేదో ?

కొంగుతో చెమట తుడుచుకుంటూ రొప్పుతూ వచ్చింది సుజాత. భరద్వాజగారి భార్య ఆదుర్దాగా చూసింది సుజాతవైపు.

'కాస్త దోసిచ్చాను. నాలుగింటికల్లా అంతా రెడీ చేసేస్తారు. అత్తయ్యా! డోంట్‌వర్రీ -'

'ఏమోనమ్మా! ఈ శుభకార్యం కాస్తా పూర్తయి గట్టెక్కేదాకా అంతా వర్రీయేనమ్మ నాకు. కాకపోతే నువ్వుండి చూసుకుంటున్నావు కాబట్టి కాస్త ధైర్యమమ్మా — లేకపోతే ఇంత ఒళ్ళుకుని నే తిరగ్గల్నా అసలు ? వెళ్ళు, అబ్బాయి కేం కావాలో చూడు' అంటూ కూలబడిపోయిందావిడ.

సుజాత ఫైనల్ రౌండు బలవంతంగా వేసింది లడ్డూలు అందరికీ. నాకు ఇంకో రెండు వెయ్యమని ఏక కంఠంతో అరిచేరు భరద్వాజగారూ... ఆయన తమ్ముడూ ! పీకదాకా తినేదాకా వదిలిపెట్ట లేదు.

భోజనాలయ్యాయి — లేచి గబల్న పారిపోదామనుకున్నాను. నా ప్రయత్నం గమనించినట్టుంది సుజాత — అర్జెంటుగా వచ్చి బ్రేకేసింది.

'మా పెద్దబావా... చిన్నబావా మీ గురించి ఒకటే అడగడం... విశాలైతే 'అన్నయ్యని చూపించవే... అన్నయ్యని చూపించవే' అని పేపుకి తినేస్తోంది. వాళ్ళు ముగ్గురూ బైటికెళ్ళేరు,

## సందర్భితం... తాంబూలాది...

పిలుపులకీ, రిసెప్షన్ ఎరేంజ్‌మెంట్సుకీ. కాసేపు అలా సోఫాలో రెస్టు తీసుకోండి. ఫైవ్ మినిట్స్‌లో వచ్చేస్తా — నలుగురం కలిశాం కాబట్టి కాస్త సరదాగా కాలక్షేపం చెయ్యొచ్చు— ముందు కూర్చోండి!'

'హాయిగా రాత్రి తాళిలో తినేసి రేపొద్దున్నే వస్తామనుగానీ... నన్నొదిలేయ్ !' అందామనుకున్నాను. సుజాత నాకా ఛాన్సివ్వలేదు. పైగా చెయ్యి పుచ్చుకుని లాక్కెళ్ళిపోయింది భుక్తాయాసం తీర్చుకుంటున్న ఓ స్థూలకాయుడి దగ్గరకి. నన్ను చూడగానే... లేచి నిల్చోబోయాడాయన. 'పరవాలేదు బాబాయ్ !' అంటూ బుజం పట్టుకుని కూర్చోపెట్టేసింది సుజాత –

'రండి... రండి, ఐయామ్ రాజారావ్ ఫ్రం ఐ ఎల్టీడీ గుంటూర్—' అంటూ షేక్‌హ్యాండిచ్చాడు. 'వెరీ నైస్... ఐయామ్ మూర్తి సర్,' అన్నాన్నేను.

'సుజాత పెరిగి పెద్దదై ఇంతదైపోయిందంటే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది నాకు. గౌన్లేసుకుని తిరుగుతూ... 'బాబాయ్... బాబాయ్' అనే చిన్నపిల్లలానే అనిపిస్తుంది నాకు. వెధవది ఎప్పుడూ తీరుబాటుందండీ... ఎప్పుడూ



## అందమైన బుజ్జాయి

అమ్మ అందచందాల్ని
నాన్న మేనిఛాయని
పుణికి పుచ్చుకొన్న
అబ్బాయొకడు పుట్టాడు

అందమైన బుజ్జాయిగ
అలరించాడందరినీ
ఎదురుబడ్డ ప్రతివారి
భుజాలెక్కిపోయాడు

యవ్వనంలో అడుగుబెట్టి
అందంగా తిరిగాడు
కన్నెపిల్లల యెదలో
కసికసిగా మెదిలాడు

అహంకార మదంతో
అదే పనిగా తిరిగాడు
ఆ పరిసర ప్రాంతాలకు
అతడాబోతయ్యాడు

ఈవాడా అందగాడు
ఊరి బయటి స్థలంలో
ఒంటరిగ వున్నాడు
ఏడుస్తూ వున్నాడు

గతంలో అందమైన
అతగాడి చేతివేళ్లు
కన్నీరు తుడవలేవు
కారణం — ఇప్పుడవి లేవు

— టి. ఎస్. ఎస్. రంగనాథ్



క్యాంపులూ... పని ఒత్తిడీ ! పేరుకి అయినవాళ్ళమని గానీ... ఎప్పుడో ఇలా ఒకటీ అరా పెళ్ళిళ్ళలో కల్సుకునే అవకాశం తప్పించి విడిగా మిస్సయిపోతున్నా బంధువుల్నంతా !

ఏమ్మా సుజాతా. . నువ్వైనా చెప్పొచ్చుగా మూర్తిగారికి— యూ ఆర్ మోస్ట్ వెలకమ్ టూ గుంటూర్ సార్— మీరు రావాలి ! అదే చెప్పేను అమ్మాయికి నిన్న—'

'థ్యాంక్యూ ! తప్పకుండా వస్తాం సార్ !'

'వై నాట్ నవ్ ? పెళ్ళైపోగానే నాతో వచ్చేయండి— నాలుగు రోజులు ఉండి వెళ్దురుగాని '

'థ్యాంక్యూ...థాంక్యూ ఫర్యువర్ ఇన్విటేషన్— వెంటనే రావడానికి చిన్న చిన్న ఇబ్బందులు. మరోసారి వస్తాంగా...!'

'ప్రామిస్...!'

'ప్రామిస్ సర్ !'

'చూశావుగా సుజాతా మీ ఆయన ప్రామిస్ చేశారు. అదాయన నిలబెట్టుకునేట్టు చూసే బాధ్యత నీదీ— ఓ కే !'

'ఓ కే బాబాయ్ !'

* * *

భుక్తాయాసానికి సోఫాలో చేరపడ్డాను. చిన్న కునుకులా పట్టింది. 'ఏవండీ... చిన్న మావయ్య వచ్చాడు మీ కోసం' అంటూ సుజాత హడావిడిగా వచ్చేసరికి తుళ్ళిపడి లేచాను.

'మూర్తిగారూ... మిమ్మల్ని చూడగానే అనుకున్నాను మీరు బ్రహ్మాండంగా ఛస్సు ఆడగలరని— యామై కరక్ట్ ? ఏమ్మా మీ ఆయన ఛస్సు ఆడ్తారుకదూ అని అడిగేను సుజాతని. 'ఛాంపియన్ మావయ్య' అంది— అంతే వచ్చేశాను ! రండి ఓ ఎత్తు వేసుకుందాం...'

'మీరు పెళ్ళి హడావిడిలో ఉండగా...'

'ఓ... డోంట్ వర్రీ— పెళ్ళంటే ఆడవాళ్ళ వ్యవహారమండీ. అందులోనూ సుజాత మన తరుపున అన్నీ చూసుకుంటుంటే మనకి రెస్టే కదా— వాడ్డూయూ సే సుజాతా !'

'ఆడండి... పాపం మావయ్యకి చస్సంటే భలే సరదా !'

'ఓకే దెన్ !'

'దట్స్ గుడ్; సుజాతా... మేము మేడమీద గదిలో కూర్చుని ఆడుకుంటూ ఉంటాం గానీ అరా అరా టీ పంపించమ్మా..., లేకపోతే గిలగిల తన్నుకు చస్తా !'

'ఏవిటో ఎక్కడికో ప్రయాణం చేయించేస్తున్నావు మూర్తిగార్ని, చాంద్రాయణమా ?' భరద్వాజ గారు నవ్వుతూ వచ్చారు తాంబూలం వేసుకుంటూ!

'కాదు. మూర్తిగారు ఛస్సులో ఎక్స్‌పర్ట్‌ట. ఓ ఎత్తు వేద్దాం అని ప్రయత్నం.'

'వెరీగుడ్ !'

'వెరీగుడ్ కాదు; నువ్విక్కడెక్కడైనా సోఫాలో ఎడ్జస్టవ్వు. మేడమీద నీ రూములోనే మా ఆట. తెల్సిందా ?'

'అన్యాయంరా, రెండ్రోజుల్నుండీ నిద్దరలేదు. మళ్ళీ రాత్రంతా కూడా నిద్రుండదు. ఓ అరగంట నడుం వాల్చనివ్వండి నన్ను. ఆ తర్వాత మీ ఇష్టం.'

'వారిని రెస్టు తీసుకోనీండి సార్ ! ఇక్కడే కూర్చుందాం మనం !'

'అలా కుదర్దు. మీకు తెలీదు మూర్తిగారూ... ఆలా వీళ్లేదు.'

'నామాటా...మీ ఆయన మాటా వినటంల్లేదు చిన్న మావయ్య, నువ్వైనా చెప్పవే సుజాతా !'

'పోనీ చిన్నమావయ్య ... డ్రాయింగ్‌రూమ్‌లో ఆడుకోండి !'

'చదరంగం ఎ.సీ. రూములోనే ఆడాలి. అది రూలూ ! అదీగాక ... నిద్రకైనా డిస్టర్బెన్సు కలగచ్చుగానీ ఛస్సుకి కలక్కూడదు. అండర్‌స్టాండ్, ఆయన దారి ఆయన్ని చూస్కోనీ .. పదండి మూర్తిగారూ ఆలస్యమైపోతోంది —'

నిస్సహాయంగా మిగిలిన భరద్వాజగార్ని చూస్తే జాలేసింది.

'పద పెద్ద మావయ్యా ... నీకు బ్రహ్మాండమైన చోటు చూపిస్తా రెస్టు తీసుకోడానికి. అరగంట కాదు, గంటన్నర పడుకోవచ్చు హాయిగా !'

'మాతల్లే ... ఓ తలగడా ఇచ్చి ... ఫ్యానున్న గదిలో నన్ను పడేసి ... తలుపు తాళం వేసేసి ... ఆ తాళాలు నీ దగ్గరే భద్రంగా ఉంచుకుని ఓ గంటాగి వచ్చి తియ్యమ్మా ... నీ పేరు చెప్పుకుని కాస్త నడుం వాలుస్తాను.'

'మళ్ళీ ప్లేన్‌పోతుంది. తొరగా రావాలి మరి!' అంటూ పక్క హాల్లోకి తిరిగింది సుజాత. ఏసు ప్రభువు వెనకాల గొర్రె పిల్లలా వెళ్ళేరు భరద్వాజగారు.

'ఇంకా చూస్తూ నిల్చుంటారేం సార్, అన్నయ్య సెటిలయ్యాడు కదా, పదండి ఇప్పటికే ఆలస్యమైపోయింది !'

'ఒకే పదండి !'

* * *

'తల్లీ నీ మాటే నమ్మాలి ఆరా ఆరా టీ పోస్తానన్నావు. రెండుగంటలైంది టీ కాదుకదా... మంచినీళ్ళు కూడా లేవు. టీ లేకపోతే నా బుర్ర పన్జేయదు దాంతో మీ ఆయన మూడుసార్లు ఆట కట్టించాడు నన్ను.'

'సో ... సారీ చిన్నమావయ్యా ! కానీ నీకో జోక్ తెలుసా ? కాఫీలూ ... టీలెన్నాళ్లు సప్లై చేసేస్తుంటే . . నువ్వు అర్ధరాత్రైనా లేవవని పెద్ద మావయ్య మంచినీళ్ళు కూడా ఇవ్వద్దని ఆర్డరు వేశారు — కదూ పెద్ద మావయ్య ?'

'నూటికి నూరుపాళ్ళూ అంతేరా ! ఆఁ ... సారీ మూర్తిగారూ మావాడితోపాటు మీకు కాఫీ టీ లేకుండా చేశాను' భరద్వాజగారు నొచ్చుకున్నారు.

'ఫరవాలేదు సార్ .. నాకలవాట్లేదు !'

'ఆయనలాగే అంటార్లేమ్మా ... నువ్వెళ్ళి అర్జెంటుగా కాఫీలు ఏర్పాటు చెయ్ ! వాళ్ళతోపాటు నాకూ . ఓ గ్లాసుడు కాఫీ పోశావంటే ..'

'యస్ .. ఇన్ వన్ మినిట్ —' సుజాత మాయమైపోయింది

'చూడండి మూర్తిగారూ . . కాఫీ తాగిన తర్వాత మన తఢాకా చూడండి. వరసగా ఆరుసార్లు ఆటకట్టేస్తా మిమ్మల్ని !'

'అలాగే !'

## మదర్పిత... తాంబూలాది...

'ఒకే దెన్; బాత్రూమ్‌కెళ్తున్నా ... టెన్ మినిట్లో వస్తా !'

'హతోస్మి ... మీరు 'అలాగే' అనేశారా ?' ఆందోళనగా అన్నారు భరద్వాజగారు.

'ఏం సార్ అనేశాను.'

'దొరికిపోయారు మూర్తిగారూ ... ఇంక అర్ధరాత్రైనా వదల్డు మిమ్మల్ని. అవతల మనకి ముహూర్తం దగ్గరపడిపోతోంది కదా ... !'

'వేరీజ్ కాఫీ లవర్ చిన్న మావయ్యా?' అంటూ ట్రేలో మూడు కాఫీలు పట్టుకొచ్చింది సుజాత. భరద్వాజగారు నాకొకటిచ్చి ఆయనొకటి తీసుకున్నారు.

'చిన్న మావయ్యేడండీ బాబూ ?'

'బాత్రూంకెళ్ళేడమ్మా !'

'కాఫీ... కాఫీ అని గోలపెట్టేడు— చల్లారిపోతోంది.'

'టైముకి లేకపోతే అంతేమరి ! వాడ్డాయూసే మూర్తిగారూ ?'— నవ్వాను.

'ఆ...! సర్... నేనే మిమ్మల్నడుగుదామనుకుంటున్నాను. సుబ్బారావుగారొస్తే ఏం చెప్పమంటారు సార్ ?'

'అమ్మో... భలే గుర్తుచేశారు కాఫీ ధ్యాసలో

## అద్దె తల్లులు ప్రమాదకరం !

భార్య వంధ్యురాలైతే భర్త వీర్యంతో కృత్రిమ సంపర్కంవలన మరో స్త్రీవల్ల సంతానాన్నిపొందే అద్దె తల్లుల కార్యక్రమాన్ని పశ్చిమ జర్మనీలోని ఒక మహిళా డాక్టరు తీవ్రంగా విమర్శించారు. ఇటీవల జరిగిన జర్మను మెడికల్ అసోసియేషను సమావేశంలో మాట్లాడుతూ డా. హిల్గాదేవ్, పత్రికా ప్రకటనద్వారా అద్దె తల్లిగా సంతానాన్ని కంటానికి ఒక స్త్రీతో ఒప్పందం కుదుర్చుకున్న సంఘటనను తెలియజేశారు. ఈ ఒప్పందం ప్రకారం ఆమెకు 30 వేల మార్కులు(సుమారు రు. 1,20,000లు) చెల్లించాలి. ఆవిడ ఆ విధంగా సంతానాన్ని కనటానికి కారణం డబ్బు తప్ప మరే యితర కారణం లేదు. దీని వలన సంతానంకూడా వాణిజ్య వస్తువుగా మారిందని ఆమె తెలియచేశారు. ఇది తల్లీ, బిడ్డా సంబంధాలకు వ్యతిరేకమని, తల్లికి, బిడ్డకు మధ్య మానసిక అనుబంధం లేనందున, ఈ రకమైన పిల్లల్లో మానసిక సమస్యలేర్పడగలవని ఆమె తెలియజేశారు. ఇందులో నీతిపరమైన సమస్యలుకూడా ఏర్పడగలవని, ఈ పద్ధతికి స్వస్తి చెప్పటానికి అవసరమైన చట్టాన్ని చేయాలని ఆమె సూచించారు.

ఎడి దాని సంగతె మర్చిపోయాను. మీరే ఎలాగో మేనేజ్ చేసేయండి— నా మాట వినడు మావాడు.'

'అసలు విషయమేమిటి ?'

'ఏముందమ్మా... ఛస్సు ! మీ ఆయన్ని వరసగా ఆరాటలు ఓడిస్తాట్ట. పాపం ఆయన దొరికిపోయారు. ఓ పక్కన ముహూర్తం టైము దగ్గరకొచ్చేస్తోంది కదా... అదీ.. '

'ఒకే సార్... ఓపని చేస్తా, తప్పేదు ఎత్తులు వేసి నేనే చెక్ అయిపోతా గబగబా...!'

'ఛ... తప్పండీ...చిన్న మావయ్యకి చస్సంటే వెర్రి ప్రాణం. మోసం చెయ్యడం దారుణం !'

'దారుణం లేదూ... గీరుణం లేదూ... మవ్వుండు ! బాబూ, మూర్తిగారూ... ఆ పని చేసి పుణ్యం కట్టుకోండి !'

'యస్సార్ !'

'సుజాతా .. విడిదిక్కాఫీలు వెళ్ళాయా . '

'అంతా రెడీ అత్తయ్య !

'ఇంకా మీ మావయ్యలా కూలబడి కూర్చుంటే పన్లు జరగవు— లెమ్మను !'

'నే పనిమీదే ఉన్నానోయ్ అరవకు !'

* * *

'సుజాతా... ముహూర్తం దగ్గరకొచ్చేస్తున్న కొద్దీ నాకు దడగా ఉందమ్మా. ఎవరికి వాళ్ళు కాళ్ళు జాపుక్కూర్చుంటే భోజనాలు ఎప్పుడు ఔతాయి, ఎప్పటికి తెములుతాము ?'

'బ్లడ్ ప్రెషర్ కాదుగానీ... నువ్వు ఊరికే వర్రీ అయిపోతున్నావు అత్తయ్యా !'

'నీకలాగే అనిపిస్తుందమ్మా ! సంబంధం కుదురిన దగ్గర్నుంచీ మొగపెళ్ళివాళ్ళంటే హడలి చస్తున్నానా అలాగే జరుగుతోంది. బాబిగాడికి ఏం రోగమని చెప్ప, మొగపెళ్ళివాళ్ళు కారు పంపించమంటే పంపడం మానేసి బస్కీలు తియ్యడానికి పోయాడు. ఇంట్లో శుభకార్యంతో సతమతమవుతుంటే ఓ రోజు మానేస్తేనే బోడి కసరత్తూ వీడూనూ— ఉన్న రెండు కార్లుతోపాటు అద్దెకార్లో రెండు పెట్టుకున్నది పూజ చెయ్యడానికా ? పెళ్ళి కొడుకు బావగారు మీ ఆయన ఫ్రెండు కాబట్టి సమయానికి ఆయన చక్రం అడ్డువేసి గొడవరాకుండా చూసేదు గానీ... లేకపోతే వాళ్ళు అలిగి కూర్చుంటే చచ్చేవాళ్ళం కదా !'

'ఇలాంటి చిన్న చిన్న విషయాలు పట్టించుకోకూడదత్తయ్యా !'

'నువ్వు వెనకేసుకురాకమ్మా వీళ్ళందర్నీ ! అక్కయ్య పెళ్ళి అన్న జ్ఞానముందా విమలకి.. ఊరికే ప్రండ్సు ప్రండ్సు అంటూ వాళ్ళని పట్టుక్కూర్చుంది. విస్సుగాడేమో... వాళ్ళ ఆఫీసు వాళ్ళెవరో వస్తారుట... స్టేషనుకి పోయి కూర్చున్నాడు. మీ మావయ్య సరేసరి... పందిట్లో కూర్చుని బాతాఖానీ !'

'అత్తయ్య... మై డియర్ అత్తయ్యా నీ పేరు శాంత ! కనీసం దానికోసమన్నా శాంతంగా ఉండాలి నువ్వు.'

'అదొక్కటే తక్కువ ఈ బతుక్కి. ఆ.. చూడు సుజాతా... పొద్దున్నుంచీ ఒకటే హైరాన్లో ఉన్నావు. చేసీ... చేసీ నీకు శోషొచ్చిందంటే నాకు కాళ్ళూ చేతులూ ఆడవు. నువ్వు ముందు అర్జెంటుగా

వేన్నీళ్ళు స్నానం చేసేసి ముందే నాలుగు మెతుకులు తిని మేడమీదకెళ్ళి నడుం వాల్చు కాసేపు ఈ పూటకి వద్దనా ఇక్కడి పన్లూ మిగతా అంతా చూసుకుంటారు ముహూర్తం ఒకటిన్నరకి కాబట్టి పదకండింటికి నువ్వు మేడ దిగొచ్చినా చాలు! వెండీ, బంగారం, లాంచనాలు మధుపర్కాలూ మనం ఇచ్చుకునేవీ పుచ్చుకునేవీ అన్నీ దగ్గరుండి నువ్వు చూసుకుంటేనే నిబ్బరంగా ఉంటుంది నాకు— పీటలమీద కూర్చున్నాక నే లేవగన్లా ఏవంన్నానా?'

'అలాగే అత్తయ్యా!'

'అలాగే కాదు ముందు అర్జెంటుగా స్నానం చేసేసి రా సగం చిరాకొదుల్తుంది'

'ఇదిగో ఇప్పుడే వెళ్తున్నా!'

* * *

'నీ చదరంగం పాడుగానూ సుబ్బారావూ ఇంక అబ్బాయిని వదుల్తావా, భోజనాల వేళైంది ?'

'ఉండొదినా, ఆట మంచి పట్టులో ఉంది'

'పట్టు కాదు, నీకు పిచ్చి పట్టింది! బాబూ మూర్తీ మా మరిదితో కూర్చుంటే తెల్లారి పోతుందిగానీ నువ్వు లే నాయనా, భోజనాల క్కూర్చుంటున్నారు అందరూ!'

'అలాగేనండి!'

'అన్యాయం మూర్తిగారూ!'

'డోంట్‌వర్రీ మళ్ళీ కూర్చుందాం!'

'సరే ఎత్తు అలాగే ఉంచెయ్యండి భోజనం అయిపోగానే మళ్ళీ కూర్చుందాం!'

* * *

'పెళ్ళైపోయింది కదా అని మీరూ జారు కుంటే ఎలా సార్? రేపు మధ్యాహ్నం లంచీ సాయంత్రం రిసెప్షనూ పాట కచ్చేరీ అన్నీ అయిన తర్వాత ఎల్లుండి వెళ్దురుగాని ప్లీజ్!'

భరద్వాజగారి మాటకి ఎలా ఎదురు చెప్పాలా అని నే సందిగ్ధంలో ఉండగా

'నేనాయన్ని ఛస్ కోసం రెండ్రోజులు కిడ్నాప్ చేసేస్తుంటే ఎక్కడికో వెళ్ళిపోతాడని వర్రీ అయిపోతావేమిటి అన్నయ్యా?' అంటూ తగులు కున్నాడు సుబ్బారావు

'ఇప్పటికైనా ఓ మంచి పనిచేస్తున్నందుకు నిన్ను అభినందించకుండా ఉండలేన్రా సుబ్బీ' అన్నారు భరద్వాజగారు అర్థం కానట్టు చూశాడు సుబ్బారావు

'మావాడు చిన్న ట్యూబ్‌లైటెల్లెండి!' అన్నారు భరద్వాజగారు నావైపు చూసి

'పదండి మూర్తిగారూ ఎత్తుకి టైమై పోయింది కాదు కాదు లేటైపోయింది' అంటూ జరజరా లాక్కుపోయాడు సుబ్బారావు

* * *

ఇరవై నాలుగ్గంటల్లో దాదాపు ఇరవై గంటలు ఛస్సు ఆడితేగానీ వదిలిపెట్టేడుకాదు సుబ్బారావు విసుగొచ్చేసింది నాకు భరద్వాజగారి మాట కాదన్లేక ఉండిపోయానుగానీ లేకపోతే జారుకునేవాడ్నే! స్టేషనుకి వెళ్ళొస్తా అని సుబ్బారావు బైటికెళ్ళడం ఎంతో రిలీఫిచ్చింది నాకు ఇదే టైము పారిపోదాం అనుకుంటే సుజాత కనపడ్లేదు బిజీగా ఉంది లోపల

కాఫీ త్రాగుతూ పేపరు తిరగేస్తున్నా!

'మూర్తిగారూ' అంటూ ఎదురుగా నిల్చున్నారు భరద్వాజగారు

'సార్!' అని లేవబోయాను

'కూర్చోండి కూర్చోండి' అంటూ ఖరీదైన ప్యాంటూ, షర్టూగుడ్డలు నా భుజంమీద కప్పేరు ఎదురుచెప్పే టైములేదు ఒంగి నమస్కారం పెట్టేను 'మేగాడ్ బ్లెస్ యూ డియర్' అంటూ లేవదీసి, షేక్‌హ్యాండిస్తూ క్షమించండి మిమ్మల్ని చాలా ఇబ్బంది పెట్టేను' అన్నారు

'ఛ ఛ అదేంలేదు సార్ ఇట్స్ ప్లెజర్!'

'ఓకే! ఇంకో చిన్న కోరిక మన్నిస్తారు కదూ! ప్లీజ్'

'ఆజ్ఞాపించండి సార్!'

'ఏంలేదు ఊళ్ళోనే అనుకోండి అమ్మాయి మనుగుడుపులుకి వెళ్ళాలి దాంతో సుజాతని పంపిద్దామని నేనూ మా శాంతా అనుకుంటున్నాము ప్లీజ్'

'తప్పకుండా సార్, అలాగే!'

'మరో బుల్లి కోరిక్కూడా కోరనా?'

'మీరలా అంటుంటే బాధగా ఉంటుంది నాకు శాసించండి సార్!'

'మరి మీరీ మూడ్రోజులూ ఇక్కడే ఉండాలి!'

'లేదుసార్ మళ్ళీ వస్తా!'

'ఇంతలోనే మాట తప్పుతున్నారూ'

'అబ్బే లేదు సార్ అ లా గే అలాగే సార్, ఇక్కడే ఉంటా!'

'థాంక్యూ వెరీమచ్' — భరద్వాజగారు వెళ్ళిపోయారు

* * *

జీ ఎమ్ ఇల్లన్న భయమూ పెద్దవాళ్ళ ముందర వినయమూ రెండూ చేరి సిగిరెట్టు తాగే కోరిక అణచివేశాయి పిచ్చెత్తిపోయినట్లైంది జేబులో నలిగిపోయిన ఒకే ఒక్క విల్సు సిగిరెట్టు తడిమి చూసుకోగానే అమృతంలా స్ఫురించింది నెమ్మదిగా మెట్లుదిగి వరండాలోకి వచ్చాను ఎవరూ చూడకుండా లాన్సులోకి వెళ్ళి వెలిగించాను

నా సుఖాన్ని వర్ణించలేను హాయైన వాతా వర్ణంలో చాలా హాయిగా ఎంజాయ్ చేశాను సిగరెట్టుతో! వెనక్కి తిరిగి వస్తూంటే భరద్వాజగారి గొంతుక సన్నగా వినిపించింది గుండె ఆగినంత పనైంది నాకు చుట్టూ చూశాను లాన్సులోలేరు, మళ్ళా వెనక్కి తిరిగి చూస్తే పక్కరూము కిటికీ లోంచి కనిపిస్తున్నారు ఆయన వెనక్కి తిరిగి ఉన్నారు కాబట్టి నన్ను 'చూడకపోవడం నా అదృష్టంగా భావించాను

సుబ్బారావు రాజారావు భరద్వాజగారు కబుర్లు చెప్పుకుంటున్నారు

'అన్నయ్య ముందు నా డౌటు తీర్చు సుజాతెవరు? అది చిన్న మావయ్యా చిన్న మావయ్యా అంటూ కలుపుకోరుగా వచ్చేస్తే 'ఎవరమ్మాయ్?' అనడం దారుణంగా భావించి 'హల్లో హవ్వార్యూ సుజాతా అనడం మొదలెట్టి ఏమే కోడలు పిల్లా దాకా వెళ్ళింది నా వ్యవహారం హూ ఈజ్ షీ?'

'వెర్రిమొహమా ఆ మాత్రం తెలీదురా నీకు మన పురుషోత్తం బావగారి కూతురు అన్నాడు రాజారావ్ నవ్వుతూ!

'నీ మొహం పురుషోత్తం బావకూతురు పెళ్ళై అమెరికా వెళ్ళి మూడ్నెల్లైంది— ఇది సుబ్బరామయ్య కూతురనుకుంటా!'

'అనుకుంటా ఏవిటి అన్నయ్య నీకూ తెలీదా?'

'సరి, సరి అది హాల్లో పెద్ద మావయ్య అంటూ నన్ను గుర్తుపడుతూ వచ్చి సుజాత మావయ్యా అంటూ కాళ్ళకి దణ్ణం పెట్టేస్తే మే గాడ్ బ్లెస్ యూ డియర్ అన్నానేగానీ ఎవరమ్మా నువ్వూ అన్లేకపోయాను ఆ డౌట్









నాకలా ఉండిపోయింది. బాబిగాడ్నీ,విమల్నీ అడిగేను... తెలీదన్నారు. మీ వదిన్నడుగుదామంటే వంటింట్లోనో .. పెరట్లోనో ఎక్కడో కూర్చుంటుంది. పైగా మేడమీదకి ఎక్కలేదు. ఆవిడ కనపడ్డప్పుడు నాకు గుర్తురాదు..., గుర్తొచ్చినప్పుడు మీ వదిన కనపడదు— ఆ తర్వాతంతా హడావిడీ...'

'వదినకి అరడజను అన్నదమ్ములూ... మరో డజన్ కజిన్ బ్రదర్సూ...! ఎవరమ్మాయో నీకూ తెలీదూ... మాకూ తెలీదూ.., ఫన్నీగా భలేగా ఉందికదన్నయ్యా...?'

'ఇంకా ఈ డౌటు బుర్రలో ఉంచుకోడం దారుణం... వెళ్లు సుబ్బీ... అర్జెంటుగా వదిన్ని పిలు— డౌటు తీరిపోతుంది.'

'అలాగే అన్నయ్యా !'

'పిల్చారా' అంటూ వచ్చింది శాంతమ్మగారు.

'సుజాతెవరూ...?'

'ఏవిటండీచోద్యం...రామారావుగారమ్మాయి!'

'ఏ రామారావుగారూ.. ?'

'విశాఖపట్నం రామారావుగారు— సరేనా !'

'విశాఖపట్నం రామారావా ?'

'అబ్బా... అన్నీ మతిమరుపే మీకు. ఇరవై ఏళ్ళక్రితం అక్కడ చంగల్రావుపేటలో మనం అద్దెకుంటున్నప్పుడు పక్క ఇంట్లో ఉండేవారే, వాళ్ళింట్లో మనం మంచినీళ్ళు కూడా పట్టుకునేవాళ్ళం – ఎంతో కలువుగోరుగా ఉండేవాళ్ళు జానకమ్మగారూ ... రామారావుగారూ—వాళ్ళమ్మాయండీ ! ఏడెనిమిదేళ్ళు దానికప్పుడు –

'పెద్ద మావయ్య ... పెద్ద మావయ్యా అంటూ ఎప్పుడూ మీ దగ్గరే ఉండేది కదండీ సుజాత – దానికి రోజూ బిళ్ళలూ ... బిస్కట్లూ తెచ్చేవారు మీరు ... !'

'ఆ...ఆ...ఆ... ఆ అమ్మాయా ! ఓసీ ఎంతదైపోయింది. నా మతిమరుపు మండా. ఛ ... అది పెద్ద మావయ్యా ... పెద్ద మావయ్యా అంటూ ఆత్మీయంగా నా దగ్గిరకు రావడం ... నేనసలు గుర్తే పట్టకపోవడం ... దారుణం ! ఇంకానయం 'ఎవరమ్మా నువ్వు ?' అన్లేదు నేను. లేకపోతే పిచ్చితల్లి ఎంత నొచ్చుకునేదో ?'



## మదర్పిత... తాంబూలాది...

'ఆ...నాకూ గుర్తొస్తోంది అన్నయ్య ! చిన్న మావయ్యా చిన్న మావయ్యా ... గచ్చకాయలాడవా అంటూ వచ్చేది. ఇంతలో ఎంతైపోయిందీ ?'

'మొన్న విశాఖపట్నం వెళ్ళినప్పుడు వాళ్ళింటికి వెళ్ళేనా ... ప్రాణం పెట్టేరు జానకమ్మగారూ, రామారావుగారూ !'

కొత్త కొత్తగా చూసింది సుజాత నన్ను –

'నేనమ్మా .. శాంతమ్మని, పెద్దత్తయ్యని' అంటే ఓ క్షణం తటపటాయిస్తూ చూసి...లీలగా జ్ఞాపకం తెచ్చుకుని అంతలోనే సంబరపడిపోయి అత్తయ్యా అంటూ కావలేసుకుంది పిచ్చిపిల్ల. అసలు మిమ్మల్ని తలవని రోజుండదు. కాకపోతే మీరు బాగా మారిపోయారత్తయ్యా ! అందుకే వెంటనే గుర్తుపట్టలేకపోయాను. మేము హైద్రాబాద్‌కి ట్రాన్స్‌ఫరై వచ్చికూడా మిమ్మల్ని కలవలేకపోయాను. క్షమించండత్తయ్య ... ఎప్పటికప్పుడు ఏదో వీలుకాకపోవడం...అంటూ నొచ్చుకుని ఇరవై ఏళ్ళనాటి ముచ్చట్లన్నీ గుర్తు తెచ్చుకుని నిన్నా మొన్న జరిగినట్టు మరీ చెప్పిందండీ – పెద్ద మావయ్యెలా ఉన్నారూ ... చిన్న మావయ్యెలా ఉన్నాడూ ... సుబ్బారావు బాబాయెలా ఉన్నాడూ అంటూ మనిషి మనిషి గురించీ అడిగిందండీ...మనమంతా గుర్తే దానికి –

'వెరీగుడ్ ... ఆఁ ... ఇంతకీ ఆ మూర్తేం చేస్తూంటాడూ ?'

'అరె మీ మతి మెడ్రాసెళ్ళిపోయిందండీ ... వైజాగ్‌నుంచి రాగానే చెప్పేనా ... అతను మీ ఆఫీసుల్లోనే ఓ దాంట్లో గుమాస్తా అని –'

'రియల్లీ !!!' ఆశ్చర్యం కాదు; దాదాపు అరిచేరు భరద్వాజగారు.

'ఎవరు పిల్చారు వాళ్ళని ... ?'

'ఎవరు పిలవడమేవిటండీ ... ? వారంరోజులు ముందే రావాలే తల్లీ అని నేను బొట్టుపెట్టి మరీ చెప్పేను దానికి – కార్డు నలుగుర్తోపాటూ పంపేడు బాబిగాడు.'

'అతనెవరో మన ఆత్మబంధువనుకుని మర్యాదలు చేశాను. రేపు ఈ పరిచయం పెట్టుకుని ... ఒక గుమాస్తా ... ఆఫ్టరాల్ ఓ బ్రాంచిలో...ఓ మూల కూర్చునేవాడు . 'బాబాయ్' అంటూ నా గదిలోకి చొరబడితే ... నా గతేం కావాలి ? వాట్ విల్ బీ మై పొజిషన్ ?

'అవునన్నయ్యా . ప్రెమోషన్లకీ.. కాకాలకీ ఇలాగే వస్తారు జనాలు !'

'నో .. అయిపోయిందేదో అయిపోయింది. పంపించేయ్ వాళ్ళని. ఊఁ అర్జెంటుగా పంపించెయ్!' దాదాపు అరుస్తున్నారు భరద్వాజగారు.

''బాగుందండీ చోద్యం పిల్లతో మనుగుడుపులకి వెళ్ళేదాన్ని ... '

'అదేం వెళ్ళక్కర్లేదు ... !'

'లేకపోతే ఎవరెళ్తారూ ... ?'

'ఎవరో ఒకరు వెళ్తారు. సుబ్బిగాడి భార్య వెళ్తుంది – సరేనా !'

'సారీ అన్నయ్య ... నేనూ శ్యామలా బెంగుళూరెళ్ళాలి !'

'మీ ఆవిడ్ని పంపించరా రాజారావ్ !'

'తనక్కుదర్దన్నయ్యా...'

'ఓకే... ఓకే అయితే నువ్వే వెళ్ళు...'

'నేనా ?'

'అవునువ్వే ! నీ కూతురి మనుగుడుపులేగా !'

'ఈ బ్లడ్‌ప్రెషర్‌తో ఈ డయాబిటీస్‌తో... ఈ కీళ్ళజబ్బుతో... నేనా వెళ్ళేది – మతుండే మాట్లాడుతున్నారా ?'

'డామిట్ ..! అసలు మనుగుడుపులే లేదు అమ్మాయి నొక్కదాన్నే పంపు.'

'అదేవిటండీ... దిక్కులేని వాళ్ళలాగ ?'

'సరే సుజాతని పంపు. అది మళ్ళీ రానక్కర్లే దిక్కడికి. అట్నుంచి అటే వెళ్ళమను – ఆ మూర్తిగాడ్నెలా పంపిస్తారో నాకు తెలీదు. వాడి మొహం మళ్ళీ చూడకూడదు నేను. ఓకే ఇంకెళ్ళు .. ఊఁ ! వెళ్ళు; విసిగించక !'

నన్ను నేను గిల్లి చూసుకున్నాను. నిజమే; కల కాదు. జీ. ఎమ్. మొహం చింతనిప్పులా ఉంది. సంభాషణ జరుగుతున్నంతసేపూ శిలలా విల్చునే ఉన్నాను. చెవుల్ని ఈ గదికి అంకితం చేసి... నా కళ్ళు మాత్రం పక్క రూములో సుజాత మీద

## విద్యార్థిలోకం వ్యాసరచన పోటిలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

విద్యార్థిగా విద్యను ఆర్జించటమే నా ఆశయం అయితే నాకు స్కూల్లో చేరటం దగ్గర నుంచి పరీక్ష ఫలితాలు వచ్చేవరకు అడుగు అడుగునా అన్నీ ఆటంకాలే ఎదురవుతున్నాయి కె. జి. క్లాసులో నన్ను చేర్పించటానికి మా పెద్దవాళ్ళు ఎన్ని అవస్థలు పడ్డారో చెప్పగా విన్నాను. రేపు కాలేజీలో చేరాలంటే మళ్ళీ అన్నీ బాధలు పడవలసి వచ్చేట్టుగా ఉంది. ఆశయం ఆకాశంలో ఎగురుతూ ఉంటే, యదార్థం పాతాళంలో పాతుకుపోయింది.

నాకు — పెద్ద చదువులు చదివి డాక్టరో, ఇంజనీరో కావాలని ఉన్నది అయితే వాటిలో సీట్ల సంఖ్య తక్కువ ఉంటుంది కాబట్టి మంచి మార్కులు వచ్చినవారికే సీటు దొరుకుతుందని కష్టపడి చదివాము. కాని తెలిసిందేమంటే అక్కడ సీట్లలో కొన్ని డబ్బుకు ఇస్తారనీ, మరి కొన్ని మంత్రుల సిఫారసు ఉంటే దొరుకుతాయని, మరికొన్ని బడుగు వర్గాల వారికి కులాన్ని బట్టి ఇస్తారని తెలిసింది. అయినవారు అందరికీ సీట్లు పంచిపెట్టి మిగిలిన కొద్ది సీట్లు పోటీకి పెడితే మాలాగా కష్టపడి చదువుకునే వారికి నిరాశా, నిస్పృహలు కలిగిస్తున్నాయి "సినిమా టిక్కెట్లన్నీ బ్లాకులో అమ్మేసుకుంటే లైనులో ఉన్నవాళ్ళకి టిక్కెట్లు దొరకనట్లు"గా తయారైంది పరిస్థితి. మా ఆశయాలకు అది గొడ్డలి పెట్టులాగా ఉన్నది. కష్టపడి చదువుకోవడం మీద మాకు శ్రద్ధ తగ్గి, తగిన విరాళము ఇచ్చి చదివించలేని తల్లి దండ్రులమీద మాకు విసుగు కలుగుతున్నది నాకు తెలిసిన వారిలో చాలామంది ధనవంతులున్నారు. వారి బిడ్డలకు ఏ చదువు కావాలంటే అది దొరుకుతుంది విదేశాలకు గూడ పంపుతారు. వారి తల్లిదండ్రులు డబ్బు సంపాదించడము కోసము చాల అన్యాయాలు చేశారని విన్నాను. అందులో ముఖ్యమయినది లంచగొండితనం. పిల్లల చదువులకోసం పెద్దలు అన్యాయాలకు దిగి లంచగొండులు అయి అన్ని రకాల అరిష్టములకు కారణము అవుతున్నారు అందువలన మా ఆశయాలు వమ్ము అయి పోతున్నాయి.

సీటు దొరకడం వొక ఎత్తు. చదువుకోవడం మరొక ఎత్తు. పాఠ్య పుస్తకాలు సమయానికి దొరకవు. సిలబస్ పూర్తికాదు సిలిబస్ పూర్తి కాకపోవడమువలన పరీక్షలు వాయిదా పడుచున్నవి. పరీక్షల వాయిదాల వలన వేరే ప్రవేశ పరీక్షలు వ్రాయుటకు అ వ కా శ ము లేకుండా పోవుచున్నది. ఆ సిలబస్ కూడ సంవత్సరములో మేము చ ద వ లే న ం త, ఉపాధ్యాయులు చెప్పలేనంత ఉన్నాయి చివరలో నోట్సులిచ్చి గైడు కొనుక్కొని పరీక్షలు వ్రాసెయ్యడం జరుగుతుంది కాని మాకు చదువు రాదు. విద్య నేర్చుకున్నవాళ్లం కావడం లేదు తీరా పరీక్షకు పోతే చాల మందికి ప్రశ్నాపత్రాలు వెల్లడి అయినాయని తెలుస్తున్నది. వాళ్లు ఆ ప్రశ్నలకు సమాధానాలు చదువుకొని మంచి మార్కులు తెచ్చుకుంటారు పైగా మంచి సమాధానాలు వ్రాసుకొనివచ్చి, గైడు తెచ్చుకొని కాపీ కొడుతున్నారు. వారితో పోటీ చేయలేక నష్టపడుతున్నాము. మా ఆశలన్ని అడియాశలవుచున్నవి. ఒక్కోసారి వాళ్లతోపాటు పరీక్ష వ్రాయాలంటే మాకు సిగ్గు వేస్తుంది. కాపీ కొట్టే వాళ్లకి, మాకు వేరు వేరుగా పరీక్షలు పెడితే బాగుంటుంది. డిగ్రీలు కూడా రెండు రకాలుగా ఇవ్వవచ్చును.

ఈ పరీక్షలు ప్రతి సంవత్సరము నిర్ణయించిన తేదీలకు జరిగిన ఏ గొడవ వుండదు ప్రతిసారీ పరీక్షలు వాయిదా వెయ్యటంతో పరీక్షలు ఎప్పుడు జరుగుతాయో తెలియక, శ్రద్ధగా చదువడం కుదరదు. శ్రద్ధగా చదివినప్పుడు పరీక్షలుండవు. వాయిదా పడతాయిలే అని వూరుకున్నపుడు పరీక్షలు పెడతారు. ఇట్లా ఉండకూడదు.

సిఫారసు, డబ్బుకోసం మా పెద్దవాళ్ల తిరగడం, ప్రశ్నా పత్రాలు దొరుకుతాయో, కాపీలు ఎట్లా కొట్టాలో అని మా విద్యార్థులు వీధుల వెంట బడడం, ఉపాధ్యాయులు వాళ్ల జీతాలు, రాజకీయములతో మునిగి తేలటంతో సరిపోతున్నది. చదువు చెప్పేవాళ్లు లేరు. వినేవాళ్లు లేరు. చదువుకున్నావా ? అని అడిగేది లేదు. మమ్మల్ని ఈ గొడవల్లోకి ఇరికించకండి. బాగా చదువుకున్న వాళ్లకే అన్ని అవకాశాలు ఇస్తే మేము అన్నీ మరచిపోయి గట్టిగా చదువుకుంటాం. నాకు బాగా చదువుకోవాలని ఉంది. చదువుకోనియ్యండి. ★

### రచయిత్రి పరిచయం



"విద్యార్థిలోకం ఆశయాలు వ్యాస రచన పోటీలో నాకు ప్రత్యేక బహుమతి ఇచ్చి ప్రోత్సహించినందులకు కృతజ్ఞురాలను. నా పుట్టిన తేది 25–12–65. నేను హైదరాబాదులో హోలిమేరి పాఠశాలలో పదవతరగతి వరకు చదివి ఫస్టు క్లాసులో పాసయితిని. ఇప్పుడు సెయింట్ ఆన్స్ జూనియర్ కళాశాలలో ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరము చదువుచున్నాను."

— మధుబాల

---

కేంద్రీకరింపబడ్డాయి. లీలగా చమర్చిన ఆమె కళ్ళల్లోంచి ఉన్నట్టుండి వచ్చిన వరదంతా కళ్ళారా చూశాను. అదృష్టంగా మా ఇద్దరిమధ్యా సన్ షేడ్ ఉండకపోతే... తను నన్ను చూసేదే — భగవంతుడా నరకాన్ని తనకి కలిగించనందుకు ఆ క్షణంలో ఆనందం వేసింది

సుజాత కిందపడున్న తమలపాకుల్నేరుకుని బేగులో పెట్టుకోడం... కుంకంభరిణలో కుంకం తీసుకుని తనకి తనే బొట్టు పెట్టుకోడం . చీర కొంగుతో కళ్ళు ఒత్తుకుని హాలు వైపుకి నడవడం చూసింతర్వాత. నా తక్షణ కర్తవ్యం తెలిసొచ్చింది. అర్జెంటుగా గేటు దగ్గరకి పరిగెత్తి సిగిరెట్టు వెలిగించాను .. అంతసేపూ నేను ఆ పనిమీదే ఉన్నట్టూ నాకేం తెలియనట్టూ ! ఓ నిమిషం తర్వాత సుజాత వచ్చింది.

'పద ..పద మీ మావయ్యగారి కిందాకే చెప్పేశాలే ! మళ్ళీ సుబ్బారావుగారు పట్టుకుంటారు!' అంటూ చిరునవ్వు నవ్వేను. నిండుగా నవ్వింది సుజాత. నే జీవితాంతం సుజాత నలాగే చూడాలి నవ్వుతూ !

'ఆటో పిలుస్తా ఉండు!' అంటూ రెండడుగులు ముందుకివేసి రోడ్డువైపు చూస్తూ నిల్చున్నాను. ఓ నిమిషం గడిచింది. . ఆటో దొరకలేదు.

'వెళ్ళొస్తా మత్తయ్యా .. రోడ్డుమీద దొరుకుతుందిలే ఆటో' అంటూ సుజాత గట్టిగా అనడం వినిపించింది. అయినా నే వెనక్కి తిరగలేదు నాకు తెలుసు అక్కడ శాంతమ్మగారు లేరని — సుజాత కదిలింది. నెమ్మదిగా నేనూ ఓ అడుగు ముందు కేశాను

నే ముందు నడుస్తున్నా... వెనకాలే సుజాత నిండుగా కప్పుకుని నడుస్తోంది. 'ఆటో... ఆటో' అంటూ రోడ్డుమీదెళ్ళే ఆటోని ఆపుచేశాను. ★

# కార్టూనిస్టులకు సూచనలు!

- ★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి
- ★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- ★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!
- ★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగా వుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- ★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.
- ★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకి ఐదారువారాలు పట్టవచ్చు.
- ★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం
- ★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవదని మనవి.
- ★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతవేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥

# వారఫలం

3-12-1982 శుక్రవారం మొదలు
9-12-1982 గురువారం వరకు

**♈ మేషం** అధికారం వృద్ధినందగల వారం ఏదో మేలు ఈవారంలో ముఖ్యంగా ఉద్యోగ రంగంలో కనిపిస్తుంది. ధనాదాయం గలవారం పుణ్యకార్యాలతో కొందరకు వారం గడచిపోతుంది ఉద్యోగంలో కొందరకు ఆశించిన 'ప్రమోషన్' లభింపగలదు స్త్రీలకు: ధనలబ్ధి, నూతనోత్సాహానికి అవకాశం గలవారం

**♉ వృషభం** నూతనంగా వస్త్రాలు సేకరించుటతో వారం గడచిపోతుంది కొందరకు విద్యాభివృద్ధికి అవకాశం గలవారం వయసు మీరినవారు మాత్రం 'రక్తపోటు' 'అజీర్ణం' లాంటి ఇబ్బందులకు గురికాగలరు. ధనలబ్ధికి అవకాశాలు కూడా ఏర్పడనున్నవి. స్త్రీలకు కళా సాహిత్య రంగాలలో అభివృద్ధికరమైన మార్పులు కూడా రానున్నవని గ్రహించాలి.

**♊ మిథునం** ప్రజారంగంలో పాటుపడే వారికీ, సాంఘికంగా కాలం వ్యయించే వారికి, 'ఆకాశవాణి' లాంటి సంస్థలందు అవకాశాలు లభించుటకు, రచనా వ్యాసంగం ఫలించుటకు అవకాశం గలవారం స్త్రీలకు నగలు కొనుగోలు చేయుటకు, శుభకార్యానుకూలతకు అనువైన వారం

**♋ కర్కాటకం** అధికారుల ఆదరణ, క్రయ విక్రయాలలో లాభం, బంధు వర్గీయుల రాకపోకలు, శుభ ప్రయోజనాలను గూర్చిన చర్చలు, ఒకనొక వ్యాపార ముఖ్య విషయం అనుకూలంగా పరిష్కరింపబడటం, ఇత్యాది శుభానుకూల విషయాలు అనుభవనీయం గలవారం. స్త్రీలకు: సుఖశాంతులు, ఆరోగ్యాభివృద్ధికి అవకాశం గలవారం గృహానందం, మొత్తానికి లాభదాయక వారమే.

**♌ సింహం** ఉత్సాహవంతమైన దినాలు ఆలోచనలు ఫలిస్తాయి అధికారుల ఆదరణ ఆనందోత్సాహాలకు దోహదం చేయగల రోజులు వస్తు వాహనాలు కొనుగోలు చేయుటకు ఋణదాతల వత్తిడినుండి తప్పించుకొనుటకు వీలయినంత ఆర్థిక లాభం చేకూరగలదు స్త్రీలకు విద్యా వైజ్ఞానిక రంగాలలో అభివృద్ధి కనిపిస్తుంది

**♍ కన్య:** శ్రద్ధతో, ఆసక్తితో, నిబ్బరంతో, మీకు సంబంధించిన వ్యవహారాలను పరిష్కరించుకోగలరు మితిమీరిన ఖర్చులు కూడ భరించవలసి యుండును నాల్గువంతుల ఆదాయం, పదివంతుల ఖర్చు పైన బడుతుంది స్త్రీలకు: కళా రంగంలో, రచనా విధానంలో, గౌరవ ప్రతిపత్తులు అతిశయింపగలవు ఆర్థికంగా మేలు జరిగే వారం.

**♎ తుల** దూర బంధువులు యింటికి రానున్నారు. జరిగినా జరుగక పోయినా శుభ కార్యాల విషయంలో తర్జనభర్జనలు తప్పవు రాజకీయ రంగంలో కొందరకు అనుకూలత ఏర్పడుతుంది చాలకాలంగా జరుగక నిలచిన వ్యవహారాలకు కదలిక ఏర్పడుతుంది స్త్రీలకు: ప్రతిష్ఠ అతిశయించటం, ధనలబ్ధి చెప్పదగిన వారం

**♏ వృశ్చికం** నూతనంగా ప్రారంభించిన వ్యాపారంలో లాభిస్తున్న దనే ఆశ కనిపిస్తుంది. కళా వైజ్ఞానిక రంగాలలో ముందడుగు వేస్తారు. బంధువులకు సహాయం చేయవలసిన పరిస్థితులు కూడా ఉంటాయి. స్త్రీలకు: క్రొత్త సామానులు తీయటం, కుటుంబానందం గలవారం

**♐ ధనుస్సు** అదనపు ఖర్చులు నెత్తిన పడటం, ఆడంబరాలకు ధనం వ్యయం చేయవలసి రావటం, ముఖ్యులతో చికాకులు ఏర్పడటం, అనవసరమైన ప్రయాణాలు చేయవలసి రావటం, ఈవారం, లక్షణం. స్త్రీలకు సాహిత్య రంగంలో కొందరకు, రాజకీయంగా కొందరకు అధికంగా ఆదరణకు అవకాశం గలవారం.

**♑ మకరం:** ముఖస్తుతులు చేసేవారు కొందరు స్తోత్రప్రియులు కొందరు చుట్టూ చేరుతారు. నూతన వస్తువులు కొనుగోలు చేయటం, నూతన వ్యాపారంలో జోక్యం కలుగజేసికొనుటకు అవకాశం గలవారం. ఆర్థికంగా బాగుంటుందని వేరుగా చెప్పనక్కరలేదు. స్త్రీలకు: వస్తువులు కొనుగోలు చేయటం, కుటుంబంలోని హడావుడి పనులతో వారం గడుస్తుంది.

**♒ కుంభం** అనాయాసంగా ధనలబ్ధి, అనుకోకుండా ఒకానొక క్రొత్త వ్యాపారం ప్రారంభించటం, అధికారుల వలన జరుగదగిన పనులుంటే సుకరంగా నెరవేరుటకు, సాహితీ పరంగా కొందరకు నూతనావకాశాలు లభించటం ఈవారం లక్షణం. స్త్రీలకు: పెండ్లి పేరంటాలతో, ప్రస్తావనలతో వారం గడచిపోతుంది.

**♓ మీనం** చాలమంది క్రయ విక్రయాల నిమిత్తం దూర ప్రాంతాలకు ప్రయాణించ గలరు కొందరు రాజకీయంగా నూతన ప్రయత్నాలలో జోక్యం పుచ్చుకోగలరు. కొందరు వింద వినోదాలలో పాల్గొనే అవకాశం గలవారుగా ఉంటారు స్త్రీలకు వృత్తి ఉద్యోగాలలో ఆదరణ, ఆదాయం, అనుకూలం లభించే అవకాశమున్నది

— విద్వాన్ కోట [illegible]

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక
పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు,
గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్,
హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.



# నీలాకాశం

సీరియల్ — శ్యామల



**(గత సంచిక తరువాయి)**

సాయంత్రం ఎక్స్-రే క్లినిక్కి వెళ్ళి ఇరవై రూపాయలు చెల్లించి, ఫోటో తీసుకొని తమ డాక్టరుగారి యింటికి వెళ్ళింది ఇందిర. ఆదివారం సాయంత్రాలు ఆయన సామాన్యంగా పేషంట్స్‌ని చూడరు. కాని ఫామిలీ ఫ్రెండ్‌గా తనను చూస్తారనుకొని వెళ్ళింది. వెంట ఎవరినీ తీసుకు వెళ్ళలేదు. ఆయన ఏం చెప్తాడో, తను ముందుగా విని, ఆలోచించుకొని, ఇంట్లో వాళ్ళకు ఎంత చెప్పాలో అంతే చెప్తుంది. వీలయినంతవరకు బాధలు మరెవరికీ తగలకుండా చేయాలనేది ఇందిర ఆలోచన.

డాక్టరుగారు ఎక్స్-రే పరిశీలించి "నేననుకున్నదే నిజమయిందమ్మా, ఇందిరా! ఉషకి టి. బి. చాలా కొద్దిగా, ప్రారంభ దశలోనే ఉంది. కొన్నాళ్ళు మందులు తీసుకుంటే చాలు— నో ప్రాబ్లమ్! ఈ సంవత్సరానికి బడి మాన్పించాలి. బలమైన ఆహారం, మందులు వాడాలి స్వచ్ఛమైన గాలి లభించే పల్లెటూర్లయితే, త్వరగా నయమయిపోతుంది ఈ జబ్బు ఇక్కడయినా ఫర్వాలేదనుకో—"

ఇందిరకు కాళ్ళక్రిందనించి భూమి తొలగిపోతున్నట్లే అయింది. ఆయన మాటలు చెవులలో పడ్తున్నాయేకాని మనసులోకి పోవటంలేదు. కళ్ళు విప్పార్చి, అలాగే చూస్తున్న ఇందిరకు ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థం కాలేదు డాక్టరుగారికి.

"ఇందిరా, నేను చెప్పేది శ్రద్ధగా వినమ్మా! ఈ రోజుల్లో టి. బి. ప్రమాదకరమైన వ్యాధి కానే కాదు. అద్భుతమైన మందులు ఉన్నాయి. అసలు ఉషకి చాలా మొదటి దశలోనే ఉంది. ఇంకా అసలు అంటువ్యాధి దశకు కూడా రాలేదని నా అభిప్రాయం. కళ్ళె పరీక్ష, రక్త పరీక్ష అన్నీ చేయిస్తే ఇంకా సరిగ్గా తెలుస్తుంది ఉష పేషంట్‌లాగా బెడ్‌మీదనే ఉండవలసిన అవసరం ఏమీ లేదు. మామూలుగా తిరుగుతూ, తన పనులన్నీ చేసుకుంటూ ఎప్పటిలాగానే ఉండవచ్చును. మరీ ఎక్కువ అలసట అయితే మంచిది కాదని, ప్రస్తుతానికి బడి మాత్రం మాన్పించమన్నాను. అసలు నీవు ఉషతో, 'ఇదీజబ్బు' అని చెప్పవలసిన అవసరం కూడా లేదు. రేపు హాస్పిటల్‌కి తీసుకురా, తక్కిన పరీక్షలు చేయించి, మందులు రాసి యిస్తాను. ఏం కంగారు లేదు, అర్థమయింది కదూ?"

అర్థమయిందన్నట్లు తలూపింది ఇందిర. "రేపు హాస్పిటల్‌కి తీసుకువస్తాను" అని చెప్పి బయటకు వచ్చింది.

వెంటనే ఇంటికి వెళ్ళాలనిపించలేదు. తన ఆలోచనలన్నీ సరిగా పేర్చుకోక ముందు యింటికి వెళ్ళటం ఇష్టంలేక, బస్ ఎక్కి టాంక్‌బండ్‌కి వెళ్ళింది. ఆట్టే జనం లేనిచోట ఒక బెంచీపైన కూర్చొని, హుస్సేన్‌సాగర్ వైపు చూస్తూ మనసు కుదుటపరచుకోవటానికి ప్రయత్నించింది.

ఉషకి వచ్చిన జబ్బు ప్రమాదకరమైనది కాదన్నారు డాక్టరుగారు కాని మందులు, పాలు, ఇటువంటివన్నీ బాగా యివ్వాలి. డబ్బు.. డబ్బు.. కావాలి. తన టెంపరరీ జాబ్ పది రోజుల్లో ముగుస్తుంది ఇంటిపైన వచ్చే అద్దె, నాన్న ప్రావిడెంట్‌ఫండ్ పైన వచ్చే బాంక్ వడ్డీలతో ఇల్లు గడవటమే కష్టంగా వుంది. ఈ సమయంలో ఈ ఖర్చు ఎలాగు? ఏదో విధంగా ఉషకు మంచి వైద్యం చేయించాలి. చిట్టితల్లి ఉషకు, ఎందుకు వచ్చిందో ఈ జబ్బు? అమ్మ, నాన్న వెళ్ళిపోయారు— తమ్ముళ్ళు, చెల్లి సుఖంగా వుంటే చాలనుకుంది. బంగారు తల్లికి ఎలాగయినా నయం చేసుకోవాలి. చెల్లెలిమీద ప్రేమతో ఇందిరకు గొంతు నిండు గొచ్చింది.

"హలో, లిటిల్ గర్ల్! గుడీవినింగ్."

ఉలిక్కిపడి తలెత్తి చూసింది. డాక్టర్ జాక్సన్ చిరునవ్వుతో కనిపించాడు.

"ఇక్కడ కూర్చోవచ్చునా?" అంటూ ఆ బెంచీపైనే మరోవైపు కూర్చున్నారు ఆయన "ఊరికే షికారుగా ఇటు వచ్చేసరికి నీవు కనిపించావు."

ఇందిరకు ఒంటరిగా ఉండాలని ఉంది కాని ఆ మాట పైకి అనలేక ఊరికే ఉండిపోయింది.

ఇద్దరూ మవునంగా కూర్చున్నారు కొంతసేపు

"ఏదో దీర్ఘాలోచనలో ఉన్నావు, ఏమిటమ్మా? ఏమయింది?" ఆదరంగా అడిగాడు ఆయన

పెద్దవాడు, స్నేహంగా అడుగుతున్నాడు ఇందిరకు చటుక్కున మనసులోని వ్యధనంతా ఆయనకు చెప్పుకోవాలనిపించింది. ఉష జబ్బు గురించి ఇంట్లో వాళ్ళకు చెప్పాలా, వద్దా అనేది ఇంకా నిశ్చయించుకోలేదు. ఇట్లా మనసులో బంధించి ఉంచుకోవటం కంటె, ఈ బాధలు వెళ్ళబోసుకుంటే కొంత ఉపశమనం చిక్కుతుందేమో! ఉద్యోగం విషయంలో కూడా సహాయం కూడా చేయగలడేమో!

తన విషయాలన్నీ చెప్పసాగింది ఇందిర, ఆక్సిడెంట్‌లో అమ్మ, నాన్న పోవటం దగ్గర్నుంచి ఈ రోజు డాక్టరు ఉషకి టి. బి. అని చెప్పటం వరకు అన్నీ ఆయనకు చెప్పేసింది. చెప్తున్నకొద్దీ భావావేశం హెచ్చి, తన మనస్సులోని ఆశలు, ఆశయాలు అనుభూతులు — అన్నీ వెలికి వచ్చాయి

నిశ్శబ్దంగా అంతా విన్నాడు డాక్టర్ జాక్సన్ ఆయన కళ్ళు సానుభూతిని వర్షిస్తున్నాయి.

అంతా చెప్పాక అన్నది ఇందిర, "నాకు ఇప్పుడు ఉద్యోగం చాలా అవసరం. మీరు ఏదయినా చూపించగలరా?"

ఆయన కాస్సేపు ఏం మాట్లాడలేదు. తర్వాత "నేను ఈ ఊరికి ఇప్పుడు ఎందుకు వచ్చానో తెలుసా? నాకు టైపిస్టుతో అవసరం పడింది ఎవరయినా వచ్చి మా పల్లెలో కొన్నాళ్ళు ఉండి, టైపింగ్ వర్క్ చేస్తారేమో, కనుక్కుందామని వచ్చాను. నీవు 'హోటల్ బ్లూబెల్స్'లో టైపిస్ట్‌వే కదమ్మా! ఇష్టమయితే, ఇక్కడ జాబ్ అయిపోగానే వచ్చి నావద్ద టైపిస్ట్‌గా చేరవచ్చు."

అనుకోని ఈ ఉద్యోగ ప్రపోజల్ ఇందిరకు ఆశ్చర్యం కలిగించింది.

"కానీ, నేను వేరే ఊరిలో ఉంటే తమ్ముళ్ళు, చెల్లి ఎలాగండీ? మేము నలుగురం అయినా కలిసి ఉండాలి—"

"చెల్లెలిని నీతోపాటే తీసుకురావచ్చు. పల్లెగాలి ఆ అమ్మాయికీ మంచి చేస్తుంది. తమ్ముళ్ళు శ్రద్ధగా చదువుకొనే పిల్లలే కదా, మీ అమ్మమ్మగారు దగ్గరే ఉంటారు! ఆలోచించి చూడు. ఇప్పటికి వెళ్దాం రా, చీకటి పడుతున్నది. నా కారులో దింపుతాను మీ యింటి వరకు, పద."

**జరిగిన కథ — 5** ఆ రోజు రామారావ్ సుభద్రల సిల్వర్‌జూబిలీ సెలిబ్రేషన్స్‌కి అన్ని ఏర్పాట్లు చేస్తారు వారి సంతానం ఇందిర, రమేష్, సురేష్, ఉష. దానిలో భాగంగా రామారావ్, సుభద్రలను సినిమాకి పంపుతారు పిల్లలు. సినిమా చూసి స్కూటర్‌మీద వస్తూ యాక్సిడెంట్‌లో మరణిస్తారు ఆ దంపతులు. మధుతో ఇందిర పెళ్ళి గతంలోనే ఖాయం చేయడం జరుగుతుంది. తన తమ్ముళ్ళ, చెల్లి భవిష్యత్తు తీర్చిదిద్దడానికి మధుకి యిష్టం లేకపోయినా ఉద్యోగంలో చేరాలనుకుంటుంది ఇందిర. తన స్నేహితురాలు వీణ సహాయంతో ఓ ఫైవ్ స్టార్ హోటల్లో టెంపరరీ పోస్ట్‌లో ఇందిర టైపిస్ట్‌గా జేరుతుంది. తన కుటుంబాన్ని పైకి తీసుకువచ్చేవరకు ఆగమని ఇందిర ఎన్ని విధాల నచ్చజెప్పినా వినని మధు ఆమెతో తెగతెంపులు చేసుకోవడానికే నిశ్చయించుకొంటాడు. డాక్టర్ జాక్సన్‌తో ఇందిరకు పరిచయం కల్గుతుంది ఆయన వివరాలు తెలుసుకొని ఆశ్చర్యపోతుంది

ఇందిర లేచింది కారు పోనిస్తూ చెప్పాడు డాక్టర్ జాక్సన్ "ఉష ఆరోగ్యం గురించి మాత్రం నీవేమీ దిగులు పడవద్దు ఇందిరా! టి బి అనేది ఈ రోజుల్లో ఏ మాత్రం ప్రమాదకరమైనదికాదు రేపు మీ డాక్టరుగారు చెప్పిన పరీక్షలన్నీ చేయించాక, అవసరమైతే నాకు తెలిసిన స్పెషలిస్ట్ వద్దకు తీసుకువెళ్తాను, సరేనా ?"

ఇందిర ఇంటి ముందు కారు ఆపి "నువ్వు అలా దిగులుగా ఇంట్లోకి నడిస్తే, అందరూ ఏమయిందోనని కంగారు పడ్తారు. కాస్త హుషారుగా ఉండాలి మరి ?" అన్నాడు

ఇందిర నవ్వి "మీరూ లోపలికి రండి. తమ్ముళ్ళకి మీతో పరిచయం చేసుకోవాలని ఉంది" అన్నది

"నాతోనా ? నా గురించి వాళ్ళకు ఏం చెప్పావేమిటి ?"

"హోటల్‌లో విన్నది చెప్పాను, అంతే. రండి!" లోపలికి దారితీసింది. ముందు గదిలోనే కూర్చొని ఉన్నారు రమేష్, సురేష్, ఇందిర కోసం ఎదురు చూస్తూ. ఇందిరతో వస్తున్న డాక్టర్ జాక్సన్‌ని ఆశ్చర్యంగా చూశారు. విదేశీయుడు, భారీ మనిషి, వడివయస్సు దాటిన వ్యక్తి— గుర్తు పట్టాను, అన్నట్లుగా సురేష్‌వైపు చూశాడు రమేష్. 'నేనూ గ్రహించాను' అన్నట్లు చూశాడు సురేష్. వృద్ధాప్యం తొంగి చూస్తున్నా ఆయన ఎంత దృఢంగా కనిపిస్తున్నాడు! ముఖంలో కాంతి, కళ్లలో కరుణ, పెదవులపై చిరునవ్వు — మొదటి చూపులోనే వాళ్ళను ఆకట్టుకున్నాడు డాక్టర్ జాక్సన్ ఇద్దరూ లేచి నిలబడ్డారు.

"తమ్ముళ్ళు రమేష్! సురేష్! వీరు డాక్టర్ జాక్సన్" పరిచయాలు చేసింది ఇందిర.

పరస్పరం గ్రీటింగ్స్ అయినాక అంతా కూర్చున్నారు

"అమ్మమ్మ, ఉష ఏరి ?" అడిగింది ఇందిర.

"గుడికి వెళ్ళారు" చెప్పాడు రమేష్.

ఇందిర లోపలికి వెళ్ళింది, టీ చేయటానికి. డాక్టర్ జాక్సన్ రమేష్‌ని, సురేష్‌ని స్నేహంగా పలకరించాడు—"మీలో డాక్టర్ కావాలనుకుంటున్నది ఎవరు ? ఇంజనీరు కావాలని కోరుకుంటున్నది ఎవరు ?"

"ఏమోనండీ ... ఇంతకు ముందు ఎన్నోరకాల ఆశలు ఉండేవి ఇప్పుడు ఆశలు పెట్టుకోవటం మంచిదికాదు — అనిపిస్తోంది. అసలు మాకు చదువులు చెప్పించాలని అక్క తాపత్రయపడ్తోంది కాని, మాకు ఉత్సాహం పోయింది" సురేష్ చెప్పాడు. ఆయనను మొదటిసారి కలుసుకుంటున్నట్లు వాళ్ళకు అనిపించలేదు. ఎంతో సన్నిహితంగా, ఆత్మీయంగా ఫీలయినారు.

"నాకు అమ్మ ఇంకా ఇంట్లో తిరుగుతున్నట్లే అనిపిస్తున్నది. 'నాన్నా రమేష్' అంటూ ఎంతో ఆప్యాయంగా పిలిచేది" రమేష్ మనస్సు గతంలోకి చూస్తున్నది.

వాళ్ళు అంత త్వరగా ఎవరి ముందూ బయట పడరు. కాని డాక్టర్ జాక్సన్‌లోని ఏదో కరుణా రసం వాళ్ళ మనసులు విప్పి మాట్లాడేటట్లు చేసింది.

"పుట్టుక ఎంత సహజమో, మరణించటమూ అంతే సహజం పుట్టటం ఒక బిందువు అయితే, మరణం మరొక బిందువు. ఈ రెండు బిందువులను కలిపే గీతే జీవితం ఎవరి గీత ముగిసినపుడు వాళ్ళు వెళ్ళిపోతారు. అంతేకదా! ఈ నా జీవితంలో, నా చేతులతోనే నాకు ప్రియమైన వారిని ఎందరినో సాగనంపాను నాకు దుఃఖం, బాధ లేవని కాదు ఇది జీవన ధర్మం అని గ్రహించాను, దానిని అంగీకరించటం నేర్చుకున్నాను"

ఇందిర అప్పుడే అక్కడికి వచ్చింది ఆయన మాటలు విని ఆవేశంగా అన్నది, "మీరు చెప్పేది కాదనను డాక్టర్ జాక్సన్! కాని ఏది జీవన ధర్మం? పసిపిల్ల ఉషకి తల్లి, తండ్రి లేకుండా చేయటమేనా జీవన ధర్మం ? జీవితం ప్రొద్దువాలిపోతున్న తరుణంలో అమ్మమ్మకు బిడ్డను దూరం చేయటమేనా ? ఇంత క్రూరమైన దేమిటండీ మీరు చెప్పే జీవన ధర్మం ? ఇంత మనసులేని వాడా ఆ దేవుడు ?" బాధతో ఆమె గొంతు పూడుకుపోయి నట్టే అయింది.

డాక్టర్ జాక్సన్ చిన్నగా నవ్వి "ఎంత ఆవేశం ఇందిరా, నీకు ? ఈ లేత వయసులో అది సహజమే నేమో! కాని ఒకటి చెప్తాను విను భగవంతుడి లీలలు బహు చిత్రమైనవి అవి మనకు అర్థం కానంత మాత్రాన అర్థం లేనివని అనకూడదు చీకటి, వెలుగు ఒకదాని వెంటనే మరొకటి ఉండటం సహజం అని గుర్తు పెట్టుకోవాలి జీవితంలో రకరకాల అనుభవాలు ఎదురయి, మనిషిని ఉక్కిరి బిక్కిరి చేసి, బెదరగొట్టి, నడిసముద్రంలో పడవ లాగా చేస్తాయి మనకు అతీతమైన శక్తి ఒకటి ఉన్నదని నమ్మకం ఉంటే ఆ దృక్పథం చుక్కాని లాగా సాయపడ్తుంది మనం వెలిగించుకున్న ఓ దీపం గాలికి ఆరిపోతే, ప్రపంచానికి చీకటే సహజమని అనగలమా ? ఆలోచించు ఇందిరా, జీవితంలోని గజిబిజి ఆకారాలన్నిటినీ కలిపి అర్థం ఇచ్చే దృక్పథం కోసం వెతుకు! నీ ప్రశ్నలన్నిటికీ సమాధానాలు చెప్పగలిగే భాష్యం నీ మనసులోనే ఉన్నది! అంతర్ముఖంగా దృష్టి మరలించటానికి సాధన చేయి! నీకు మనశ్శాంతి, ఊరట చిక్కుతాయి"



ఆయన మాటలు అర్థం కానట్లు చూస్తున్న ఇందిరతో — "ఏదో ఉపన్యాసం ఇస్తున్నానని పిస్తోందా ? పోనీలే, ముందు టీ తీసుకో — తర్వాత వేదాంతం !" అని నవ్వాడాయన.

"మీరు ఫిలాసఫీ మాట్లాడటం నాకు ఆశ్చర్య కరంగా ఉంది" అన్నాడు సురేష్.

"నిత్యం చావు, పుట్టుక, బాధలు చూస్తూ ఉంటారు కదా డాక్టర్లు ! కొంతయినా వేదాంతం వంటబట్టించుకోకపోతే ఇలా తిరగలేం మరి ! అందులోను నాకు భారతీయ తత్త్వశాస్త్రంలో చాలా ఆసక్తి ఉంది. భారతదేశంలో నేను నేర్చుకున్న విషయాల గురించి ప్రస్తుతం ఇంగ్లీషులో ఒక పుస్తకం రాస్తున్నాను. దాని విషయంలోనే టైపిస్ట్ కావాలని ఇందాక అన్నాను" అన్నాడు ఇందిరవైపు తిరిగి.

"మీరు డాక్టరు, సోషల్ వర్కర్, రచయిత— ఇంకా ఏమేమిటి ?" మెప్పుకోలుగా చూస్తూ అడిగింది ఇందిర.

ఆయన నవ్వాడు "అవన్నీ మరిచిపోయి మంచి స్నేహితుడిగా గుర్తిస్తే చాలు !"

ఒకటి, రెండురోజుల్లో ఆలోచించి నిర్ణయం తెలుపమని ఇందిరకి చెప్పి డాక్టర్ జాక్సన్ వెళ్ళిపోయాడు.

ఉష కంప్లెయింట్ గురించి తమ్ముళ్ళకు చెప్పింది ఇందిర. వాళ్ళిద్దరూ నిర్ఘాంతపోయారు.

"అక్కా, ఎందుకిలా అయింది ?" సురేష్ స్వరం వణికి, కళ్ళు తడి అయినాయి.

"ఎందుకు అనే దానికి ఏం జవాబు చెప్ప గలంరా ?" అతని చేతిని మృదువుగా తన చేతుల్లోకి తీసుకుంది.

రమేష్ తీవ్రంగా ఆలోచిస్తూ గదిలో పచార్లు చేస్తున్నాడు "అక్కా, నేను చదువుమానేసి ఏదయినా పని వెతుక్కుంటాను. చెల్లికి మంచి వైద్యం చేయిద్దాం" అన్నాడు.

"నీవు చదువు మానేస్తే, ఇంక ఉష గురించే కాక నీ గురించి కూడా దిగులు పడటం ప్రారంభించాలి నేను ! మీ రిద్దరూ కష్టపడి చదివి, మార్కులు బాగా తెచ్చుకొని బి.ఇ లో., మెడిసిన్‌లో సీట్లు సంపాదించుకోవాలి. నేను మంచి జాబ్ కోసం ప్రయత్నిస్తున్నాను కదా ! డాక్టర్ జాక్సన్ ఆయన పల్లెకి వచ్చి, ఆయన వద్ద టైపిస్ట్‌గా పని చేయమన్నారు. ఉష ఆరోగ్యానికి పల్లెటూరి వాతావరణం మంచిది కూడా. కాని క్రొత్తచోట్లో— పల్లెలో— ఎట్లా ఉండటమని ఆలోచిస్తున్నాను. మనమంతా మొదటినించి కలిసి ఉండటమే కదా అలవాటు—"

"అక్కా, నువ్విక్కడే మాతోనే ఉండు ! మేమే ఏవయినా పనులు వెతుక్కుంటాం" అన్నారు రమేష్, సురేష్ ఇద్దరూ. ఇందిర వినిపించుకోనట్లు గదిలోకి వెళ్ళి పడుకొని ఆలోచించసాగింది. ఆలోచనలు ఎటూ తెమలకముందే అమ్మమ్మ, ఉష వచ్చారు ఉషకోసం లేని ఉత్సాహం తెచ్చిపెట్టుకొని లేచింది.

మర్నాడు ఉదయం "ఈ రోజు నాకు ప్రొద్దున క్లాసులు లేవు. ఉషని టెస్ట్సుకి హాస్పిటల్‌కి నేను తీసుకువెళ్తాను" అన్నాడు రమేష్. ఇందిర 'సరే'నని మామూలు టైముకి హోటల్‌కి వెళ్ళిపోయింది.

తన సీటులోకి వెళ్ళి కూర్చోగానే, మైకేల్ కబురు చేశాడు ఒకమారు రమ్మని. అతని గదిలోకి వెళ్ళింది. "డాన్స్‌హాల్ రిసెప్షనిస్ట్ నళిని ఈ రోజు రాలేదుట. ఆ డ్యూటీకి మిమ్మల్ని పంపించమన్నారు మేనేజర్" అన్నాడు.

"నేనా ? అక్కడ ఏం చేయాలో నా కసలు తెలీదు !"

మైకేల్ నవ్వాడు. "అక్కడ మిస్టర్ రామన్ అనే ఆయన ఇన్—ఛార్జిగా ఉన్నాడు. అతను అన్నీ చెప్తాడు మీకు. అట్లా ప్రతిదానికి భయపడకూడదు. డాన్స్ హాలులో ఎలా ఉంటుందో, అక్కడ ఏం జరుగుతుందో తెలుసుకోవాలన్న ఉత్సాహంతో వెళ్ళాలి !"

ఇందిర డాన్స్ హాలువైపు నడిచింది. 'పల్లెలో జీవితం ఎలా ఉంటుందో—ఏమిటో—అదొక ఎడ్వెంచర్' అనుకొని వెళ్ళగలిగితే బాగుండును' అనిపించింది మనసులో.

హోటల్ బ్లూబెల్స్‌లో డాన్స్ హాల్ అనబడే హాలు చాలా పెద్దది. హాలంతా ఎర్రటి కార్పెట్ పరిచి ఉన్నది. సీలింగ్ నించి రకరకాల కుండీలు, ఏవేవో మొక్కలతో వ్రేలాడుతున్నాయి. ఒకవైపుగా పెద్ద ప్లాట్‌ఫారమ్ పైన పియానో, బాండ్ మొదలైన పాశ్చాత్య వాయిద్యాలు పెట్టబడి ఉన్నాయి రామన్ ఇందిరకు ఎదురువచ్చి "గుడ్‌మార్నింగ్ మిస్ ఇందిరా ! ఈ రోజుకి ఈ హాలు రిసెప్షన్—కమ్—డాన్స్‌కి బుక్ అవబడింది. మిస్ నళిని రాలేదు, అందువలన మిమ్మల్ని పంపించారు మేనేజర్. పెద్దగా పనేంలేదు అక్కడ ద్వారం వద్ద మీరు నిలబడి, అటుగా ఎవరయినా వస్తే, చిరునవ్వుతో గ్రీట్ చేయండి. ఎక్కువగా ఇవతలి వైపు ద్వారం నించి వస్తారు అందరూ, అక్కడ నేనుంటాను. ఎవరయినా ఏదయినా అడిగితే నా వద్దకు పంపించండి, లేదా నన్ను పిలవండి" అన్నాడు.

"డాన్స్ ప్రోగ్రాం ఎవరిది ? ఏమిటి ?" వివరాలు అడిగింది ఇందిర.

"ఒక పెద్ద వ్యాపారస్థుడి కొడుకు పెళ్ళి అయింది నాలుగు రోజుల క్రితం. మామూలి పద్ధతిలో బంధు, మిత్రులకు పెద్దలు విందులు చేశారు. ఇప్పుడు పెళ్ళికొడుకు, తన స్నేహితులకి ఇక్కడ పార్టీ ఇస్తున్నాడు. పార్టీకి, బాల్‌రూమ్ డాన్స్‌కి బాధ్యత మన హోటల్‌కి అప్పగించారు. ఇంకొక అరగంటలో గెస్ట్స్ రావటం మొదలవుతుందనుకుంటాను."

కాస్సేపటికి పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు వచ్చారు. అతను మంచి సూట్‌లో ఉన్నాడు. ఆ అమ్మాయి లేత నీలంరంగు సిల్కు మాక్సీలో స్టైలిష్‌గా, అందంగా ఉంది. ఇద్దరూ నవ్వుతూ, తుళ్ళుతూ, చాలా హుషారుగా ఉన్నారు. రామన్ వాళ్ళ కూడా తిరుగుతూ, ఏర్పాట్లు అన్నీ చూపించాడు. వాళ్ళను చూస్తుంటే ఇందిరకు ఎంతో ముచ్చటగా అనిపించింది. ఇద్దరూ ఎంత స్మార్ట్‌గా, ఎంత సంతోషంగా ఉన్నారు ! 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' అన్నట్లే ఉన్నారు. రెప్ప వాల్చకుండా వాళ్ళనే చూస్తూ ఉండిపోయింది కొంతసేపు. క్రమంగా వాళ్ళ స్నేహితులు రావటం మొదలు పెట్టారు. యువతీ యువకులు ఎందరో రకరకాల ఫాషన్స్‌లో అలంకరించుకొని వచ్చారు. అందరూ బాగా ధనవంతులలాగా ఉన్నారు. నవ్వులు చిందిస్తూ, కబుర్లు కలబోస్తూ, హుషారుగా, ఆనందంగా ఉంది వాతావరణం. డబ్బున్నచోట ఆనందం కూడా ఉంటుంది కాబోలు, అనుకుంది ఇందిర. డబ్బుంటేనే ఉషకు వైద్యం సాగుతుంది. డబ్బుంటేనే తమ్ముళ్ళ చదువులు సాగుతాయి. డబ్బు... డబ్బు . 'ధనమూలమిదం జగత్' అని ఊరికే అనలేదు ! వెనకెప్పుడో మధుతో తను జరిపిన సంభాషణ గుర్తు వచ్చింది.

మదరాసు టి. నగర్‌లోని స్వామి శంకరదాస్ ఆడిటోరియంలో ఇటీవల జరిగిన 'మదరాసు తెలుగు నాటక అకాడెమీ' ప్రారంభోత్సవ సందర్భంగా శ్రీయుతులు పి. వి. శ్రీపతిరావు, టి. వి. కె. శాస్త్రి, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాలమంత్రి కోన ప్రభాకరరావు (ముఖ్య అతిథి), శ్రీమతి జమున, జె. వి. సోమయాజులు, మిక్కిలినేని, పి. విజయకుమార్‌రెడ్డి, రావికొండలరావు, పి. వి. గోపాలకృష్ణగార్లని చిత్రంలో చూడవచ్చు.



## విద్యార్థిలోకం వ్యాస రచన పోటీలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

నేటి బాలలు రేపటి పౌరులన్న విషయం ఎంత నిజమో, నేటి విద్యార్థులు రేపటి నిరుద్యోగులనుటలో కూడ అంతే నిజమని నేటి విద్యా విధానమే ఋజువుచేస్తున్నది. విద్యార్థులకు సామాన్యంగా ఎన్నో ఆశయాలు ఉంటాయి. కాని అవి ఎంతవరకు నెరవేరుతున్నాయి అన్న విషయము వివాదాంశముగానే మిగిలిపోవుచున్నది. సమాజ పురోభివృద్ధికి, దేశ ప్రగతికి నేటి విద్యార్థులే వెన్నెముకలు. నేటి విద్యార్థులు వృత్తి విద్యలయందు విముఖత చూపుచూ కేవలం ఉద్యోగాన్వేషణ దృష్టితోనే విద్య నభ్యసించుటవలన నిరుద్యోగ సమస్య రోజు రోజుకీ పెరుగుచున్నది విద్యార్థులను వృత్తి విద్యా శిక్షణోన్ముఖులను చేసేందుకు తగు విధంగా నేటి విద్యా విధానము లేకపోవడమే యిందుకు ప్రధాన కారణం. గుమస్తా పదవుల వరకే సరిపడే పరిమిత జ్ఞానాన్ని కలిగించే విద్యా విధాన ఎరవడిని సమాజం విడవలేక పాత మోజుతోనే పయనిస్తూ వుంది భాషా బోధన దగ్గర నుండి పాఠ్యాంశాలవరకు అన్నీ వివాదాంశాలుగానే మారిపోయి నిర్దిష్ట రూపం లేక నానాటికీ అస్తవ్యస్థ స్థితికి విద్యారంగంలోనైంది. ఈనాటి విద్యా విధానం సామాజిక ప్రయోజనాలకు దూరంగా కేవలం ఉద్యోగ లక్ష్యంకే పరిమితమై పరీక్షలలో కృతార్థులగుటవరకే పరిమితమైంది నిజ జీవితాలకు విద్యకి పొంతన లేకుండా వున్నది. విషయ పరిజ్ఞాన తృష్ణగాని, సమగ్ర యోచనామిళిత పరిశీలనగాని నేటి విద్యా విధానంలో ముఖ్యమైనందునే సమస్యలు ఎదురైనప్పుడు పరిష్కారంకై తపించే విద్యార్థులు ఆశించిన ఫలితాన్ని పొందలేకున్నారు. విద్యార్థుల ఆశయాలకు అనుగుణంగా ప్రభుత్వం కూడ సహకరించి ప్రోత్సహిస్తే వారి ఆశయాలు నెరవేరటానికి కొంత అవకాశం కలుగుతుంది కనీసం వారి వారి తరగతుల పాఠ్య పుస్తకాలను పరీక్షల ముందు కాక తగిన సమయానికి అందజేస్తే వారికి అనుకూలంగా వుంటుంది. వారి ఆలోచనా శక్తికి తగినట్లు పాఠ్యపుస్తకాలు ఉండాలి. ప్రభుత్వ సహకారం లేనిదే వారి ఆశయాలు నెరవేరటం కష్టం. సామాన్యంగా తరగతిలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడయ్యే విద్యార్థి పబ్లిక్ పరీక్షలలో కష్టపడి చదివి వ్రాసినా ఒక్కొక్కప్పుడు కనీసం సామాన్యంగా నైనా ఉత్తీర్ణులుకారు అటువంటి సంఘటనలు చాలా జరుగుతూనే వుంటాయి. అది బాగుగా చదివే విద్యార్థులకు నిరాశ, నిస్పృహ కలిగిస్తుంది సాధారణంగా పెద్ద నగరాలలోనే తప్ప ఐ. టి. ఐ., ఇంజనీరింగు, మెడికల్ కళాశాలలు వుండవు. దానివలన ఎంతోమంది విద్యార్థులు పై ఊర్లు వెళ్లి చదవడం చాలా కష్టం. అది ప్రభుత్వం గమనించదగిన విషయం. తరచు హైదరాబాదు బోర్డులో అవకతవకలు జరుగుతూ విద్యార్థుల పరీక్ష పేపరులు పోవడం జరుగుతూ వుంటాయి. దీనివలన విద్యార్థులు నష్టపోయి ఒకే తరగతి ఏళ్లతరబడి చదవడం జరుగుతూ వుంటుంది. ప్రభుత్వం సరియైన చర్య తీసుకుని వుంటే ఎప్పటికైనా విద్యార్థుల ఆశయాలు నెరవేరటమేకాక, విద్యార్థిలోకానికి న్యాయం చేకూరుతుంది. ★

### రచయిత్రి పరిచయం



''జన్మస్థలం విజయనగరం మొదటి నుండి విజయనగరంలోనే చదివితిని ప్రస్తుతం విజయనగరంలో మహారాజా వుమెన్స్ కాలేజిలో ఇంటర్మీడియట్ ద్వితీయ సంవత్సరము చదువుచున్నాను.

తెలుగు రచనలు, వ్యాస రచనలు, కథలు చదువుట అలవాటు సంగీతం వినుట చాలా ఇష్టం. అప్పుడప్పుడు సినిమాలు చూస్తుంటాను. నా గ్రూపు వయొలిన్, నేను శ్రీ ద్వారం దుర్గాప్రసాదరావుగారివద్ద అప్పుడప్పుడు వయొలిన్ నేర్చుకొంటున్నాను భగవంతుడు దయదలిస్తే పై చదువులు చదవాలనుకొంటున్నాను''

— ఇవగంటి పద్మావతి

---

డబ్బుకి, ఆనందానికి సంబంధం లేదని తను వాదించింది 'మధూ, నేను అప్పుడు ఎంత అమాయకంగా మాట్లాడాను! ఈ డబ్బువలననే కదూ మనిద్దరం దూరం అయింది. లేకపోతే, అదిగో ఆ నవదంపతులలాగా మనమూ ఉండేవాళ్ళం కదా!'

పార్టీ మొదలయింది హాలంతా అతిథులతో నిండిపోయింది బేరర్స్ ట్రేలలో రకరకాల పానీయాలు, తినుబండారాలు తీసుకువచ్చి అందిస్తున్నారు ప్లాట్‌ఫారమ్ పైనుంచి వాద్య సంగీతం వినవస్తున్నది అంతా సందడిగా, సరదాగా ఉన్నారు ఇందిర పెళ్ళికొడుకు, పెళ్ళికూతురు వైపు చూసింది వాళ్ళు అతిథులను పలకరిస్తూ అటు, ఇటు తిరుగుతున్నారు అంతా ఎవరి సందడిలో వాళ్ళు ఉండటం చూసి పెళ్ళికొడుకు చిన్నగా వంగొని చెక్కిలిపైన ఓ చిన్నముద్దు ఇచ్చాడు. ఆ అమ్మాయి ముఖం ఎర్రబడి, వింత అందం సంతరించుకుంది.

### నీలాకాశం

ఇందిర మనసులో ఏవో జ్ఞాపకాలు ముసురుకున్నాయి. తను, మధు ఒకమారు ఫస్ట్ షో సినిమాకి వెళ్ళారు. సినిమా అయిపోయాక థియేటర్ బయట బస్ కాని, ఆటోకాని దొరుకుతుందేమోనని వెయిట్ చేస్తుంటే, సన్నగా వానజల్లు మొదలయింది

''మధూ, నాకు వర్షంలో తడవటమంటే ఎంతో ఇష్టం! ఆటో దొరికేవరకూ నడుద్దామా ?'' అంది సంతోషంగా

''బట్టలు పాడవుతాయి—జలుబు చేస్తుంది—'' ఏవేవో అభ్యంతరాలు లేవదీశాడు మధు

''ఏం కాదు, పద!'' అతని చేయి పట్టుకొని బయల్దేరతీసింది ఇందిర

నాలుగు అడుగులు వేసేసరికి ఒక టాక్సీ ఎదురు వచ్చింది ఇందిర మాట వినిపించుకోకుండా టాక్సీ ఆపి, తనను లోపలకునెట్టి, తర్వాత ఎక్కాడు మధు. ఇందిర మూతి ముడుచుకొని కిటికీలోనించి బయటకు చూస్తూ కూర్చుంది. ఓ నిమిషం మౌనంగా గడిచాక, అతని పెదవులు చల్లగా ఆమె చెంపని తాకాయి ఉలిక్కిపడింది. ఆ స్పర్శ ఆ ముద్దు. తన ఉలికిపాటు, కంగారు ఆ చలిలో కూడా ఒళ్ళంతా వేడి ఆవిర్లు చిమ్మినట్లు అవటం ఇందిరకు అంతా గుర్తు వచ్చింది, ఈ రోజు ఆ కొత్త దంపతులను చూస్తుంటే.

ప్లాట్‌ఫారమ్ పై నుంచి వాద్య సంగీతం ఇప్పుడు హెచ్చు స్థాయిలో వినవస్తున్నది కొందరు జంటలుగా డాన్స్ ఫ్లోర్ మీదకు వచ్చి లయగా అడుగులు వేస్తున్నారు కొందరు టేబుల్స్ వద్దనే కూర్చొని డ్రింక్స్ సిప్ చేస్తున్నారు., పెళ్ళికొడుకు కూర్చొని ఉన్న స్నేహితులను డాన్స్ ఫ్లోర్ పైకి రమ్మని పిలుస్తున్నాడు. ఒకరొకరే వచ్చి డాన్స్‌లో కలుస్తున్నారు భార్య నడుము చుట్టూ చేయివేసి, సంగీతానికి అనుగుణంగా స్టెప్స్ వేస్తున్నాడు పెళ్ళికొడుకు.

(ఇంకా వుంది)

# వరద



## వఝ్ఝల కాళిదాసు

పరమ శ్రోత్రియుడైన వెంకటశాస్త్రికీ అంటరాని కులంలో పుట్టిన బారిక వెంకడికీ ఎలా స్నేహం కలిసిందో, పాలతేరు గ్రామంలోని వాళ్ళెవరికీ అర్థం కాలేదు కాని శాస్త్రి శ్రీమతి లక్ష్మీదేవమ్మకి తెలుసు వెంకడికీ శాస్త్రికీ ఉన్నది స్నేహం కాదనీ కేవలం శైష్యోపాధ్యాయిక అనీ. అదేవిటీ అని తరిచిచూస్తే తేలే విషయం మరేమంత విడ్డూరమూ కాదు, ఆశ్చర్యకరమైనదీ కాదు. ఏ పూర్వజన్మ వాసనవల్లనో వెంకడికి చిన్నప్పటినుంచీ చదువన్నా చదువుకున్నవాళ్ళన్నాసరే గౌరవమూ, భక్తీ కూడా. వాటికితోడు ఆసక్తీ శ్రద్ధా వాడిలో మూర్తీభవిం చేయి శ్రోత్రియుడైన శాస్త్రికి ఛాందసం లేదు కాబట్టే వెంకడిని కూడా తన శిష్యకోటిలో చేర్చుకున్నారు

అయితే కావ్యాలు, వ్యాకరణం, వేదాలు పగటి వేళ బ్రాహ్మణ శిష్యులకి చెప్పేవారు, రాత్రిళ్ళ తక్కిన శిష్యులకి 'చదువు' చెప్పేవారు. వీరిలో కుమ్మరి బసవయ్య బారిక వెంకన్నశాస్త్రిగారి అభిమానం చూరగొన్నారు. బసవయ్య చిన్న చిన్న పద్యాలు అల్లడం కూడా మొదలుపెట్టేడు. వెంకన్న వేదాంతపు పాటలు గొలికేవాడు. వెంకన్న వేదాంత ధోరణికి చుట్టుపక్కల ఉన్న ఊళ్ళైన అలజంగి, ఆనవరం, పెంట, భీమవరం, ముగడల్లోని రైతులందరూ ఆశ్చర్యపడేవారు; ఆ పాటలు వింటూ ఉర్రూతలూగేవారు.

పాపం, వెంకన్నకి నలభైయేళ్ళేనా దాటక ముందే అతని భార్య మరణించింది — పురిటిలో. పదిహేనేళ్ళాయ కాపరం చేస్తున్నా సంతానంలేదని వెంకన్న దంపతులు వేయి మొక్కులు మొక్కుకున్నారు కొడుకు పుట్టేడన్న సంతోషం పట్టలేక కాబోలు వెంకన్న పెళ్ళాం శాశ్వతంగా కన్నుమూసింది భార్య గతించిన విచారంలో వెంకన్నకి వేదాంతం శాంతి కల్పించింది

శ్రీరామ భక్తి కల వెంకన్న, కొడుకు పేరు రాముడని పెట్టుకుని సంతోషించేడు

ఎందరు చెప్పినా మరో పెళ్ళి చేసుకోలేదు వెంకన్న ముసలితల్లినీ పసిపిల్లడు రాముడినీ కంటికి రెప్పలా కాపాడుకుంటూ వస్తున్నాడు.

రాముడికి ఆరేళ్ళు నిండకముందే చదవడం అబ్బిందంటే వెంకన్న శ్రద్ధా, పట్టుదలా రాముడికి కూడా ఉన్నందువల్లనే.

రాముడికి చదువుతోపాటు పాటలు పాడటం కూడా అలవడింది

రాముడు సన్నగా చల్లగా పాడుతూ ఉంటే వెంకన్న పరవశించిపోయేవాడు. వెంకటశాస్త్రిగారు మెచ్చుకొనేవారు.

* * *

శ్రీరామ నవమి

పాలతేరులో ఉన్న మూడు రామ మందిరాల లోనూ — వాటిని రామ భజనలనే అనేవారు — భజనలు అతి భక్తితో పల్లె ప్రజలందరూ చేస్తున్నారు, చూస్తున్నారు. అందరితోటే కలిసి భజనల్లో పాల్గొనలేకపోయినా దూరంగా, వారగా ఓరగా వెంకన్న ఆ రాత్రంతా కొడుకుని ఒడిలో పెట్టుకుని భజన చేసేడు తెలతెల్లవారుతున్నాదనగా తండ్రీ, కొడుకులు అలానే నిద్రలోకి జారుకున్నారు

భజనలు చూడవచ్చిన మాలపల్లి వాసులందరూ, ఉదయాన్నే స్నాన ధ్యానాలకి ప్రక్కనే పారుతున్న వేగవతీ నదికి వెళ్ళే అగ్రజాతివారి తిట్లకి దీవనలకీ భయపడి మాలపల్లికి దారితీసేరు. వెంకన్ననీ, రాముడినీ వాళ్ళు లేపలేదు ఏమంటే వెంకన్న మాలపల్లిలో ఉండటంలేదు, వెలమదొరగారు గోపాలరాయణింగారి తోట కాపల కాబట్టి తోటలోనే ఓ చిన్నపాక వేసుకొని ఉంటున్నాడు, తనూ, తల్లీ, కొడుకూ.

అప్పుడే చీకట్లు విడుతున్నాయి

వెలుగు రేఖలు, ఎర్రగా తూరుపు దిక్కున లేచి తెల్లబడుతున్నాయి

వెంకటశాస్త్రి నిండైన విగ్రహం నదికి వెళుతూ ఉంటే, దారినిపోతున్న ఒకళ్ళిద్దరూ దండాలు పెడుతున్నారు శాస్త్రి చిరునవ్వుతూ, చేయెత్తి ఆశీర్వదిస్తూ కుశల ప్రశ్నలువేస్తూ నడక మానలేదు.

శాస్త్రి కళ్ళు ఆదమరిచి నిద్రపోతున్న రాముడునీ, వెంకన్ననీ చూచి నవ్వుకున్నాయి

ఆ కళ్ళల్లోని నవ్వులో ఒక విధమైన చిన్న చిలిపితనం తొంగిచూసింది.

శాస్త్రి చెయ్యి అప్రయత్నంగా రెండవ చేతిలో ఉన్న నీళ్ళ చెంబులోకి వెళ్ళి నీళ్ళుతీసి ఆ నిద్రిస్తున్న తండ్రీ కొడుకులమీద జల్లింది.

"లేండర్రా, తెల్లారినా ఆ మొద్దునిద్దరేవిటి లెండి . మీ యింటికి పొండి" అని శాస్త్రి నోరు గద్దించింది

అదే క్షణంలో ఓ పెద్ద గోల, అలజడి, "తప్పుకోండి. .తప్పుకోండి" అనే కేకలు వినిపించేయి

ఒక ఆవుని పెద్ద ఆంబోతొకటి తరుముకొని వస్తున్నది. దారి తెన్ను తెలియని ఆ గోలక్ష్మి విప్పాల నేత్రాల్లో నీళ్ళుతిరుగుతూ ఉంటే ఇటూ అటూ పరుగులుపెడుతూ ఉంది

# వరద

అప్పుడే కళ్ళు విప్పి చూచిన రాముడు భయంతో కంపించిపోయేడు; అంబోతు తనమీదికే వచ్చి పడిపోతున్నదనుకున్నాడు; సర్రుమని బాణంలా పరుగు దీసి వచ్చి శాస్త్రి కాళ్ళని చుట్టేసేడు.

వెంకన్న ఉన్నచోటే క్రూమానడి "రాముడూ" అని వెర్రివాడిలా కేకవేసేడు.

అనుకోని, అంతుతెలియని, క్షణికమైన ఆగ్రహావేశంలో "ఛీ, ఛండాలుడా! ఎంత దారుణంరా ఇది. ఫో" అంటూ వెంకటశాస్త్రి గర్జించడమూ, రాముణ్ణి చాచి లెంపకాయకొట్టి అవతలకినెట్టి వేయడమూ, చేతనున్న చెంబెడు నీళ్ళూ ఆ విస్తుపోయి చూస్తున్న పసివాడి నెత్తిని దిమ్మరించడమూ కనురెప్పపాటు కాలంలో జరిగిపోయేయి.

రాముడు బిక్కచచ్చిపోయేడు.

ఏ ప్రళయం తనమీద విరుచుకొని పడుతుందో అని వెంకడు స్థాణువులా చేతులు జోడించుకొని నిలబడ్డాడు.

నరసింహావతారంలాగ వెంకటశాస్త్రి కనబడితే, ప్రహ్లాదుడులాగ కనిపించేడు రాముడు.

మూడు క్షణాలు విశృంఖలంగా నడిచేయి.

ఆ క్షణాలు యుగాల్లాగ గడిపేడు వెంకడు.

ఆవూ, ఆంబోతూ మరో వీధిలోకి పరుగు తీసేయి.

వెంకటశాస్త్రిగొంతు గంభీరంగా వినిపించింది— "వెంకా, అలాగ నిలబడిపోయేవేం? ... పాపం రాముడు తడిసి ముద్దయిపోయేడు తుడిచి ఇంటికి తీసుకుపో ... ఊఁ ... త్వరగా వెళ్ళు."

వెంకటశాస్త్రి హుందాగా, నెమ్మదిగా నది దిక్కుగా నడిచివెళుతూ వుంటే ఆ నాలుగు వీధుల కూడలిలో పోగైన ఆడా మగా అందరూ కళ్ళప్పగించి చూస్తూ నిలబడిపోయేరు.

చైత్ర మాసపు సూర్యోదయ కిరణాలు చురుక్కుమని సోకుతున్నాయి.

ఒకొక్కరే ఎవరి దారి వాళ్ళు పోతున్నారు, వెనుదిరిగి వెంకడినీ రాముడునీ చూస్తూ.

అప్పుడే ఏటిలో స్నానంచేసి నీళ్ళు బిందెలో నింపుకొని, తాను నడుస్తున్న దారివెంబడి నీళ్ళు జల్లుకుంటూ వస్తున్న ఒక విశ్వస్తని చూడగానే, వెంకడు చప్పున రాముణ్ణి ఎత్తుకొని ఇంటి దారి పట్టేడు.

*　　　*　　　*

రోజూలాగే రాముడు ఆనాటి రాత్రి తండ్రి వెంట శాస్త్రి ఇంటి ఎదట కూర్చొని తండ్రి నేర్చుకొనేది వింటూ కూర్చున్నాడేకాని వాడి కళ్ళల్లో ఉత్సాహానికి బదులు భయం చోటు చేసుకున్నది.

ఉదయం తిన్న చెంపపెట్టు జ్ఞాపకం వచ్చి రాముడు మరీ బెంబేలు పడిపోయేడు. చెంప తడుము కున్నాడు. తలకూడా తడుముకుంటూ వుంటే శాస్త్రి చూడటం తటస్థించింది.

"ఏరా రాముడూ, మీ అయ్య నీ తల సరిగ్గా తుడవలేదా ఏమిట్రా ప్రొద్దుట, బుర్ర తడుము కొంటున్నావు" అని శాస్త్రి ప్రశ్నించగానే రాముడు చప్పున తండ్రి ఒళ్ళో తలదాచుకున్నాడు.

వెంకడు కొడుకు తల నిమురుతూ "లే, బాబుగారికి దణ్ణంపెట్టు తప్పు ఛమించమని ... శాస్త్రుల్లుబాబూ, పసివాడు ... తల్లిలేని బిడ్డడు.. బెంబేలుపడి తేవర్ని ముట్టేసుకున్నాడు ... కోపం పెట్టుకోమోకు బాబయ్యా ... "

వెంకడి మాటల్ని మధ్యలోనే ఆపింది శాస్త్రి కంఠస్వరం.

"మరేం బాధపడకు ... పాపం ఎంత భయ పడకపోతే రాముడు నా కాళ్ళకి చుట్టుకునిపోతాడు. ఆ క్షణంలో మతిపోయినట్టు నేను వాణ్ణి ఛెళ్ళని చెంపమీదకొట్టి వాడి నెత్తిని నీళ్ళు దిమ్మరించేను పాపం ఎంత బాధపడ్డాడో ... తద్దోష పరిహారార్థం వేయిమార్లు గాయత్రీ జపం చేసుకున్నాను."

శాస్త్రి గొంతు జీరవోయింది. రాత్రి కాబట్టి ఆయన కళ్ళల్లో మెదిలిన తడి ఎవరూ చూడలేదు.

వెంకడు చేతులెత్తి దండం పెట్టేడు; కొడుకు చేతలు రెండు పట్టుకొని దండం పెట్టించేడు.

ఇదంతా గమనిస్తున్న కుమ్మరి బసవయ్య కూడా అప్రయత్నంగా కైమోడ్చేడు.

ఇంతలో లక్ష్మీదేవమ్మ భర్త పక్కకి వచ్చి "ఇటు చూడండి, ఈ ప్రసాదపు పొట్లాలు బసవయ్యకీ, వెంకడికీ, రాముడికీ ఇయ్యండి . చాలా రాత్రయింది... ఓ పక్కనించి ఆకాశంలో మేఘాలు దట్టంగా క్రమ్ముకొస్తున్నాయి. వాళ్ళని పంపించి మీరు వేగం లోనికి రండి... ఈ పెద్ద పొట్లాం రాముడికి సుమండీ" అని ఒక్క గుక్కలో చెప్పేసి ఇంట్లోకి దారితీసింది.

"రాముడూ... రా... ఇంద... నీకోసం ప్రత్యేకంగా పెద్ద పొట్లాంవుడు ప్రసాదం మీ బుగతమ్మ ఇచ్చింది"అంటూ శాస్త్రి రాముణ్ణిపిల్చేరు.

రాముడు తండ్రి వెనక్కిపోయి దాంగున్నాడు. జంకుతూ, వెనక్కి తగ్గుతున్న రాముణ్ణి నెమ్మదిగా లాక్కొచ్చేడు వెంకడు. శాస్త్రి కూర్చొని ఉన్న అరుగుకి రెండు గజాల దూరంలో వాళ్ళు ఆగిపోయేరు.

అరుగుదగ్గరే నేలని కూర్చొని ఉన్న బసవయ్య కూడా లేచి నిలబడ్డాడు.

శాస్త్రి అరుగుదిగి వాళ్ల దోసిళ్లలో ఎత్తి ప్రసాదపు పొట్లాలు పడేస్తూవుంటే, చిన్న చినుకులు పడటం ప్రారంభం అయింది.

*　　　*　　　*

ముసురు.

మూడవరోజుకల్లా ముసురు ముదిరింది.

చిటపట పడుతున్న చినుకులు క్రమంగా బలం పుంజుకున్నాయి.

మూడవనాటి సాయంత్రానికి ధారాపాతంగా మారింది వర్షం. కుంభవృష్టికి తోడుపడ్డాయి ఝంఝూంమారుతాలు.

చెట్లు కూలిపోతున్నాయి.

పూరిళ్లపై ఉన్న తాటాకులు, రెల్లుగడి ఎగిరి పోతున్నాయి, పక్షుల్లాగ.

చెట్లపై గూళ్లల్లో ఉంటున్న పిట్టలు ఆ పెనుగాలికి అల్లల్లాడిపోతున్నాయ్; రెక్కలు విరిగి నేల కూలుతున్నాయి; నీట మునుగుతున్నాయి; ప్రాణాలు కాపాడుకోటానికి గిజగిజ కొట్టు కుంటున్నాయి.

పాలతేరు గ్రామం అంతా జలమయం అయి పోయింది. ఊరు నీటిమీద తేలుతున్నదా అనిపి స్తున్నది.

కటిక చీకటి.

కన్ను పొడుచుకున్నా కనపడని చీకటి.

నల్లటి నీటి కుండల్లాగ, ఆకాశం నిండా అలముకొనిపోయి ఉన్న కారునలుపు మేఘాలు, భారంగ కదులుతున్నట్లు కనిపిస్తున్నాయి, మెరుపు మెరిసినపుడు.

ఫెళఫెళమని ఉరుములు.

బ్రహ్మాండం బ్రద్దలైనట్లు పిడుగులు

ఆర్తనాదాలు— మానవులూ, జంతువులూ, పక్షులూ, కీటకాలు ప్రాణ భయంతో చేస్తున్న ఆర్తనాదాలు.

అర్థరాత్రికి గాలి వేగం తగ్గింది

వర్షవేగం తీవ్రం అయింది.

అంతలో ఏదో ఒక కొత్త హోరు వినబడింది

అందరి గుండెల్లోనూ హోరు లేచింది.

ఏమంటే ఏరు పొంగుతూన్నప్పుడు పుట్టే హోరది. వేగవతీనది అసలే దొంగ ఏరని పేరు పడింది. ఉన్న పళంగా ఉవ్వెత్తున పొంగి పొర్లటం వేగవతికి ఆ బిరుదు తెచ్చింది.

హరికెన్ లాంతర్లు పట్టుకొని, అవి ఆరిపో కుండా జాగ్రత్తపడుతూ, ఊరిలోని పెద్దమనుషులు, ధైర్యశాలులూ, పల్లపుప్రదేశాల్లో ఉన్నవాళ్ళని, కనీసం ప్రాణాలు కాపాడుకోటానికేనా, ఎత్తు ప్రదేశాలకి తరలిపోవాలని, ఆలస్యం చేయటం మంచిది కాదనీ హెచ్చరించటం ప్రారంభించేరు.

మునసబు నరసన్నాయుడు, మోతుబర్లు అప్పలనాయుడు, లక్షుంన్నాయుడు, బుగత లు పెద్దబ్బి, వెంకటశాస్త్రి, రామలింగస్వామి, కోమటి పెద్దవెంకట్రాయలు, వెలమ ప్రభువులు నరసింహ రాయణింగారు, గోపాలరాయణింగారు, వెంకట్రావు గారు, ప్రజలకి ఆ చీకటిలో సహాయం అందించ నడుం కట్టేరు.

దివిటీలు వెలిగించి పెంకుటేళ్ల వరండాల్లో నిలబెట్టేరు.

వీధులలో నీరు మోకాలుబంటి అయింది.

ఏటి హోరు క్రమక్రమంగా హెచ్చుకాజొచ్చింది. ప్రవాహ వేగం కూడా ఉద్ధృతం అయింది.

సెలవలకని వచ్చిన యువకులు, ముఖ్యంగా తరలింపు కార్యక్రమంలో అందరికీ సహాయం కాజొచ్చేరు. వాళ్లని చూచి యువకులందరూ ముందుకురికేరు.

వీధులలో నీరు మొలబంటి అయింది.

రాత్రి నాలుగు గంటలయింది.

ఇళ్ల వెన్నుకుప్పలమీద చేరిన కోళ్ళు 'కొక్కొరోకో' అని కూసేయి.

ఆ కూతల్లోకూడా విషాదపు జీర వినిపించింది.

అందరి మనస్సుల్లోనూ ఒకటే ఆశ. మరో గంట పోతే తెల్లవారుతుంది. ఎందరి బ్రతుకులు తెల్లారిపోతాయో! చీకటి పోతుంది. వెలుగు కావాలి... వెలుగు రావాలి. ఎలాంటి విపత్తునేనా వెలుగులో ఎదుర్కోవచ్చును. "సూర్యభగవానుడా వేగం ఉదయించు, మా బ్రతుకుల్లో వెలుగు నింపు" అని అందరూ మనసుల్లోనే ప్రార్థించుకున్నారు!

పెద్ద మెరుపు మెరిసింది.

ఆ బ్రహ్మాండమైన కాంతికి తట్టుకోలేక అందరి కళ్ళూ మూతలు పడిపోయేయి.

చెవులు చిల్లులు పడేటట్లు, గుండెలు గుభిల్లు మనేటట్లు ఒక పెద్ద పిడుగు పడింది.

భూమి దద్దరిల్లినట్లయింది.

కొంచెం దూరంలోనే ఉన్న కొబ్బరిచెట్టుమీద ఆ పడుగు పడిందో ఏమో? కొబ్బరి కొమ్మలు మండటం చూస్తూ ప్రజలాగిపోయేరు. కొన్ని క్షణాలపాటు ఆ కొబ్బరిచెట్టు తల విరబోసుకున్న కొరివి దెయ్యంలాగా కనిపించింది.

ఆ దృశ్యం అందరి మస్తిష్కాల్లోను మంటలు రేపింది.

అంధకారం తగ్గటం ప్రారంభించింది.

అందరిలోనూ ఆశా కిరణాలు ప్రభవించేయి.

వరద వడి మాత్రం ఎక్కువవుతూనే ఉంది.

భయాందోళనలు ప్రజల్లో ప్రబలం కాజొచ్చినవి!

తెల్లవారింది.

తమ బ్రతుకులెలా తెల్లవారేయో అని ఎందరో బెంగ పెట్టుకుంటూనే ధైర్యం తెచ్చుకుంటూ పిల్లలని పెళ్ళాలకి అప్పగించి తమ తమ నివాస గృహాల పరిస్థితి చూడాలనే ఆతృతతో ఆ మెల బంటి నీటిలో బయలుదేరేరు ...

రకరకాల పురమాయింపులు, ఆందోళనలు, అభ్యర్థనలు, శాపనార్థాలు, వేదాంత ధోరణులు, ఏడుపులు, మొరలు ... ఎవరిగోల వారిదే.

ఆపత్కాలంలో స్వార్థం విజృంభిస్తుంది.

మాలపల్లి ఊరుకి దూరంగా ఉంది. ఏటికి దగ్గరగా ఉన్నా చాలా ఎత్తైన ప్రదేశంలో ఉండబట్టి వరదబాధ వాళ్ళకి లేకపోయింది. కాని పూరికొంపలే అన్నీని. పెనుగాలిలో పూర్తిగా పైకప్పు లెగిరిపోయేయి. మిద్దె యిళ్ళు కూడా కూలిపోయేయి.

వెంకన్న రాముణ్ణి భుజంమీద కూర్చోబెట్టుకుని, దూరాన వారగా నిలబడి ఉన్నాడు. మాలపల్లిలో వాడి చెల్లి పిల్లలు ఎలా ఉన్నారో చూడాలని అలమటించిపోతున్నాడు.

వెంకటశాస్త్రి, నరసన్నాయుడు, పెద్దబ్బి గారు, రాయణంగార్లు, అందరి యోగక్షేమాలు కనుక్కుంటూ, ఊరందరూ సురక్షిత ప్రాంతాలకి చేరుకున్నారో లేదో అని కనుక్కుంటున్నారు.

వర్షం ధారాపాతంగా పడుతూనే ఉంది.

ఆకాశం నిండా కారు మేఘాలే!

వేగవతీ నది హోరుమంటూ ఊరుమీదే విరుచుకుపడి పారుతున్నది. ఉవ్వెత్తుగా కెరటాలు లేస్తూన్నాయి. ఆ ప్రవాహ వేగంలో ఎంత శక్తి నిబిడీకృతమై ఉన్నదో కాని, మహా వృక్షాలు కూడా సమూలంగా కూలిపోయి కొట్టుకుపోతున్నాయి.

అలా కొట్టుకుపోతున్న ఒక చెట్టు కొమ్మమీద ఓ వృద్ధుడు కూర్చొని ఉన్నాడు. అతని ప్రక్కనే అడుగు దూరంలో ఒక పెద్ద త్రాచుపాము కొమ్మకి చుట్టుకొని ఉన్నది.

మరొక ప్రక్క, ప్రవాహపు సుడి గుండంలో గిరగిర తిరుగుతూ కొట్టుకుపోతున్న ఒక పూరింటి చెన్నుకప్పమీద చంటిబిడ్డని గుండెలకి హత్తుకొని కూర్చొని ఉన్నదొక లేబ్రాయపు టిల్లాలు.

అటువంటి దృశ్యాలు చూస్తున్న పాలతేరు ప్రజ, తమ పరిస్థితే కొంత నయం అనుకున్నారు. ఇళ్ళు వాకళ్ళ ఏమవుతున్నా తాము మాత్రం సురక్షితంగానే ఇప్పటిదాకా ఉన్నారు. కాని ఆ ప్రదేశం కూడా వరదనీటితో పరివేష్టితం అయిపోతున్నది. నీటిమట్టం క్షణ క్షణం పెరుగుతున్నది.

పాదాలు తడుస్తున్న నీళ్లల్లో నిలబడి ఉన్నారు రాముణ్ణి బుజాన వేసుకొని వెంకన్న, మరో నలుగు రైదుగురు హరిజనులు, తక్కిన ప్రజకి పది గజాల దూరంలో. వారి యోగక్షేమాలు కనుక్కొనటానికి వస్తున్న వెంకటశాస్త్రిని చూడగానే వెంకన్న రాముణ్ణి క్రిందికి దించి నిలబెట్టి రెండు చేతులూ జోడించి నిలబడ్డాడు.

శాస్త్రి కళ్ళు ఆర్ద్రం అయేయి.

"అలా నీళ్లల్లో తడుస్తూ నిలబడ్డారేవిటి. పదండి ఆ పంచన చేరండి... మేమేం మైలపడి పోము. గంగకీ, మృత్యువుకీ బ్రాహ్మణ హరిజన విచక్షణకాని కులమత ప్రసక్తికాని లేవు... పదండి!"

కరుణామయము, మానవతా తత్వపూర్ణమూ అయిన శాస్త్రి మాటలలో ఆ పేదమానవులు తమ బ్రతుకుల్లోఎన్నడూఎరగనిఆప్యాయతనిరుచిచూసేరు.

ఆ క్షణంలో ఆ పరిసరాల నిండా అపూర్వము అవేద్యమూ ఐన ఒక పవిత్ర వాతావరణం పొడమింది.

కాని భగవంతుడికి మాత్రం ఇదేమీ తెలియ దేమో అనిపిస్తుంది. భీషణ ప్రకృతి వికటాట్టహాసం చేసినట్లయింది.

భయంకరమైన హోరుతో, వాళ్ల వెనక ప్రక్కనుంచి వరద వచ్చిపడింది.

అది కనురెప్పపాటు కాలం.

రాముడు వరదలో కొట్టుకుపోతున్నాడు తక్కినవాళ్ళు ఆ అఘాతం నుంచి తేరుకొనిలోపునే రాముడు పదిగజాల దూరం కొట్టుకుపోయేడు

అందరూ నిర్ఘాంతపోయేరు.

హాహాకారాలు మిన్నుముట్టేయి

"రాముడూ" అని అరుస్తూ ముందుకి ఉరకుతున్న వెంకడిని, నలుగురు పట్టుకొని ఆపేసేరు

"నా కొడుకో" అన్న వెంకన్న ఆక్రందనంలో పరమ పాషాణాలని కూడా కరిగింపజాలిన ఆవేదన నిండపోయి ఉన్నది. అందరి గుండెలూ తరుక్కుపోతున్నవి.

క్షణం కూడా ఆలస్యం చేయకుండా శాస్త్రి గామంచా బిగించి, పైమీద తుండుగుడ్డ విసిరేసి, నీటిలోకి ఉరికి, బారలు వేసుకుంటూ, మునుగుతూ తేలుతూ కొట్టుకుపోతున్న రాముడి దగ్గరికి వెళుతూ ఉంటే అందరూ నివ్వెర పోయేరు.

ఉరకలు వేసుకుంటూ పరుగెడుతున్న వేగవతీ నది వరద వేగానికీ, బారలు వేసుకుంటూ ఆ వరదలోనే తీవ్ర వేగాన్ని పుంజుకుంటున్న శాస్త్రి ఈత జవానికీ, పందెం జరుగుతున్నట్లు అందరూ ఊపిరి బిగబట్టి చూస్తున్నారు.

లక్ష్మీదేవమ్మ పుస్తెలు రెండు కళ్లకీఅద్దుకొని, కళ్ళుమూసుకొని చేతులెత్తి దండం పెట్టింది.

మూతపడి ఉన్న ఆమె కళ్ల రెప్పల క్రింద నుండి అశ్రుకణాలు రాలసాగేయి.

వెంకన్న వాళ్లల్లా కళ్ళు చేసుకొని చూస్తున్నాడు, ఏడుస్తున్నాడు.

అందరి గుండెలూ ఒక్కమాటు ఆగిపోయేయి

శాస్త్రి మునిగిపోయేడు, తేలేడు, మునిగేడు!

హాహాకారాలు, గోల.

సుదీర్ఘమైన అరవై సెకన్లు గడిచేయి

అల్లంత దూరాన రావుణ్ణి ఒక చేత్తో పట్టుకుని రెండవ చేత్తో నీటిని వెనక్కితోస్తూ ఒడ్డుకి చేరుతున్న శాస్త్రిని చూచి పరుగెత్తేడు వెంకన్న... వాడి వెంటనే లక్ష్మీదేవమ్మ... ఆ వెంట అందరూను!

వాళ్లందరి గమనవేగానికి ఈడు కాలేకపోయింది వేగవతీ నది వరద!








# నరకాసురుడుతో నాలుగు ముఖాలు

## 'దటీజ్ సుబ్బారావ్' పాత్రతో కాగితాలమీద నుంచి తెరమీదికి వచ్చిన గొల్లపూడి మారుతీరావు నాలుగు పాత్రలతో నరకాసురుడికి కనిపిస్తే....?



నరకాసురుడికి నరకంలో నాలుగు రోజులు కాజువల్ లీవ్ దొరికింది! "స్వామీ! నా చావుని దేశం పండుగ చేసుకుంటోంది. ఒక్కసారి కళ్ళారా చూసి వస్తాను," అన్నాడు.

ఏళ్ళతరబడి దుర్మార్గులతో కొలువు తీర్చి అలసిపోయి ఉన్న యముడుగారు "అర్జంట్‌గా పోయి రా!" అన్నాడు.

నరకాసురుడు జంబూ ద్వీపానికి, భరత వర్షానికి, భరత ఖండానికి—అందునా ఆసియాలో హాలివుడ్ లాంటి మద్రాసుకు వచ్చి, వడపళని వైపు వెళ్లాడు. ఒకానొక స్టూడియోలో 'దటీజ్ సుబ్బారావ్' ఎదురయ్యాడు. "ఎవరు, సార్ తమరు? పౌరాణిక వేషమా? గెటప్ బాగుంది," అన్నాడు సుబ్బారావు.

"నేను నరకాసురుడ్ని... ఒరిజినల్!" నరకాసురుడు గర్జించాడు.

"ఆహా... మరలా చెప్పరేం? ఒరిజినల్ నరకాసురుడికి చిన్న సలహా... దుర్మార్గులు దుర్మార్గుల్లాగే కనిపిస్తే, దుర్మార్గానికి విలువ పోతుంది. అధర్వణ వేదంలో ఆరో ఆధ్యాయంలో పదహారో శ్లోకంలో రాశాను. తమరు చూసి ఉండరు. నన్ను చూసయినా వేషం మార్చండి," అన్నాడు సుబ్బారావు.

నరకాసురుడికి ఆ శాస్త్రం, కమామిషూ కొరకరాని కొయ్యగా కనిపించి గుడ్లు తేలేశాడు.

"సార్! మిమ్మల్ని చూస్తే జాలేస్తోంది, సార్! ఎర్రగుడ్లు, బుర్రమీసాలూ, భుజకీర్తులు, పట్టు పీతాంబరాలు — దుర్మార్గులు కట్టుకోవాలన్న ఫాషన్ అయిపోయింది, సార్! ఈ రోజుల్లో దుర్మార్గులు సింపుల్‌గా, సాదాగా ఉంటూ — గోతులు తవ్వేయాలి. వేషం మారకుండా ఇంట్లో రామయ్యలాగ, వీధిలో కృష్ణయ్యలు కావాలి... మీరేమో ఎందరో అమ్మాయిల్ని ఎత్తుకొచ్చి బలవంతంగా అనుభవించారని పురాణం చెప్తోంది. అఫ్‌కోర్స్ — నేను అధర్వణ శాస్త్రం తప్ప అట్టే చదవలేదనుకోండి. నేను చూడండి -- అందరమ్మాయిల్నీ నమ్మిస్తాను; నేను మహానుభావుడ్ననిపించుకుంటాను... దటీజ్ సుబ్బారావ్! మనకి దుర్మార్గుడనే పబ్లిసిటీ మంచిదికాదు, సార్. అప్పుడప్పుడు చెప్పుదెబ్బలు తగిలితే, సింపుల్‌గా కాళ్ళట్టుకొని — ఆ ఖాతా క్లోజ్ చేసేస్తాను. ఏమిటో అనవసరంగా నలుగురి నోళ్ళలో పడిపోయారు. అదే నా బాధ," అన్నాడు సుబ్బారావు జాలి చూపుతూ.

నరకాసురుడు నమస్కారం చేసి దాటుకున్నాడు.

* * *

మరో స్టూడియోలో పుణ్యమూర్తి తగిలాడు నరకాసురుడికి. "ఏంటి, గురూ! పక్క సెట్లో షూటింగా? టీకొట్టు షాట్ వచ్చేదాకా వేరుశనక్కాయలు తిందాం," అన్నాడు పుణ్యమూర్తి. ఆ తర్వాత నరకాసురుడి అసలవతారం అని తెలియగానే పుణ్యమూర్తి ఆశ్చర్యపడ్డాడు. "గురూ! నీకు బతకడం తెలీదు. ఆడదాని చేతుల్లో అన్యాయంగా చచ్చిపోయావు. నేను చూడు — నా ఆడదాన్ని తెచ్చుకోడానికి ఎదుటి మొగాడి బతుక్కి అగ్గెట్టేశాను. నలుగురిలోనూ వాడికి మనశ్శాంతి లేకుండా చేశాను. గట్టిగా కొడతానంటే కాళ్ళు పట్టేసుకున్నాను. నువ్వు కత్తుల్ని నమ్ముకున్నావు; అన్యాయమైపోయావు. నేను కాళ్ళను నమ్ముకున్నాను. లక్షణంగా బతికేస్తున్నాను. ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు పెద్దలు. నువ్వా నీతి మరిచిపోయి, వీధినపడి చచ్చిపోయావు. నేను ఇంటిదానిమీద దర్జాగా బతికేశాను. ఎప్పుడైనా, గురూ! కోర్టులకెళ్ళొచ్చుగాని, రథాలెక్కి యుద్ధాలకు దిగకూడదు — అదీ ఆడవాళ్ళు ఎదురుగా ఉన్నప్పుడు ... నా పాయింట్ కేచ్ చేశావా?" అన్నాడు పుణ్యమూర్తి.

తనకంత తెలివితేటలు లేకపోయినందుకు నరకాసురుడు సిగ్గుపడి, పుణ్యమూర్తివంటి మేధావి వర్గ దుర్మార్గుడికి శిరసువంచి, పాదాభివందనం చేసి నిష్క్రమించాడు.

* * *

మూడోరోజు వెంకటనరసింహంరాజుగార్ని కలిశాడు నరకాసురుడు. బుర్రమీసం, జరీ పంచె, నగిషీలున్న లాల్చీ — గుర్రంమీద స్వారీ చేస్తున్న రాజుగారు కాస్తలో కాస్త తన స్థాయి మనిషనుకొని పలకరించాడు: "మేం రాజ్యలక్ష్మి ఆర్ట్సు కొత్త సినిమాలో సరికొత్త దుర్మార్గపు పాత్ర నిర్వహిస్తున్నాం. మేమేమని శెలవిచ్చాం?" అన్నారు రాజుగారు.

ఆయన రీవికి కాస్త కంగారుపడ్డాడు నరకాసురుడు.

రాజుగారు గంభీరంగా "మీరు అనవసరంగా రణరంగంలో దిగి అసువులు బాశారు. అందుకు చింతిస్తున్నాం. ఎవరినైనా చంపాల్సివస్తే — అర్థరాత్రి గుట్టుగా హత్యలు సొంత చేతుల్తోనే చేసుకువస్తాం. అంతేకాని, యుద్ధరంగానికి పోము. ఇంకా అత్యవసర స్థితివస్తే — మటన్ కత్తి మస్తాన్నో, గుమ్మడికాయ గురవయ్యనో హత్యలకి పురమాయిస్తాం. రాజులకి లౌక్యం తెలియకపోతే — రాజ్యాలేకాదు; ప్రాణాలు కూడా పోతాయి. గ్రహించండి ... మేమేమని శెలవిచ్చాం?" ప్రశ్నార్థకంగా చూశాడు.

"నేను ఉత్త పనికిమాలిన వెధవనని స్పష్టంగా శెలవిచ్చారు," అంటూ సెలవు తీసుకున్నాడు నరకాసురుడు.

రాజమండ్రి దానవాయిపేటలో రిక్షామీద వెళ్తూన్న ఓ పెద్దమనిషి తారసపడ్డాడు నరకాసురుడికి. చెవిలో మిషను, గోధుమరంగు పంచె, కండువా, మెడలో రుద్రాక్షలు — పెద్దమనిషనుకొని నమస్కారం చేశాడు నరకాసురుడు.

"ఎవరయ్యా నువ్వు? నవరాత్రుల్లో యేసాలేత్తావా? ఎదవలాగున్నావు. నీకు యేసం కూడా యేసుకోవడం రాదు. ఎలా బతుకుతావురా?" అంటూ చీవాట్లు పెట్టాడు.

"తమరెవరండి?" అన్నాడు నరకాసురుడు బిక్కుబిక్కుమంటూ.

"నన్నెవరని నన్నే అడిగినోడ్ని నిన్నే సూశేను. సెంటర్లోకెళ్ళి విశ్వచిత్ర కంబైన్స్ సినిమాలోని బుజ్జులెవడని అడిగితే— నలుగురూ నిన్ను క్రిరు సెప్పుచ్చుకు కొడతారు." నరకాసురుడు ఒరిజినల్ అని తెలుసుకుని, మరీ ఉగ్రుడైపోయిన బుజ్జులు, "య్యేట్రా! యెదవ పని సేసి ఱూదిన పడిపోయి, మన జాతికే సెడ్డ పేరు తెచ్చేసేవు? నిన్ను సూత్తే శాన సిగ్గేస్తోంది. నా దగ్గర రిక్షా లాగేవాడికి నీకంటే తెలివితేటలున్నాయి సెత్తగా— మీసాలూ, కత్తులూ షోకెందుకురా? నువ్వేం యెదవపన్లు సేసేవని ఆ ఆడిదాని సేతుల్లో సచ్చిపోయావు? నేను నాలుగు రూటు బస్సులు నడుపుతున్నాను. నా సేతికింద రకరకాల యెదవపన్లు సేసేవోళ్ళున్నారు. ఒకడిసేత కాపుసారా కాంట్రాక్టు పాడించి, యెలెక్షన్లో గెలిపించి యెమ్మెల్యే సేసేను. మనం యెనకనుండి వాళ్ళసేత పనులు సేయించి, సెక్రం తిప్పాల...సీ— సీ! నిన్ను సూత్తేనే వొళ్ళు మండిపోతోంది. మళ్లీ నాకు ముకం సూపించకు. ఒరేయ్, సుబ్బయా! రిక్షా తిప్పెయ్యరా!" అన్నాడు బుజ్జులు.

నరకాసురుడు మరీ నీరుకారిపోయాడు. యుగాల కిందటి తన దుర్మార్గం మరీ చవకబారుదైపోయిందనీ, దుర్మార్గాన్ని రకరకాల కోణాల్లో, రకరకాల పద్ధతుల్లో ప్రాక్టీసు చేస్తున్న ఆధునిక నరకాసురులు ఈ నూతన ప్రపంచంలో చాలామంది ఉన్నారని తెలుసుకుని, సిగ్గుపడిపోయి, కాజువల్ లీవ్ అయిపోయినందున నరకం చేరుకున్నాడు. ★

[జి. వి. జి.]

లక్షలాది ప్రజలకు సూపర్ భావం కలిగించే టీ!






































కావాలి నాకపుడు టోస్టెడ్
పొగాకు కమ్మదనం.

టోస్టెడ్ రుచి ఇపుడు మరింత
మృదువు. నాకలాగే ఇష్టం మరి!




చార్‌మినార్ ఫిల్టర్

ప్రపంచమంతటా లక్షలాది మంది ఆనందించే టోస్టెడ్ పొగాకు కమ్మని రుచిని మీరుకూడా ఆస్వాదించండి. ఇప్పుడు ఘాటు లేకుండా మరింత మృదువుగా చేయబడి మీ పొగ-త్రాగే ఆనందం కోసం చార్‌మినార్ ఫిల్టర్‌లో మేళవించబడింది.

**CHARMINAR**

FILTER

STATUTORY WARNING:
CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

చట్టబద్ధమైన హెచ్చరిక
సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం

Contract-CF-4 AC-TL



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## నూతన తెలుగు దర్శకునితో తమిళ దర్శకుడు నిర్మించే చిత్రం

"నేటి సమాజంలో స్త్రీ తనకెదురయ్యే విపరీత పరిస్థితులనుంచి తనను తాను రక్షించుకుంటూ, ఎలా బయటపడి బతకగలుగుతుందనే అంశంమీద నేను రాసిన కథకు గత పదేళ్ళుగా ఆదుర్తి, సి ఎస్. రావు, రాఘవేంద్రరావుగార్లతో పాటు నా వద్ద కూడా అసోసియేట్‌గా పని చేసిన యం. ఆర్. కృష్ణకు దర్శకత్వ బాధ్యతను అప్పగించాను. ఒకే షెడ్యూల్లో పూర్తయ్యే ఈ చిత్రానికి విజయదశమి రోజున పూజా కార్యక్రమాన్ని జరిపాం," అన్నారు ప్రఖ్యాత తమిళ దర్శకుడు దొరై. ఈయన "పసి" తమిళ చిత్రం ద్వారా రాష్ట్ర స్థాయిలో, జాతీయ స్థాయిలో కూడా అవార్డులు అందుకుని, విదేశాలలో సైతం ప్రశంస లందుకున్నారు.

## రాజ్‌బాబు నటించే చిత్రాలు

అరుణోదయ డ్రమెటిక్ అండ్ ట్రిక్ పిక్చర్స్ నిర్మించే "జమీందారు జగ్గారావు" చిత్రంలో రాజ్‌బాబు ద్విపాత్రలు నిర్వహిస్తున్నారు. రమాప్రభ, నాగభూషణం ఇతర ముఖ్యపాత్రధారులు. సీతారాం సంభాషణలకర్త, శ్రీ.శ్రీ., సి. నారాయణరెడ్డి, రామచంద్రరావు గీతాలకు సత్యం బాణీలు కూర్చారు. ఎం వెంకటేశ్వరరావు ఛాయ, త్రినాధరావు శిల్పంతో గారపాటి భాస్కరరావు నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. జి. ఎస్. రామచంద్రరావు దర్శకత్వంలో ఆకుల యాదగిరి, వంశీధర్ నిర్మాతలు. ఈ చిత్రంలో జయమణి అనే కొత్తనటిని పరిచయం చేస్తారు.

"తెనాలి రామలింగడు" పాత్ర ధరించాలనే రాజ్‌బాబు చిరకాల వాంఛ త్వరలో నెరవేరబోతోంది. స్వయంగా "నా పేరే లింగడు" అనే చిత్రాన్ని జనవరిలో ప్రారంభిస్తారు.



"హీరోయిన్‌కి అసలు బట్టలు లేకుండా తీస్తామని చెప్పాంకదా – అంటే ఇట్లా!"

"ముద్దుల మొగుడు"లో అక్కినేని నాగేశ్వరరావు, శ్రీదేవి

## సినిమా

### జంధ్యాల దర్శకత్వంలో ఎ.ఎన్.ఆర్.

"జనవరిలో పాటలు రికార్డ్ చేస్తాం అన్నపూర్ణా స్టూడియోలో ఫిబ్రవరి 13న షూటింగ్ ముహూర్తం నిశ్చయించాం," అన్నారు భీమవరపు బుచ్చిరెడ్డి. ఈయన నిర్మించే జ్యోతి ఆర్ట్ క్రియేషన్స్ తాజా చిత్రంలో ఎ. ఎన్. ఆర్., జయప్రద నాయకా నాయికలు. చక్రవర్తి సంగీతం, ఎస్. గోపాలరెడ్డి ఛాయ, భాస్కరరాజు శిల్పం, పృథ్వీరాజ్ ప్రొడక్షన్స్, జి.జి. కృష్ణారావు కూర్పు, బి. అంజిరెడ్డి నిర్వహణతో జంధ్యాల రచన, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు.

### మోహన్‌బాబు "ధర్మపోరాటం"

"నవంబర్ 20 నుంచి డిసెంబర్ 15 వరకు తిరుపతి పరిసరాలలో ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది," అన్నారు హీరో మోహన్‌బాబు. ఈయన "ప్రతిజ్ఞ" అనంతరం నిర్మించే శ్రీ లక్ష్మీప్రసన్న పిక్చర్స్ "ధర్మపోరాటం" ద్వితీయ చిత్రంలో జయసుధ, జగ్గయ్య, సత్యనారాయణ, గిరిబాబు, త్యాగరాజు, ఎస్. వి. రామదాసు, పూర్ణిమ, పుష్పలత ఆదిగా గల వారుంటారు. ఎం డి. సుందరం కథ, స్క్రీన్‌ప్లేకు సత్యానంద్ సంభాషణలకర్త. సత్యం స్వరకల్పనలో ఆత్రేయ గీతాలు రాస్తారు. పుష్పాల గోపీకృష్ణ ఛాయ, రవి కూర్పు నిర్వహిస్తారు. "మోహన్‌బాబుది విలక్షణమైన లాయర్ పాత్ర," అన్నారు డైరెక్టర్ బోయిన సుబ్బారావు.

---

ప్రముఖ దర్శక నిర్మాత శ్రీ పత్యగాత్మ గారి కుమారుడు దర్శకుడు వి. కె. వాసు, చి. సౌ రత్న కుమారిగార్ల వివాహం విజయదశమి పర్వదినాన (27-10-82) విజయవాడలోని నటరాజ్ హోటల్‌లో అభ్యుదయ పంధాలో నిరాడంబరంగా జరిగింది సినీపరిశ్రమకి చెందిన ప్రముఖులు, పలువురు పురప్రముఖులు, బంధుమిత్రులు అనేకులు హాజరై వధూవరులని ఆశీర్వదించారు





# Hallmark DELUX

# హాల్‌మార్క్ డీలక్స్
# స్టెయిన్‌లెస్ స్టీల్ గ్యాస్ స్టవ్



IS 4246




GUARANTEED FOR 5 FULL YEARS!

- సౌకర్యం కొరకు మధ్యలో ఒక Pan Support
- అయిదు పూర్తి సంవత్సరముల గ్యారంటీ

అన్ని సదుపాయాలతో మరెంతో మన్నిక కలిగి మీ గృహానికి అందానిచ్చే స్టౌవ్

- శుభ్రపరచటానికి వీలుగా తీసిపెట్టగల **Spill trays**
- ఇతర స్టాండులతో అవసరంలేని **Rubber feet**
- ఇంధనాన్ని పొదుపు చేయుటకు అత్యధిక సామర్థ్యంగల **Burners**
- మీ పాత్రలకు స్థిరమైన ఆధారాన్ని ఇచ్చే **Pan Supports**

తయారు చేయువారు

**ORIENTAL APPLAINCES (P) Ltd.,**
Madras-600 013, Ph : 555874

పంపిణీదారులు.

**NISCHA-DEEP ENTERPRISES**
8, VICTORIA CRESCENT,
MADRAS-600 105, Ph : 811403
6-1-67/19, Saifabad,
Hyderabad-500 004, Ph : 36719
2, Nanjappa Rd, Shanti Nagar,
Bangalore-560 027



**Hallmark** గృహ పరికరాలలో - ప్రత్యేక తరహ

Sista's-NDE 36.82 TEA

# సినిమా

## "ఈ దేశంలో ఒక రోజు"

"ఈ దేశంలో ఒక రోజు ఒకే బస్సులో ప్రయాణిస్తున్న అరవైమంది ప్రయాణీకుల్లో ఐక్యత, సంఘీభావం కనిపించనప్పుడు – కలకాలం బతకవలసిన కొన్ని కోట్లమంది భారతీయుల్లో ఐక్యత, సంఘీభావం ఎలా కనిపిస్తాయి? ఐక్యత, సంఘీభావం ఇప్పుడెలా ఉన్నాయ్? అసలెలా ఉంటే ఈ దేశం సగర్వంగా తలెత్తుకుని మనగలదు?" అన్నారు పద్మావతీ ఫిలిమ్స్ సమర్పణలో కుమారరాజా పిక్చర్స్ నిర్మించే "ఈ దేశంలో ఒక రోజు" చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే వేజెళ్ళ సత్యనారాయణ. విజయదశమినాడు పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగిన ఈ చిత్రంలో శివకృష్ణ, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, జ్యోతి, గీత, శేషుబాబు, రాజేంద్రప్రసాద్, పి. ఎల్. నారాయణ, హేమసుందర్, రాజ్‌వర్మ, రాజా, రాళ్ళపల్లి, డాక్టర్ శివప్రసాద్, కిరణ్ బాబు, రమణారెడ్డి, సాక్షి రంగారావు, వీరభద్రరావు, వల్లం నరసింహారావు, జయభాస్కర్, రాళ్ళబండి, అనంతి, బిందుమాధవి, మల్లాది విజయలక్ష్మి, సత్యచిత్ర, విజయకళ పాత్రధారులు. పరుచూరి గోపాలకృష్ణ రచయిత. ఆత్రేయ, సి. నారాయణరెడ్డి, నెల్లుట్ల, రోహిణీకుమార్ గీతాలకు శివాజీరాజా స్వరకర్త. ఆర్. కె. రాజా ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం, బాబూరావు కూర్పుతో ఎస్. భావనారాయణ నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. "ఒక రోజు ఒక బస్సులో ప్రయాణం చేసే విభిన్న మనస్తత్వాల ప్రయాణీకుల మధ్య జరిగే ఈ కథ నవంబర్ 20 నుంచి డిసెంబర్ 20 వరకు ఒకే షెడ్యూల్లో చిత్రీకరింపబడుతుంది," అన్నారు నిర్మాత ఉప్పలపాటి సూర్యనారాయణబాబు.





"ప్రజాశక్తి" లో ఒక దృశ్యం

## సురేష్ ప్రొడక్షన్స్ ముందడుగు

"ఆక్షన్ సెంటిమెంట్‌తోపాటు అభ్యుదయ భావాలతో కూడిన ఇతివృత్తం. జనవరిలో షూటింగ్ పూర్తవుతుంది ఫిబ్రవరి రిలీజ్," అన్నారు నిర్మాత డి. రామానాయుడు. సురేష్ ప్రొడక్షన్స్ "ముందడుగు" చిత్రానికి అక్టోబర్ 22న తొలి గీతం ధ్వనిముద్రితమైంది. కృష్ణ సరసన జయప్రద, శోభన్ బాబు సరసన శ్రీదేవి నాయికలు సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గుమ్మడి, రావు గోపాలరావు, నూతన్‌ప్రసాద్, గిరిబాబు, చలపతిరావు, జయంతి, సూర్యకాంతం వగైరా తారా సందోహం

"శ్రీ సత్యనారాయణ' ప్రొడక్షన్స్"
తొలి చిత్రంలో మురళీమోహన్, సరిత



# సినిమా

పరుచూరి సోదరుల రచన, చక్రవర్తి సంగీతం, వెంకట్ ఛాయ, ఎస్ కృష్ణారావు శిల్పం, మార్తాండ్ కూర్పు, దొనవల్లి కోటేశ్వరరావు, పొన్నుస్వామి నిర్వహణతో కె. బాపయ్య దర్శకుడు. జితేంద్ర హీరోగా కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో "దేవత" చిత్రాన్ని హిందీలో సురేష్ ప్రొడక్షన్స్ జనవరి 1న ప్రారంభిస్తుంది. ఆ తర్వాత కొత్త వారితో తయారుచేసే చిత్రానికి నిర్మాతే దర్శకత్వం వహించవచ్చు.

## జంధ్యాల దర్శకత్వంలో సంగీత, నృత్యమయ చిత్రం

"తరతరాలుగా భారతీయ సంస్కృతిని దేశ విదేశాల ప్రభావితం చేసిన భరతశాస్త్రం ఆధునిక నాట్య ప్రభావంతో అట్టడుగుకు దిగజారుతున్న సమయంలో – తిరిగి ఊపిరిపోసి, ఊరూరా వాడ వాడలా ఆ చిరుమువ్వల మరుసవ్వడిని పునరుద్దీపన గావించిన ఓ మహా కళాకోవిదుని అపూర్వగాథ. ఓ వారపత్రికలో ధారావాహికంగా వెలువడి, పాఠకులను విశేషంగా రంజింపజేసిన ప్రొఫెసర్ కొండముది శ్రీరామచంద్రమూర్తిగారి 'చిరుమువ్వల మరు సవ్వడి' ఆధారంగా తయారవుతుందీ చిత్రం," అన్నారు జంధ్యాల ఈయన రచన, దర్శకత్వంలో "నాలుగు స్తంభాలాట" అనంతరం కల్యాణి ఆర్ట్ ఫిలిమ్స్ నిర్మించే ద్వితీయ చిత్రానికి అక్టోబర్ 27న తొలిగీతం ధ్వనిముద్రితమైంది. దైవదత్తమైన లలిత కళలు కులమత తత్వాలకు అతీతమని చాటి చెప్తూ, సర్వమానవ సమభావాన్ని ప్రేరేపిస్తూ, వసుధైక కుటుంబానికి నాంది పలికే ఈ చిత్రానికి వేటూరి గీతాలు, రమేష్‌నాయుడు సంగీతం, గోపాలరెడ్డి ఛాయ, భాస్కరరాజు శిల్పం, గౌతమ్ రాజు కూర్పు, శేషు నృత్యాలు, కెయన్నార్ నిర్వహణ, యు. వి. పాణి సహ దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు. కె. రవిప్రకాష్, శ్రీమతి టి సునీత నిర్మాతలు.

## అన్నపూర్ణా స్టూడియోస్ 6వ చిత్రం

"డిసెంబర్‌లో పాటలు రికార్డవుతాయి," అన్నారు ఎ కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించే అన్నపూర్ణా స్టూడియోస్ చిత్రంలో ఎ. ఎన్. ఆర్. సరసన శ్రీదేవి నాయిక. రావు గోపాలరావు ఓ కొత్తరకం పాత్రను పోషిస్తారు సత్యానంద్, చక్రవర్తి, నవకాంత్, భాస్కరరాజు తెరవెనుక కృషి చేస్తారు జనవరి నుంచి మార్చి వరకు ప్రతి నెలా 1 – 12 తేదీల మధ్య జరిగే మూడు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుందని నిర్మాతలు వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని తెలియజేశారు

"పల్లెటూరి మొనగాడు"లో చిరంజీవి, రాధిక





''త్రిశూలం'' లో శ్రీదేవి, కృష్ణంరాజు

# సినిమా

## మాయగాడులో మంచివాడు

వాణి (సుమంగళి), గోపి (సారధి)— ఇద్దరూ పూలదండలు వేసుకొని ఉన్నారు. ప్రెజెంటేషన్స్‌తో కుమార్ (సుధాకర్), మల్లిక (పూర్ణిమ) వచ్చారు. కుమార్‌వంక మల్లిక ఓరగా చూస్తూ ''వాణీ! నువ్వు అదృష్టవంతురాలివి. కనీసం ధైర్యమున్న మొగుడ్ని ప్రేమించావ్. వెంటనే పెళ్ళిచేసుకున్నావ్'' అంది.

గోపి మందహాసంతో ''అదేంకాదు, తల్లీ! అడ్వాన్సులిచ్చిన ప్రొడ్యూసర్లందరూ ఈవిడ అసలు రూపం పసికట్టేసి, పిక్చర్లు తీయటం మానుకున్నారు వెంటనే నన్ను పట్టుకుంది,'' అన్నాడు.

''నువ్వు చేసిన పనికి అలాగే వెయ్యాలి,'' అంటూ ప్రెజెంటేషన్‌ను మల్లిక అందజేసింది.

ఇంతలో రాజేష్ (మోహన్‌బాబు), జ్యోతి (కవిత) కూడా కానుకలతో వచ్చారు. చెల్లెల్ని చూడగానే రాజేష్ కళ్ళు ఆర్ద్రమయ్యాయి. ''గోపీ, నీ జీవితం సుఖంగా గడిచిపోవాలని కోరుకుంటున్నాను,'' అన్నాడు కానుకను అందజేస్తూ.

మల్లిక కాస్త సీరియస్‌గా ''వాణీ, ఇక ముందైనా నీ భర్తను స్నేహం చేసే ముందు కొంచెం ఎదుటి మనిషి ప్రవర్తన చూసి చెయ్యమని చెప్పు!'' అంది.

జ్యోతి కూడా ''వాణీ! నాగరికత తెలియని మనుషులతో స్నేహం అంత మంచిది కాదు,'' అంది

''మర్యాదగా మాట్లాడు. నిన్నటిదాకా నీకు చెడ్డగా కనిపించిన ఈ మనిషి— ఈ రోజు నీకు నచ్చినంత మాత్రాన మంచివాడైపోతాడా ?'' అంది మల్లిక

''మంచితనం చూసే వాళ్ళను బట్టి, అర్థం చేసుకునేవాళ్ళను బట్టి ఉంటుంది,'' అంది జ్యోతి.

''రెండు రోజులు తిరిగేసరికి అతని ముఖంమీద 'నేరస్థుడు' అన్న ముద్రపోయి, 'మంచివాడు' అన్న పతకం కనబడిందా నీకు ?''

''ఒక్క క్షణం ఆలోచించి అతని ఆరా[illegible] అర్థం చేసుకుంటే — నీకే తెలుస్తుంది. [illegible] నీకేమవుతాడో తెలుసా ?''

రాజేష్ కలుగజేసుకుని, ''జ్యోతీ! ఏమిటో తెలియనివాళ్ళను నమ్మించాలని ప్రయత్[illegible] కూడదు... అమ్మా, మల్లికా! అనురాగం అను[illegible] తెప్పిస్తుంది. వాత్సల్యం క్షమాహృదయాన్నిస్తుం[illegible] అన్నాడు.

''నీలాంటివాడికి నీతులు చెప్పడమే తెల[illegible] మాకు ఆచరించడంకూడా తెలుసు... [illegible] కుమార్!'' అంటూ కుమార్ చెయ్యి పట్టు[illegible] వడివడిగా వెళ్ళిపోయింది మల్లిక.

సుమన్ క్రియేషన్స్ ''మాయగా[illegible] సినిమాస్కోప్ చిత్రాన్ని సమర్పించే ఎం. రామకృ[illegible] రెడ్డి ''మూడు పాటల చిత్రీకరణ తప్ప — దాద[illegible] పూర్తయిపోయినట్లే,'' అన్నారు. డైరెక్[illegible] బి. ఎల్. వి. ప్రసాద్ ''గుర్రాలపై ఫైట్[illegible] గాజుగోళీలపై హీరో మోహన్‌బాబు, వి[illegible] జట్టుతో చేసే ఫైట్స్ ప్రత్యేక ఆకర్షణలు[illegible] అన్నారు. కాంతారావు, ప్రభాకరరె[illegible] నూతన్‌ప్రసాద్, గిరిబాబు, ఈశ్వరరా[illegible] మోదుకూరి సత్యం, జి. ఎస్. స్వామి, పండరీబా[illegible] అత్తిలి లక్ష్మి ఇతర పాత్రధారులు. ఎం. [illegible] సుందర్ కథకు పరుచూరి సోదరులు సంభాషణ[illegible] రాశారు. చక్రవర్తి సంగీతం, ఎస్. ఎస్. లా[illegible] ఛాయ, భాస్కరరాజు శిల్పం, రవి కూర్పు[illegible] శ్రీమతి శ్యామలారెడ్డి నిర్మాత.

## ఆకలీ! నీకు జోహారు

''నేటి అస్తవ్యస్త స్థితిలో అవస్థపడుతూ[illegible] ఈ వ్యవస్థను ప్రతిబింబిస్తూ ఒక విప్లవ కథ[illegible] కడప— ఆలిండియా రేడియో కేంద్రంలో ప[illegible] చేస్తున్న ఆర్. ఇ. టి. శ్రీనివాసులు రాశారు. దా[illegible] ఆధారంగా అభ్యుదయ రచయిత, రంగస్థలోపాసకు[illegible] ఎం. వి. ఎస్. హరనాథరావు చిత్రకథ, మాట[illegible] రాశారు. నవంబర్ 26 నుండి డిసెంబర్ 3 వరకు నిర్విరామంగా తిరుపతిలో షూటింగ్ పూర్త[illegible] తుంది,'' అన్నారు రాజ్యలక్ష్మి కంబైన్స్ అధినే[illegible] యు. ఎస్. ఆర్. మోహనరావు. నూతన్ ప్రసాద్ ప్రభాకరరెడ్డి, గిరిబాబు, సాక్షి రంగారావు, పి ఎల్ నారాయణ, కె. విజయ వగైరా నటవర్గం. చంద్ర[illegible] శేఖర్ స్వరకల్పనలో అదృష్టదీపక్ గీతాల[illegible] రాస్తున్నారు. మోహనకృష్ణ ఛాయ, ప్రకాశరా[illegible] శిల్పంతో ఎన్. రామచంద్రరావు దర్శకుడు

## చెన్నపురి ఆంధ్ర మహాసభ నూతన కార్యవర్గం

ఇటీవల జరిగిన చెన్నపురి ఆంధ్ర మహాసభ 66వ సర్వసభ్య సమావేశంలో 1982–83వ సంవత్సరానికి సంస్థ అధ్యక్షులుగా శ్రీ జె. వి. సోమయాజులు; ఉపాధ్యక్షులుగా శ్రీయుతులు పి. వెంకటస్వామి, బి. వి. ఎస్. ఎస్. మణి, వి. దేవరాజులునాయుడు, పి. వి. రాజారమణయ్య, డి వి. ఎస్. రాజు; గౌరవ కార్యదర్శులుగా డా. జి. రామచంద్రమూర్తి, శ్రీ ఎం. డి. బాలకృష్ణ; గౌరవ కోశాధికారిగా శ్రీ ఎం. కుప్పస్వామి ఎన్నికైనారు. 


Bidhan-ICG-9-TEL


I.C.G.




# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్

(గత సంచిక తరువాయి)

**మే 15 :** డ్రాకులా అలా బల్లిలా పాకుతూ కోటలోంచి బయటకెళ్ళడం మరోకసారి చూసాను. అతను దాదాపు వంద అడుగుల క్రిందకు పాక్కుంటూ దిగి, తర్వాత ఎడమవేపుకు వెళుతున్నాడు. తర్వాత కిటికీలోనో, కన్నంలోనో దూరి మాయమయిపోతున్నాడు. అతను అట్లామాయమయ్యేటప్పుడు, కిటికీలోంచి వంగి చూడడానికి ప్రయత్నించాను, అతను ఎటు వెళ్ళేది కనిపెట్టడానికి. కానీ నేను వున్న చోటునుంచి ఎంత వంగి చూసినా, అతను వెళ్ళే మార్గం ఓ పక్కకుండడంవల్ల, చూడలేకపోయాను. ఈపాటికి అతను కోట దాటిపోయివుంటాడు. నేను నా గదిలోకి వెళ్ళాను. అక్కడ దీపం ఒకటి పుచ్చుకుని అన్ని తలుపుల దగ్గరకుపోయాను. అన్నీ తాళాలువేసి వున్నాయి — నేను వూహించినట్టుగానే. తాళాలన్నీ కొత్తవిలా కనిపించాయి. ఈసారి మెట్లమీదుగా క్రిందికి వెళ్ళాను. నేను ఈ కోటకు ఏ గుమ్మం ద్వారా వచ్చానో, అక్కడికి చేరుకున్నాను. ఆ పెద్దతలుపుకున్న గడియ తీసాను. గొలుసులు లాగగలిగాను. తలుపు తీయబోయానుగానీ, రాలేదు. దానికి తాళంవేసి వుంది. దాని తాళంచెవి బహుశా డ్రాకులా గదిలో వుండి వుంటుంది. అతని గది తెరిచి వుంటే, తాళం వెదికి నేను పారిపోవచ్చు. అక్కడ్నించి వెనక్కివచ్చి కనపడిన మెట్లన్నీ ఎక్కాను. కనపడిన తలుపులన్నీ తీయడానికి ప్రయత్నించాను. కొన్నిగదులు తెరిచే వున్నాయి. అందులో దుమ్ముకొట్టుకుపోయిన పాత కర్రసామాను తప్ప ఏమీలేదు. చివరకు మెట్లమీద నుంచి ఓ పక్కగాపైకి వెళ్ళి ఓ తలుపు దగ్గరకు చేరుకున్నాను. దానికి తాళం వేసిలేదు. మెల్లగా తోసాను. తెరుచుకోలేదు. కాస్త బలం ఉపయోగించాను. అయినా తలుపులు తెరుచుకోలేదు. సరిగ్గా చూస్తే, ఆ తలుపులు కాస్తమేరకు నేలలో దిగబడిపోయివున్నాయి. కాస్త కష్టపడితే తియ్యగలననిపించింది. నా బలం అంతా ఉపయోగించి ఇతర్రతా కష్టపడి ఆ తలుపును వెనక్కితోయగలిగాను. గదిలోకి అడుగు పెట్టాను. కోటకు కుడివైపు భాగంలో ఒక గది అది. దానికి పడమరవైపు, దక్షిణం వైపు కిటికీలు వున్నాయి. దక్షిణంవైపు వున్న కిటికి క్రింద అంతా అగాధం. ఆ కోట కొండకు ఒక మూల కట్టబడివుంది. కోట మూడువైపులా అగాధం. ఆ వైపునున్న కిటికీలోంచి ఏవీ లోపలికి రాలేవు. నిజానికి ఇటువైపు అసలు ఎవరి కాపలా అక్కర్లేదు. కోట పడమరవైపు ఒక పెద్దలోయ వుంది. లోయ తర్వాత ఎత్తైన కొండలు పగుళ్ళు విచ్చివున్నాయి. అక్కడక్కడా కొండరాయి రాలి పడివుంది. పూర్వం కోటలోని ఆడవాళ్ళు క్షేమంగా ఇక్కడే వుండేవాళ్ళు అనుకుంటా. ఆ గదిలో చక్కటి కర్రసామానులున్నాయి. అక్కడి కిటికీలకు తెరలు లేవు. బయటి వెన్నెల కిటికీలోగుండా పసుపు పచ్చగా కురుస్తోంది. నా చేతిలో దీపం ఆ వెన్నెలవెలుగులో అనవసరం అనిపించింది. కానీ దీపం వున్నందువల్ల, అటువంటి నిర్మానుష్య ప్రదేశంలో భయభ్రాంతులను దూరం చేసుకోవచ్చు. డ్రాకులాతోపాటు గడిపేకన్నా, ఈ గదిలో ఒంటరిగా వుంటేనే హాయిగా వుందనిపించింది.

**జరిగిన కథ — 3 :** జోనాథన్‌హార్‌కర్ తన డైరీలో వ్రాసుకొన్న కథనం రచయిత వివరిస్తున్నారు. అతను "డ్రాకులా ప్రభువు"ను కలుసుకోవడానికి బండిలో బయలుదేరుతాడు. అక్కడివారు చాలామంది ముఖ్యంగా ఆ ముసిలావిడ డ్రాకులా దగ్గరికి వెళ్ళవద్దని ప్రాధేయపడుతుంది. కానీ అతని నిర్ణయం మార్చుకోడు. కొంత దూరం ప్రయాణం అయ్యాక అతను డ్రాకులా పంపించిన బండిలోకి షిఫ్ట్ అవుతాడు. ఆ బండి తోలేవాడు చాలా క్రూరంగా వున్నట్లు అతనికి అనిపిస్తుంది. సరిగ్గా సమయం పన్నెండు గంటలు అవబోతున్న సమయంలో 'ఏం జరుగుతుందో' అనే సందేహం అతనిలో కూడా భయాన్ని కలిగిస్తుంది. కానీ హార్‌కర్ అనుకున్నట్లు ఏమీ జరగకుండానే కోటకి చేరుకుంటాడు. అక్కడ డ్రాకులా అతనికి ఘనస్వాగతం ఇస్తాడు. హార్‌కర్ వకీలు హాకిన్స్ వంట్లో బాగోలేని కారణంగా అతన్ని తన దూతగా ఇక్కడికి పంపుతాడు. డ్రాకులా ఆకారం, అతని ప్రవర్తన హార్‌కర్‌లో వింత భయాల్ని కలిగిస్తుంటాయి. 'పర్‌ఫ్లీట్'లో తను కొనబోయే ఎస్టేట్ గురించిన వివరాలన్నీ హార్‌కర్ ద్వారా తెలుసుకొంటాడు డ్రాకులా. అతనికి కావల్సిన అన్ని వసతులు డ్రాకులానే సమకూరుస్తుంటాడు. అంత పెద్ద కోటలో మరో మనిషి వున్న జాడలేదు. 'తను ఇక్కడ బందీ' అని తెలుసుకొన్న హార్‌కర్‌లో భయంకరమైన ఆలోచనలు కల్గుతుంటాయి.

కాస్త మనసు కుదుట పడసాగింది. అక్కడ పాత వ్రాత బల్లవుంది. అక్కడికెళ్ళి కూర్చున్నాను. బహుశా ఇక్కడ ఓ సుందరీ మణి కూర్చుని ఎన్నో మధురోహలతో తన ప్రియుడికి వుత్తరం వ్రాసి వుంటుంది. నేను ఇప్పటివరకు జరిగినదంతా డైరీ రాసాను.

మే 16, ఉదయం : దేవుడు నా ఆరోగ్యాన్ని కాపాడాలి. నేను బాగా తగ్గి పోయాను. బ్రతుక్కి రక్షణ లేకుండా పోయిందనిపిస్తోంది. కానీ ఇంతవరకు పిచ్చి ఎక్కనందుకు సంతోషపడాలి. తెలివిగా ఉన్నా ఇక్కడ జరిగే గందరగోళపు వ్యవహారాలు, ఈ డ్రాకులా నాకు ప్రాణం సంకటం కాదను కోటం నా పిచ్చి. దేవుడూ నువు చాలా గొప్పవాడివయ్యా. నీ దయవల్లే ఇట్లా ఆలోచించగలుతున్నాను. నెమ్మదిగా వుండ గలుగుతున్నాను, పిచ్చి ఎక్కకుండా. జరిగిన దంతా డైరీ రాసే అలవాటు వుండడంవల్ల, కాస్త ఆలోచిస్తూ రాయగలుగుతున్నాను. అదే నాకు వూరట.

డ్రాకులా చేసిన హెచ్చరిక నాకు భయం కలుగచేస్తోంది. అతను హెచ్చరిక చేసినప్పటి కన్నా, ఆ ఆలోచనతో ఇప్పుడే నాకు భయం ఎక్కువవుతున్నది. నా భవిష్యత్తు అతని చేతిలోవుంది.

నా డైరీ రాసి, అదృష్టవశాత్తు నా జేబులో పెన్నుతోపాటు పెట్టుకుని పడు కున్నాను. అప్పుడు డ్రాకులా చేసిన హెచ్చరిక నా బుర్రలోకి వచ్చింది మళ్ళా. కానీ దాన్ని పట్టించుకోకుండా తిరగ గలిగినందుకు కాస్త సంతోషంగానే వుంది. ఆ సంతోషంవల్ల నాకు కాస్త నిద్రవచ్చేట్టుగావుంది. బయట వెన్నెల ఆహ్లాదకరంగా వుంది. నేను స్వేచ్ఛగా గాలి పీల్చాను. మళ్ళా ఆ చీకటితో నిండిన గదుల్లోకి వెళ్ళకుండా ఇక్కడే పడుకుందా మనుకున్నాను. ఆ రోజుల్లో ఇక్కడ ఈ గదుల్లో ఆడవాళ్ళు కూర్చుని హాయిగా పాటలు పాడుకుంటూ వుండేవారు కామోసు. వారి ప్రియులు యుద్ధంలో పోరాడుతున్నప్పుడు, ఇక్కడ కూర్చున్న ఆడవాళ్ళ గుండెల్లో ఎంత విషాదం వుండేదో! ఓ వాలుకుర్చీ లాంటిది లాక్కుని పడుకున్నాను. నేను పడుకున్న చోటునుంచి తూర్పు, దక్షిణం వైపు అందమైన ప్రకృతిని చూడ గలుగుతున్నాను. దుమ్ము ధూళి పడుతున్నా పట్టించుకోలేదు. మెల్లగా నిద్రలోకి జారి పోయాను. బాగా నిద్రపోయివుంటాను. మెలకువ వచ్చేసరికి గదినిండా సూర్యకాంతి. అంత నిద్రపోయానంటే నాకే నమ్మకం కలగలేదు. కానీ రాత్రి ఏదో జరిగింది నిజంగా!...

నేను అదే గదిలో ఒంటరిగా వున్నాను. ఎటువంటి మార్పు లేదు గదిలో. నేలమీద చూసాను నేను వచ్చినపుడు నేలమీద దుమ్ములో పడ్డ నా అడుగుల గుర్తులు అట్లాగే వున్నాయి. వెన్నెల కాంతిలో, నా ఎదురుగుండా ముగ్గురు యువతులను చూసాను. వాళ్ళ చేష్టలు, దుస్తులనుబట్టి వాళ్ళు స్త్రీలే! వాళ్ళను చూసినప్పుడు కలేమో అనుకున్నాను. ఎందుకంటే, వెన్నెల తాలుకు



## జీవన్మృతులు

నీడ వాళ్ల మీదనుంచి క్రింద పడడంలేదు. వాళ్ళు నాకు దగ్గరగా వచ్చారు. కాసేపు చూసారు. తర్వాత ఏవో గుసగుసలాడుకున్నారు. ఇద్దరు పొడుగాటి ముక్కుతో, నల్లగా కనిపించారు. కళ్ళు ఎర్రగా వుండి వాళ్ళ చూపులు తీక్షణంగా వున్నాయి. మూడో ఆమె చక్కగా వుంది. జుత్తు బంగారపు రంగుతో వొత్తుగా వుంది. కళ్ళు తేలిపోయిన నీలపు కాంతిలో వున్నాయి. ఆమెను చూస్తుంటే ఎక్కడో చూసినట్టు అనిపించింది, కానీ గుర్తురాలేదు. వాళ్ళ ముగ్గురి పళ్ళు మోహం పుట్టించే పెదాల మధ్య తెల్లగా ముత్యాల్లాగ మెరుస్తున్నాయి. వాళ్లని చూడగానే మనసులో ఏదో గుబులు బయలుదేరింది. ఓ పక్క చచ్చేంత దిగులు – ఏమవుతుందోనని. వాళ్ళు నన్ను ముద్దు పెట్టుకుంటే బాగుండును అనిపించింది. ఈ విషయాలు రాయకూడదు డైరీలో. ఎప్పుడైనా మీనా ఇది చదివితే బాధపడుతుంది. కానీ నా కోరిక నిజం కదా! వాళ్ళు గుసగుసలాడుకున్నారు. నన్ను చూసి నవ్వారు. వాళ్ళ నవ్వులో సంగీతం పలికింది. కానీ అది మనిషి నవ్వులా సున్నితంగా లేదు. నీళ్లతో నింపిన గ్లాసులతో భరించలేని చప్పుడు చేస్తే వచ్చే సంగీతంలా వుంది. అందంగా వున్న అమ్మాయి తల వూపింది. మిగతా ఇద్దరూ ఆమెను తొందరపెట్టారు. 'వెళ్ళు. మొదట నువ్వే వెళ్ళు. మేం తర్వాత వస్తాం. ప్రారంభోత్సవం నీదే' ఒకామె అంది.

'ఇతను యువకుడు. బలంగా వున్నాడు. ఇక మనకి ముద్దులే ముద్దులు' అన్నది మరొక ఆమె.

నేను కదలకుండా పడుకుని కనుసన్నల లోంచి తీయని బాధతో వాళ్లను చూస్తున్నాను, వారికోసం ఎదురుచూస్తూ. అందంగా వున్న అమ్మాయి ముందుకొచ్చింది. ఆమె నా మీదకు వంగింది. ఆమె ఊపిరి నాకు తలుగుతోంది. తీయని, అతి తీయని భావం నా నరాల్లోకి వెళుతోంది. కానీ అది సుఖంగా లేదు.

నేను కళ్ళు పూర్తిగా తెరవడానికి భయపడ్డాను. కనుసన్నలలోంచి మాత్రమే గమనిస్తున్నాను. ఆమె మోకాళ్ళమీదకూర్చుని నా మీదకు వంగింది మోహంతో. ఆమె మోహం

చూస్తుంటే ఒళ్ళు జలదరించింది. వికారం పుట్టసాగింది. మెల్లగా తన మెడను వంచింది, ఎర్రటి పెదాలను తడుపుతూ. అది జంతువు లక్షణంగా అనిపించింది. వెన్నెల వెలుగులో ఆమె ఎర్రటి నాలుకను, సూదిలాంటి తెల్లని పళ్ళను చూసాను. ఆమె మెల్లమెల్లగా నా మొహం మీదికి వంగి, నా పెదాలను, గడ్డాన్ని దాటి, నా గుండెమీద తన మొహాన్ని వుంచింది. కాస్త ఆగింది. ఆమె తన పళ్ళను, పెదాలను తడుపుకుంటున్న చప్పుడు వినగలుగుతున్నాను.

నా మెడదగ్గర ఆమె వేడి ఊపిరి అనుభవిస్తున్నాను. ఆమె స్పర్శకు ఒళ్ళు జలదరిస్తోంది. ఆమె వణుకుతున్న పెదాలు నా గుండెమీద నిలిచాయి. ఆమె రెండు కోరలు నా గుండెకు తగిలాయి. నేను కళ్ళు మూసుకున్నాను, తీయని బాధతో ఎదురుచూస్తూ. గుండె వేగంగా కొట్టుకుంటోంది.

అదే సమయంలో మెరుపులాంటి కదలిక నాలో కలిగింది. స్పృహలోకి వచ్చాను. డ్రాకులా కోపంతో నిలబడ్డాడు. నేను బాగా కళ్ళు తెరిచి చూసాను. అతని బలమైన చెయ్యి నా మీద వంగిన అమ్మాయి మెడను పట్టుకుని లేవనెత్తి వెనక్కి లాగింది. ఆమె కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. తెల్లటి పళ్ళు పటపటలాడాయి. బుగ్గలు మోహంతో మండుతున్నాయి. కానీ డ్రాకులా! ఊహించని విధంగా మండిపోతూ కనిపించాడు. అతని కళ్ళు నిప్పులు కురిపిస్తున్నాయి, అతని మొహం చచ్చేంతలా పాలిపోయింది. నరాలు బయటకు కనిపించాయి. అతని కనుబొమలు ముడుచుకున్నాయి. తన చేతిలోని అమ్మాయిని దూరంగా విసిరేసాడు. మిగతా ఇద్దరి దగ్గరి కెళ్ళాడు, కొడదామనుకున్నట్లుగా. అతని చర్య, దారిలో తోడేళ్ళను అదిలించినట్టుగా అనిపించింది. గుసగుసలాడినట్టు నెమ్మదిగా అన్న అతని మాటలు వినిపించినయి :

'అతన్ని తాకేంత ధైర్యమా మీకు? నాకు తెలియకుండా, మీరు అతనిమీద కన్ను వేయడమా ? ఇక్కడ్నించి పొండి, ముందు. ఇతను నా వాడు. అతని జోలికి వెళ్లారంటే, మీ పని పడతా' అన్నాడు. దానికి అమ్మాయి నవ్వింది.

'నీ మీద నీకే ప్రేమలేదు. నీకు ప్రేమించడం చేతకాదు!' అంది. ఆమెతోపాటు మిగతా ఇద్దరూ కలిసి, వికటంగా నవ్వారు, ఆ గది దద్దరిల్లేటట్టుగా. నాకు స్పృహ తప్పేనంత పని అయింది. డ్రాకులా నన్ను చూస్తూ నెమ్మదిగా అన్నాడు 'నేనూ ప్రేమించగలను. ఎట్లా ప్రేమించాలో నాకు చెప్పనక్కర్లేదు. అతనితో నా పని అయిన తర్వాత, అతన్ని మీరు ముద్దు పెట్టుకో వచ్చని మాట ఇస్తున్నాను. కానీ ఇప్పుడు వెళ్ళిపొండి. నేను అతనికి స్పృహ తెప్పించాలి. అతనితో చాలా పనివుంది!' అన్నాడు.

'అయితే ఇవాళ్టికి మాకేం లేదా ?' అడిగింది ఒకతి, మెల్లగా నవ్వుతూ, మూలగా నేలమీద పడివున్న సంచి నొకదాన్ని చూపిస్తూ.



ఆ సంచి మెల్లగా కదుల్తోంది, ఏదో ప్రాణమున్నట్టు. అతను తలవూపాడు 'వుంది' అన్నట్టు. ఒకామె ఆ సంచీ దగ్గరకు గెంతి దాన్ని తెరిచింది. పసిపాప పన్నటి రోదనలాంటి శబ్దం వినపడింది నా చెవులకు. నాకు భయంతో ముచ్చెమటలు పోసినాయి. నేను చూసేలోగా వాళ్ళు అదృశ్యమయ్యారు, సంచీతో సహా. వాళ్ళు ఏదైనా తలుపుద్వారా వెళ్ళినట్టు తోచలేదు. కిటికీలోంచి వెన్నెల్లోకి మాయమయినట్టు అనిపించింది. అతి భయంకరమైన ఈ సంఘటనకు నేను స్పృహతప్పి పడిపోయాను.

* * *

పక్కమీదనించి లేచాను. క్రితం రాత్రి జరిగినదంతా నిజమే అయితే, నేనిక్కడకు ఎలా వచ్చాను ? డ్రాకులా ఎత్తుకునివచ్చి వుంటాడు. అసలు అది కలో నిజమో అర్థం కాలేదు. నా బట్టలు కుప్పకింద పడేయడం వల్ల బాగా నలిగివున్నాయి. అది నా అలవాటు కాదు. నేను నిద్రపోయే ముందు నా గడియారానికి 'కీ' ఇస్తాను. కానీ, దానికి 'కీ' ఇచ్చిలేదు. ఇట్లా చాలా విషయాలు సాక్షిగా నిలిచాయి, రాత్రి జరిగినదంతా కల కాదని చెప్పడానికి. కానీ వీటిని లెక్కలోకి తీసుకోకూడదనిపించింది. ఈమధ్య నా బుర్ర సరిగా వుండడం లేదుకదా. కాబట్టి సరైన ఆధారంకోసం వేచి చూడాల్సిందే. ఒక విషయం మాత్రం సంతోషాన్ని కలగజేసింది. నయం, డ్రాకులా నన్ను ఇక్కడికి తీసుకొచ్చి నా బట్టలు విప్పిన తర్వాత నా జేబులు వెతకలేదు. నా డైరీ చూసాడో లేదోగాని, చూసినా

అర్థమయ్యేదేది కాదు (షార్టుహేండులో రాయడం వల్ల). అర్థమయితే వూరుకునే వాడు కాదు, దాన్ని నాశనంచేసి పారేసేవాడు. నా గదిలో చుట్టూ చూసాను. రాత్రి ఆ ఆడవాళ్ళు, నా రక్తం పీల్చడానికి ఎదురు చూస్తూవున్న రాత్రి— అంత భయంకర వాతావరణం లేదు ఇప్పుడు.

మే 18 : మళ్ళీ ఆ క్రింద గదిలోకి వెళ్ళి చూద్దామనుకున్నాను. ఎందుకంటే నిజ మేమిటో తెలుసుకోవాలి కదా ! నేను మెట్ల దగ్గరి కెళ్ళేసరికి, అక్కడ దారి తలుపులు మూసి వున్నాయి. అది చాలా బలవంతంగా మూసివేసినట్లు అక్కడ పరీక్షగా చూస్తే తెలిసింది. బయట తాళం వేసి లేదుగానీ, లోపల బిగించినట్టు కనపడింది. అయితే రాత్రి జరిగింది కలకాదని తెలుస్తోంది.

మే 19 : నేను నిస్సందేహంగా కష్టాల్లో ఇరుక్కున్నాను. క్రితం రాత్రి డ్రాకులా నన్ను మూడు ఉత్తరాలు వ్రాయమని ఎంతో సౌమ్యంగా అడిగాడు. ఒకటి నా పని దాదాపు అయిపోయినట్టు. రెండోది, నేను మరునాడు (రెండో ఉత్తరానికి మరునాడు) బయలుదేరి వస్తున్నట్టు, మూడోది, నేను కోట వదిలి, బిస్ట్రిట్జ్‌కు వచ్చినట్టు. ఏవీ జరగకుండా ఈ ఉత్తరాలు ఎట్లా రాయడం ? అతనితో పోట్లాడదామనుకున్నాగానీ, అతని ఆధీనంలో వున్న నేను ఎట్లా పోరాడగలను ? నేనుగనుక అతని మాట వినకపోతే, అతనికి అనుమానం వచ్చి ఉగ్రుడైపోతాడు. నాకు ఇక్కడి

## జీవన్మృతులు

విషయాలు చాలా తెలుసునని అతనికి తెలుసు. అందుకని బ్రతకనివ్వడు. నేను అతనికి ప్రమాదకారి కాదని అతను అనుకోవాలి. ఆ అవకాశం కోసం వేచి వుండాలి. నేను తప్పించుకుని వెళ్ళే మార్గం ఏదో ఒకటి తగలొచ్చు. అతని కళ్ళు చూసాను. రాత్రి ఆ అమ్మాయిని చేత్తో విసిరేసినప్పుడు వున్న కోపపు ఛాయలు కనిపించాయి. ఇక్కడ్నించి పోస్టు సరిగా వెళ్లదని, అందువల్ల ఉత్తరాలు ఒక్కసారే రాస్తే, నా మిత్రులు నా గురించి ఆందోళన చెందరని చెప్పాడు. రెండు మూడు ఉత్తరాలను సరయిన వేళలో పోస్టుచేస్తానని చెప్పాడు. అదంతా నమ్మకుండా అతన్ని ఎట్లా ఎదిరించడం ? కాబట్టి అతను చెప్పినట్టు వింటున్నట్లుగా నటించాల్సిందే. అందుకే ఉత్తరాలమీద ఏయే తారీకులు వెయ్యాలని అడిగాను మొదటి ఉత్తరంమీద జూన్ 12, రెండోదానిమీద జూన్ 19, మూడోదానిమీద జూన్ 29' వెయ్యమని చెప్పాడు.

అంటే, నా జీవిత కాలం ఎంతవరకో తెలిసింది. ఓ దేవుడా, నన్ను రక్షించు !

మే, 28 : బయటకు పారిపోవడానికి అవకాశం లేకపోయినా, కనీసం ఒక మాట చేరవేయడానికి అవకాశం వచ్చింది. కోట క్రింద ఆవరణలో 'జ్గానీ' తెగవారు కొంత మంది మజిలీ చేసారు. వాళ్ళు జిప్సీల్లాంటి దేశదిమ్మరులు. వాళ్ల గురించి నేను ఇంతకు ముందు రాసుకుని వుంచాను. ఈ తెగ ఒక ప్రత్యేకమైనది. ఈ తెగవారు హంగిరీలోనూ, ట్రాన్సిల్వేనియాలోను ఎక్కువ. వీళ్ళు ఏ చట్టం పరిధిలోకి రారు. ఎవరో ఒకర్ని తమ ప్రభువుగా భావించుకుని అతని మాటే వింటారు. వాళ్ళు నిర్భీతులు. మతం అంటూ తెలీదుగానీ, మూఢ నమ్మకాలు మాత్రం వున్నాయి. వాళ్ల 'రోమనీ' భాషలో రకరకాలుగా మాట్లాడుకుంటారు.

నేను కొన్ని ఉత్తరాలు ఇంటికి వ్రాసి, ఎట్లాగైనా పోస్టు చెయ్యాలనుకున్నాను కిటికీ దగ్గర నిలబడి వాళ్లతో చనువుగా మాట్లాడాను. వాళ్ల టోపీలు తీసి ఏవేవో సైగలు చేసారుగానీ, వాళ్ల భాషకన్నా నాకెక్కువ అర్థంకాలేదు.

మీనాకు షార్టుహేండులో ఉత్తరం వ్రాసాను. విషయాలు మీనాను అడుగు అంటూ హాకిన్స్‌కు రాసాను. మీనాకు నా పరిస్థితి పూర్తిగా వివరించాను, ఎక్కువగా భయపడే విషయాలు రాయకుండా. నిజంగా ఇక్కడ విషయాలు వున్నదున్నట్టు రాస్తే, మీనా చచ్చేంత భయపడుతుంది. ఉత్తరాలు ఎక్కువసేపు నా దగ్గరుంటే ప్రమాదం. అందుకని వాటిని కిటికీ వూచలగుండా, వాళ్లకు అందేట్టు విసిరేసాను. దానితోపాటు ఓ బంగారు నాణెం కూడా వేసాను. ఉత్తరాలు పోస్టు చెయ్యమని సైగలు చేసాను. ఉత్తరాలు తీసుకున్న వ్యక్తి వాటిని గుండెలకు హత్తుకుని తలవంచాడు తర్వాత వాటిని కనపడకుండా తలమీద టోపి క్రింద పెట్టాడు. నా పని నేను చేసేసాను. వెంటనే పుస్తకాల గదిలోకి వచ్చి చదవడం మొదలెట్టాను. డ్రాకులా రాలేదు, అందువల్ల జరిగినదంతా పుస్తకంలో రాసుకున్నాను...

డ్రాకులా వచ్చాడు. నా పక్కన కూర్చుని రెండు ఉత్తరాలను తెరిచి, ఎంతో సౌమ్యంగా మాట్లాడాడు.

"ఈ ఉత్తరాలు జ్గానీ ఇచ్చాడు. అతని దగ్గరికి ఎప్పుడు వచ్చాయో తెలీదుగానీ, జాగ్రత్తచేసి తీసుకొచ్చాను. ఒక ఉత్తరం నువు నా మిత్రుడు హాకిన్స్‌కు రాసింది. రెండోది ..." రెండో కవరు తెరిచి అందు లోంచి కాగితం తీసాడు. దానిమీద అన్నీ వింత చిహ్నాలు గమనించి నా వంక క్రూరంగా చూసాడు. 'ఇది చాలా మిత్రద్రోహం. అతిథి

రేఖా బాల నాట్యమండలి (విజయవాడ) వారు ఇటీవల విజయవాడలోని శ్రీ వరద వినాయక భక్తజన సభ ఆధ్వర్యంలో "శ్రీకృష్ణ రాయబారం" నాటకం ప్రదర్శించిన సందర్భంగా అందులో పాల్గొన్న బాలబాలికలని చిత్రంలో చూడవచ్చు.



# ఆనందమయ జీవితానికి ఆరు మార్గాలు



## ★ రాష్ట్ర వైద్య, ఆరోగ్యశాఖ అందిస్తున్న సేవా కార్యక్రమాలు. ★

**మాతా శిశు సంరక్షణ :—** తల్లీ బిడ్డలు ఆరోగ్యంగా ఉన్నప్పుడే కుటుంబాలు ఆనందంతో కళకళలాడుతాయి. నేడు కుటుంబ నియంత్రణ, సంక్షేమ కార్యక్రమాలలో మాతా శిశు ఆరోగ్య పరిరక్షణకు అధిక ప్రాధాన్యం లభిస్తున్నది. పసిపిల్లలను, వివిధ వ్యాధుల బారి నుంచి కాపాడడానికి రోగ నిరోధక చర్యలు అమలు జరుగుతున్నాయి. గర్భిణిస్త్రీల, బాలింతల, పసిపిల్లల తల్లుల ఆరోగ్య పరిరక్షణకు సదుపాయాలున్నాయి. ఇది ప్రధాని ఇరవయి సూత్రాల కార్యక్రమంలో ప్రాధాన్యం వహిస్తున్నది.

**వైద్య చికిత్స :—** గ్రామస్థాయినుంచిపట్టణస్థాయివరకు ప్రజలందరికి వైద్య-చికిత్స సౌకర్యాల కోసం ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, తాలుకా ఆసుపత్రులు, జిల్లా ఆసుపత్రులు, వైద్య కళాశాలల ఆసుపత్రులు, జనరల్ ఆసుపత్రులున్నాయి.

**వ్యాధి నిరోధక చర్యలు:—** మశూచి వంటి భయంకర వ్యాధిని మనం నిర్మూలించగలిగాం. కుష్టు, క్షయ, మలేరియా, అంధత్వం తదితర వ్యాధుల నిరోధానికి పెద్దయెత్తున చర్యలు తీసుకుంటున్నారు. వ్యాధులను నిరోధించి, 2 వేల సంవత్సరం నాటికి అందరికి ఆరోగ్యం కల్పించాలన్నది మన లక్ష్యం. ప్రధాని ఇరవయి సూత్రాల నూతన పథకంలో వ్యాధి నిరోధక చర్యలను ప్రాధాన్యం లభించింది.

**పోషక ఆహారం :—** పోషక ఆహారం లేమివల్ల ఏర్పడే లోపాన్ని దూరం చేయడానికి తల్లులను, పిల్లలకు బలవర్ధకమైన 'సొరస్ పోలిక్ ఆసిడ్' మాత్రలను కుటుంబ సంక్షేమ కార్యక్రమంలో భాగంగా పంపిణీ చేయడం జరుగుతున్నది. పోషక ఆహార సదుపాయానికి గూడ ప్రధాని ఇరవయి సూత్రాల కార్యక్రమం ప్రాముఖ్యం ఇచ్చింది.

**పరిమిత కుటుంబం :—** జనాభా విపరీతమైన పెరుగుదలను నిరోధించి, దేశోభ్యుదయాన్ని సాధించి, ప్రతి కుటుంబాన్ని ఒక పచ్చ తోరణంగా రూపొందించడానికే పరిమిత కుటుంబం. పరిమిత కుటుంబంలోనే సంక్షేమం ఇమిడి ఉంది. పరిమిత కుటుంబం కోసం ప్రభుత్వం కుటుంబ నియంత్రణ సౌకర్యాలను (తాత్కాలిక, శాశ్వత విధానాలను), ఉచితంగా కల్పిస్తున్నది. కుటుంబ నియంత్రణ కార్యక్రమాన్ని ప్రజా ఉద్యమంగా రూపొందించాలని ప్రధాని ఇరవయి సూత్రాల నూతన కార్యక్రమం ఉద్బోధిస్తున్నది.

**ఆరోగ్య విస్తరణ విద్య:—** దేశ ప్రజలకు, విశేషించి కార్యకర్తలకు వివిధ వైద్య, ఆరోగ్య, కుటుంబ నియంత్రణ, సంక్షేమ కార్యక్రమాల సందేశాన్ని అందించడంలో, ఈ కార్యక్రమాల అవసరాన్ని, ప్రాధాన్యాన్ని తెలియజెప్పడంలో ఈ కార్యక్రమాలు కల్పిస్తున్న సౌకర్యాల గురించి వివరించడంలో ఆరోగ్య విస్తరణ విద్య కీలకపాత్ర నిర్వహిస్తున్నది. కుటుంబ సంక్షేమ విధానాలను గురించి, ఆరోగ్య విధానాల గురించి స్థానిక నాయకులకు, ప్రజా ప్రతినిధులకు, సమాజ సేవకులకు తెలియ జెప్పడానికి శిక్షణ శిబిరాలు నిర్వహించబడుతున్నాయి. అజ్ఞానాన్ని, అనారోగ్యాన్ని దూరం చేయడమే ఆరోగ్య విస్తరణ విద్య ప్రధాన ఆశయం.

**రాష్ట్ర కుటుంబ సంక్షేమశాఖ ఆంధ్రప్రదేశ్ హైదరాబాద్**

చెయ్యవలసిన పనికాదు. దీనిమీద సంతకం లేదు, కాబట్టి దీన్ని అంతగా పట్టించుకోను' అంటూ ఆ ఉత్తరాన్ని దీపానికంటించి బూడిద చేసాడు.

'హాకిన్స్‌కు మీరు రాసిన ఉత్తరం పంపుతాను. మీ ఉత్తరాలు నాకు చాలా పవిత్రమైనవి! క్షమించాలి. మీ ఉత్తరం కవరు అనుకోకుండా చించాను. మళ్ళీ అంటిస్తారా?' అంటూ మరొక కొత్త కవరు ఇచ్చాడు. మళ్ళీ రాసి అతనికిచ్చేసాను. గది బయటకెళ్ళిపోయాడు. బయట తాళం వేసిన చప్పుడయింది. ఓ నిముషం తర్వాత తలుపు దగ్గరికెళ్ళి లాగి చూసాను. తాళం వేసివుంది.

గంటకో, రెండు గంటల తర్వాతనో, డ్రాకులా మళ్ళీ నా గదిలోకి మెల్లగా వచ్చాడు. సోఫాలో నిద్రపోతున్న నన్ను లేపాడు. అతని చర్యలలో ఎంతో నెమ్మదితనం కనిపిస్తుంది. నేను నిద్రపోతూ వుండడం చూసి 'మీరు బాగా అలసిపోయినట్టున్నారు. సరే పడుకోండి. హాయిగా పడుకోండి. ఇవాళ రాత్రి మీతో మాట్లాడుతూ సంతోషంగా గడిపే అవకాశంలేదు. బోళ్ళన్ని పనులున్నాయి. మీరు దయచేసి నిద్రపొండి' అన్నాడు. నేను నా పడక గదిలోకి వెళ్ళాను. నిద్రలో మునిగిపోయాను. ఆశ్చర్యం ఏవిటంటే, ఒక్క కల రాలేదు. నిరాశలో కూడా కొంత ప్రశాంతత వుంటుంది!

మే 31: ఉదయం నిద్రలేచాను. నా సంచీలో నుంచి కొన్ని కాగితాలు, కవర్లు తీసుకుని నా జేబులో పెట్టుకుందామనుకున్నాను. ఎందుకంటే, అవకాశం వచ్చినప్పుడు వెంటనే ఉత్తరం రాసుకోవచ్చు, కానీ జరిగింది చూసి నిశ్చేష్టుడనయ్యాను.

నా సంచీ మాయమయింది. అందులో నేను రాసిన కాగితాలు, రైలు ప్రయాణానికి సంబంధించిన కొన్ని ఉత్తరాలు, నాకు అరువు దొరికే సౌకర్యం ఉన్న ఉత్తరాలు, నేను కోట దాటి బయటికెళితే పనికొచ్చేవన్నీ వున్నాయి. కాసేపు కూర్చున్నాను. తర్వాత అటూ ఇటూ తిరిగాను. వెంటనే ఒక ఆలోచన వచ్చింది. వెంటనే నా పెట్టె, బట్టలు పెట్టిన చోటు చూసాను. నేను ప్రయాణం చేసినప్పుడు వేసుకున్న సూట్ కనపడలేదు. దుప్పటి, ఓవర్ కోటు కూడా కనపడలేదు. ఎక్కడున్నాయో అంతుపట్టలేదు. ఇదంతా బహుశా డ్రాకులా ...

# జీవన్ మృతులు

జూన్ 17: ఉదయం. బుర్ర బద్దలు కొట్టుకుంటూ మంచం చివర కూర్చున్నాను. కోట ఆవరణలో రాతి మార్గంమీద గుర్రపు డెక్కల చప్పుడు, వినవచ్చింది. సంతోషంతో కిటికీ దగ్గరకు పరుగెట్టాను. అవి రెండు పెద్ద పెద్ద గుర్రపు బగ్గీలు. ఒక్కో బగ్గీకి, ఎనిమిదేసి గుర్రాలున్నాయి. అవి నడుపుతున్న వాళ్ళు స్లోవాక్ తెగవారు. వాళ్ళ టోపీ వెడల్పుగా వుంది. నాడాలతో నిండిన బెల్టు నడుంకి బిగించారు. పెద్ద బూట్లు వేసుకుని వున్నారు. చేతుల్లో పొడుగాటి బద్దలున్నాయి (బెత్తాలు). నేను గబగబా క్రిందికి పరుగెత్తాను పెద్ద హాలులోకి. అక్కడ తలుపు తీసి బయటకు పరుగెత్తి వాళ్లను కలుసుకుందామనుకున్నాను. వాళ్లకోసం తలుపు తెరుద్దామని తీస్తే అవి రాలేదు. నిశ్చేష్టుడయ్యాను. తలుపులు బయట బిగించి వున్నాయి.

మళ్ళీ కిటికీ దగ్గరకు పరుగెత్తి వాళ్ళ కోసం అరిచాను. వాళ్ళు నన్ను చూసారు. అప్పుడు 'జ్గానీ' పెద్దవాడు బయటకు వచ్చి, వాళ్ళకు నన్ను చూపించి ఏదో అన్నాడు. వాళ్ళు నన్ను చూసి నవ్వారు. వాళ్ళు నా పరిస్థితి గమనించే స్థితిలో లేరు. బళ్ళలో పెద్ద ఖాళీ పెట్టెలను తెచ్చారు. అవి పట్టుకోడానికి వీలుగా తాళ్లలో కట్టివున్నాయి. స్లోవాక్స్ వాటిని దించారు. అవన్నీ ఆవరణలో ఒక మూలగా పేర్చారు. 'జ్గానీ' స్లోవాక్‌లకు డబ్బు ఇచ్చాడు వాళ్ళు దానిమీద నోటి తుప్పరతో తడి చేసారు. అట్లా చేస్తే అదృష్టంట. వాళ్ళు బళ్లను మళ్లా వెనక్కు తోలుకుంటూ వెళ్లిపోయారు.

జూన్ 24: ఉదయానికి ముందు: రాత్రి డ్రాకులా నా దగ్గర్నుంచి తొందరగా తన గదిలోకి వెళ్ళి తలుపులు బిగించుకున్నాడు. నేను గబగబా మెట్ల దగ్గరకు పరుగెత్తాను. దక్షిణ కిటికీలోంచి బయటకు చూసాను, డ్రాకులా కోసం. 'జ్గానీ' వాళ్ళ కోటలో పనిచేస్తున్న శబ్దం వినపడుతోంది — గొడ్డలి, పార, లాంటి వస్తువుల చప్పుళ్ళు. ఏదో క్రూరమైన పని కప్పిపుచ్చుతున్నారనుకుంటాను.

దాదాపు అర్ధగంటసేపు కిటికీ దగ్గర వున్న తర్వాత డ్రాకులా గది కిటికీలోంచి ఏదో బయటికి రావడం గమనించాను. నేను కనపడకుండా కొద్దిగా వెనక్కి వచ్చి జాగ్రత్తగా చూడ్డం మొదలెట్టాను. అతను డ్రాకులా! నేను ఇక్కడకు ప్రయాణం చేసినప్పుడు వేసుకున్న నా బట్టలే అతను వేసుకున్నాడు! అది చూసి నిశ్చేష్టుడనయ్యాను. అతని భుజాన ఒక సంచీ వుంది. ఆ రోజున ఆ గదిలో డ్రాకులా ఆడవాళ్లకు ఇచ్చిన సంచీ లాంటిది అది. అతను చెయ్యబోయే పని అర్థమయ్యింది. ఇదో కొత్తరకం దుష్టచర్య. అతను నా బట్టలతో బయట తిరిగి, నా ఉత్తరాలు పోస్టు చేస్తాడు. వూళ్ళోవాళ్ళు అది నేనే అనుకుంటారు. అతను ఏదైనా క్రూరమైన పనిచేస్తే, అది కూడా నేనే చేసినట్టు అనుకుంటారు.

నేనిక్కడ బందీగా ఈ గోడల మధ్య వుంటే అతను ఇవన్నీ చేస్తూ వుండడం నాకు కోపాన్ని తెప్పించింది. కానీ చేసేదేముంది? నాకు ఎటువంటి రక్షణ లేకుండా పోతోంది.

డ్రాకులా కోసం ఎదురు చూస్తూ కిటికీ దగ్గరే వుండిపోయాను, చాలాసేపు. వెన్నెల వెలుగులో ఏదో పొడి గాల్లో చూసాను ఆకాశంలో చల్లిన ధాన్యపు పిండిలా వుంది— అస్పష్టంగా. నేను నా బాధ మరచి దాన్ని చూడడం మొదలెట్టాను. ఫిరంగులు కాల్చే రంధ్రం దగ్గర కాస్త సుఖంగా వెనక్కి వాలి ఆకాశంలోకి బాగా చూడసాగాను.

వెంటనే మళ్ళీ లేచి సరిగ్గా నిలబడ్డాను ఎక్కడో దూరంగా లోయలో, కుక్క అరుపు ఒకటి దీనంగా వినిపించింది. ఆ శబ్దం ఎక్కువ కాజొచ్చింది. రోదన ఎక్కువ అవుతున్నకొద్దీ, ఇందాక చూసిన గాలిలోని దుమ్ము రోదన కనుగుణంగా వెన్నెలవెలుగులో నాట్యం చేస్తున్నట్టు కనిపించింది. నేను నిద్రలోంచి మేల్కొంటున్నట్టుగా లేచాను. నాకు బాగా మగతగా వుంది. ఏదో చెయ్యాలనే ప్రయత్నం! కానీ చెయ్యలేక పోవడం. నా మనస్సు నా స్వాధీనంలో లేదు. దుమ్ము నాట్యంలో వేగం పెరిగింది. వెన్నెల కిరణాలు చూసి వణికిపోతున్నట్టు అనిపించింది. ఆ దుమ్ము కణాలు బాగా దగ్గరయి దయ్యం రూపం దాల్చాయి. అది చూడగానే నా మగత పూర్తిగా వదిలింది. వెంటనే అరుస్తూ అక్కడ్నించి పరుగెట్టాను.

**(ఇంకా వుంది)**

# ఆసియా క్రీడలు



















PRASAD



# భేతాళుడు మరచిన మరొకథ

— ‘రాధ’



“డాక్టర్ అంటే మంత్రగాడు కాదు, దేముడు అంతకంటే కాదు అద్భుతాలుచేసి చూపించటానికి ... పోయే ప్రాణాన్ని వెనక్కి లాగటానికి ప్రయత్నిస్తాడేకాని మెడకి త్రాడువేసి మేకపిల్లని కట్టిపడేసినట్లు ప్రాణాన్ని కట్టిపడేయలేదు సుమా... ఆ సమయం వస్తే ఎన్ని సంకెళ్ళయినా త్రెంచుకు పోతుంది ఆరే ప్రాణం ... ఎవరు ఆపగలరు చెప్పండి దాన్ని.”

పది మనుషుల బరువు మోస్తున్న ఒక ఆంగ్లేయ భారీవిగ్రహం ఆ వేద వాక్కులు శలవిచ్చి విరగబడి నవ్వింది.

“బాగా చెప్పారు ... వాస్తవానికి ఈ డాక్టర్లు ఏమీచేయలేరనే చెప్పాలి. గుండె లోతులు కనిపెట్టటానికి ఎన్నెన్నో యంత్రాలు కనిపెట్టారు. గుండెల్లోకి గొట్టాలు పంపి ఏ కవాటం ఎలా తెరుచుకుంటుందో చూస్తున్నారు. క్రమం తప్పితే కంప్యూటరుపెట్టి గుండెనే కొట్టిస్తున్నారు వాళ్ళకి నచ్చిన విధంగా. మనిషిని బ్రతికిస్తానికే అనుకోండి యిదంతా. కాని ఏం లాభం ? మనిషి శాశ్వతంగా అలా వుండిపోగలుగుతున్నాడా పుట్టాక. బాల్యం, యవ్వనం, ముసలితనం క్రమం తప్పకుండా వాటంతట అవి రావటం మానేశాయా చెప్పండి? మనిషి ఎప్పటిలా ఈ తనువు చాలిస్తూనేవున్నాడు అందులో ఏమీ మార్పులేదు ... మార్పురాదు” తోటి దొర వంతపాడాడు చదువుతున్న పేపరు మూసి.

“మీరు గుర్తించారో లేదోకాని మానవుడి సుఖం కోసం నానాకష్టాలుపడి వేలకువేలు నోరులేని జీవాల్ని ప్రయోగాల పేరిట బలిచేసి ఏదో సాధించామని అబ్బుర పడుతున్నారేకాని. ఈ డాక్టర్లు మాత్రం

వాళ్ళకోసం ఏం మిగుల్చుకుంటున్నారు చెప్పండి.''

నట్టేటిలో వున్నా చలాకీగా ఈది తేలగల నవ్వుట్లు పొంగిపొరలుతున్నాయి నడివయసులో వున్న ఆ దొరసాని అందాలు ఆమె మాటలతోపాటు.

''సర్లేండి కసాయివాడిచేయి కత్తికి...వైద్యుడి విజ్ఞానం మనకి అంకితం అయ్యాక వాళ్ళకి విశ్రాంతి ఎక్కడ వుంటుంది. మన ఆశలికి అంతు ఎక్కడ వుంటుంది'' యవ్వనం దాటి పరుగులు తీస్తున్న యింకో ఆంగ్లేయుడు ఆక్షేపించాడు.

''అది నిజమేనా'' నా వూహాల్లో ఆ ప్రశ్న మారుమ్రోగటంలో ఏమీ ఆశ్చర్యం లేదేమో ఆ సమయంలో.

ముందు సీట్లో కూర్చుని ఆ నలుగురి ఆంగ్లేయుల సంభాషణ వింటున్నాను ఆసక్తిగా. లండన్ నుంచి లివర్‌పూల్ పరుగెడ్తోంది మేము ఎక్కిన ఆ రైలు నూరుమైళ్ళ వేగంతో నా ఆలోచనలతో పోటీపడ్తూ!

ఆ భారీ విగ్రహం అన్న మాటల్లో నిజం లేకపోలేదు. ఆ నిజం ఏమిటో చెప్పాలంటే మీకు ఓ కథ చెప్పాలి మరి.

నేను యింగ్లాండ్ వచ్చిన రెండు సంవత్సరాలకే న్యూ కేజల్ జనరల్ హాస్పిటల్‌లో మెడికల్ రిజిస్ట్రార్ అవ్వగలిగాను. అదృష్టవశాత్తూ అనుకోకుండా మెంబర్‌షిప్ పరీక్షలు పాసవ్వటమే అసలు కారణం అయివుండొచ్చు నా విషయంలో.

ఆంగ్లేయులు ఎన్నో విషయాల్లో ఎంతో ముందుకు వచ్చారుకాని స్వార్థంలో, తమ పరభేదాలు చూపించటంలో యింకా భారతదేశాన్ని పాలిస్తున్న రోజుల్లోనే వుండిపోయారు అనిపిస్తుంది ఒకోసారి. ఏదైనా పెద్ద పదవినికాని, ప్రతిభనికాని ఒక భారతీయుడి చేతిలో పెట్టేముందు పదిసార్లు ఆలోచిస్తాడు ఆంగ్లేయుడు. దానికి కారణాలు అనేకం వున్నా జాతి మత వివక్షతతో భారతీయుడ్ని వేరుపరచటం, వెలివేయటం ఒకటి అని అందరూ అంటుంటే విన్నాను. కాని నాకు సంబంధించినంత వరకూ అది ఒక అద్భుతమనే చెప్పాలి. పిచ్చికాని అరిచే కుక్క కరుస్తుందా, కరిచే కుక్క అరుస్తుందా క్రమం తప్పకుండా?

అసలు కథకి వద్దాం.

ఆ రోజు నేను డ్యూటీ చేస్తున్నాను. రాత్రి తొమ్మిది గంటలు దాటింది. డాక్టర్ల కామన్ రూమ్‌లో కూర్చుని టి. వి. లో వస్తున్న అమెరికన్ సీరీస్ చూస్తున్నాను.

నా బ్లీప్ మ్రోగింది.

''రింగ్ కేజుయాల్టీ ప్లీజ్'' అందాల కేరల్ గొంతుక నాజూకుగా వినిపించింది ఫోన్‌లో.

''డాక్టర్ రాజేష్ స్పీకింగ్'' అంటూ మళ్ళీ ఫోన్ ఎత్తి రింగ్ చేశాను.

''యి. సి. జి. చూసి ఒపీనియన్ చెప్తారా... పేషెంట్ గుండె నొప్పితో వచ్చింది.'' అన్నాడు కేజుయాలిటీ హౌస్ ఆఫీసర్.

పరుగెత్తాను అటువైపు.

ఆ ట్రేసింగు చూసి ఎంత ఆశ్చర్యపడ్డానో అంతకంటే ఎక్కువగా దిగ్భ్రమచెందాను ఆ నవ యవ్వన యువతిని చూసి. ఆమె పేషెంట్ అంటే నమ్మశక్యం కాలేదు పలకరించేవరకూ.

''యిప్పుడు ఎలా వుంది మీకు'' అని అడిగాను ఆంగ్లంలో నన్ను నేను పరిచయం చేసుకుంటూ

''అయి థింక్ అయామ్ ఆల్‌రైట్... బట్ లిటిల్ పెయిన్ దేర్'' అంది వీణ మీటినట్లు తియ్యని కంఠానికి శృతి పెడుతూ.

''మిస్ పామర్'' కేస్‌షీటు చూసి పేరు తెలుసుకున్నాను.

''తెరీసా అని పిలవండి ఫర్వాలేదు'' అంత బాధలో కూడా అంత అందమైన ముసిముసి నవ్వులు పూల జల్లులా ఎలా వెదజల్ల గలిగిందా ఆ ఆంగ్లేయ యువతి ! అనిపించింది.

''ష్యూర్... థ్యాంక్యూ... చూడండి తెరీసా మీరు కాస్సేపు ఓపికపడితే అంతా సర్దుకుంటుంది నొప్పి తగ్గటానికి చిన్న యింజెక్షన్ యిస్తాను.. ప్లీజ్ వెయిట్'' అన్నాను నెమ్మదిగా.

''యింజెక్షన్ యిచ్చి తీరాలా... నాకు నీడిల్స్ అంటే చాలా భయం.''

''డోంట్ వర్రీ...నొప్పిలేకుండా యిస్తాను...''

''ఆల్‌రైట్...''

''మీ వయసు యిరవై ఆరు సంవత్సరాలా, నిజమేనా.''

నా కళ్ళల్లో ఆశ్చర్యం కొట్టవచ్చినట్లు కనిపించి వుంటుంది. తెరీసా ఫక్కున నవ్వింది.

''ఏ అలా కనిపించటంలేదా.''

''యవ్వనం వయసు తెలుసుకోటం చాలా కష్టమే మరి'' మాటల్ని అడ్డు పెట్టుకున్నాను, కంగారు కప్పిపుచ్చుకోటానికి.

''ఏమీ కంగారు పడకండి. అది నా అసలైన యవ్వనం వయసే.''

ఎందుకో నా వైపు గుచ్చిగుచ్చి చూసింది నాక్కి పలుకుతూ.

చూపులు త్రిప్పుకోటం నావంతు అయ్యింది.

''చూడండి మిస్ పామర్... యిదొకరకమైన గుండెపోటు... యింత చిన్న వయసులో మీకు అది రావటం చాలా చిత్రంగా వుంది...మీరు హాస్పిటల్‌లో కొన్నాళ్ళు వుంటే అన్ని పరీక్షలుచేసి కారణం తెలుసు కోటానికి ప్రయత్నిద్దాం...'' అన్నాను.

''బ్రతుకుతానుకదా కొన్ని రోజులు'' మాటల్లో అలజడిని కళ్ళల్లో కురిసే నవ్వులతో కొట్టిపారేయ టానికి ప్రయత్నించింది.

''నోనో...మీ ప్రాణానికి ఎటువంటి ప్రమాదం లేదు... నేను హామీ యిస్తున్నాను సరేనా . '' సున్నితంగా సుడిగుండాల్ని తప్పించటానికి ప్రయత్నించాను.

''మీమీద నాకు నమ్మకం వుంది'' ఎర్రని పెదిమలమీద చిరునవ్వు విరబూసిన మందారాల్ని మరిపించింది.

'యింత అందమైన ఈ అబలకి ఈ జబ్బేమిటి పరమాత్మా' అంది పిరికి గుండె.

''ఆల్‌రైట్... అయితే మిమ్మల్ని వెంటనే యింటెన్సివ్ కరొనరీకేర్ యూనిట్‌కి పంపించే ఏర్పాటు చేస్తాను...మీన్‌వైల్. యు ప్లీజ్ రిలాక్స్ అండ్ టేక్ యిట్ ఈజీ... విత్ యు'' సముదాయించాను

''ష్యూర్ ష్యూర్. . ఏజ్ యు విష్ డాక్టర్'' అంటూ అనుకోకుండా నా చేయి అందుకుని ఆప్యాయంగా నొక్కి వదిలింది.

ఆంగ్లేయులు కృతజ్ఞతని కొంచమైనా దాచుకోలేరు అనుకుంటూ

మర్నాడు వార్డ్ రౌండ్స్‌కి వెళ్ళేముందు తెరీసాపామర్‌ని పలకరించటానికి యింటెన్సివ్ కేర్ యూనిట్‌కి వెళ్ళాను.

''ఎలా వుంది యిప్పుడు.''

''ఓ.. అయామ్ ఒకె. నో ప్రాబ్లమ్ '' అంది చిరునవ్వుతో.

ఆధునిక వసతులలో అత్యద్భుతంగా ఏర్పాటు చేయబడ్డ అంపశయ్యమీద హాయిగా సేద తీర్చుకుంటున్న అపరదేవకన్యలా కనిపించింది తెరీసా ఆ నిముషంలో. నవయవ్వనంతో నిండి పొంగిపొరలుతున్న ఆమె లేతగుండెని ఒక యంత్రానికి అతికించి పదిమంది నర్సులు ప్రతీ క్షణం పర్యవేక్షణ సాగిస్తున్నారు ప్రక్క గదిలోంచి. గుండె కొట్టుకోటం క్రమం తప్పితే క్షణాల్లో దాన్ని సక్రమపరచటానికి ఆమె నరనరాల్లో ప్లాస్టిక్ సూదులు దిగించి అన్నింటికీ సిద్ధంగా వుంచాం.

ఆగే గుండెని ఆగకుండాచేసి నవయవ్వని ప్రాణాన్ని ప్రమాదంనుంచి తప్పించాలనే ఆ తపనంతా

''నొప్పి ఏమీ లేదుకదా.''

''నో... థేంక్స్ ఫర్ వాట్ యు హేవ్ డన్'' నాడి పరీక్షిస్తున్న నా చేయి తన చేతిలోకి తీసుకుని ఆప్యాయంగా నొక్కింది.

ఆమె కళ్ళు చిత్రంగా మెరుస్తున్నాయి.

''దట్స్ మై డ్యూటీ మిస్ పామర్...'' చిరునవ్వుతో సమయస్ఫూర్తిని ప్రదర్శించి చేయి వెనక్కు తీసుకున్నాను.

''యు ఆర్ ఎ నైస్ మేన్''

''థేంక్యూ.. ''

సంఘటల్ని చిత్రాలుగా మార్చటంలో ఆంగ్లేయులు ఎంత ఆరితేరినవారో నాకు బాగా తెలుసు. అందుకే చేతికి అందనంత దూరంలో వుండటం నేర్చుకున్నాను అన్ని విషయాల్లో.

''నేను కొన్ని ప్రశ్నలడుగుతాను చెప్తారా ?'' అన్నాను మాట మారుస్తూ.

''ఓ... ష్యూర్... మీలాంటి మగవాడు ఏది అడిగితే కాదనగలదు... ఏ ఆడదైనా...''

అందాలు త్రెంపి విరజల్లినట్లు నవ్వింది తెరీసా.

''ఆ సంగతి యింతవరకూ నాకు తెలీదే.''

''తెలిస్తే ఏంచేసి వుండేవారు...''

''దానికి సమాధానం నాకంటే మీకే బాగా తెలుసనుకుంటాను.''

''నేనే మీరైతే ఏం చేసివుండేదాన్నో తెలుసా?''

''ఏం చేసి వుండేవారట ?''

నాకు తెలుసు ఆ సంభాషణని అనవసరంగా పొడిగిస్తున్నానని. కాని అదొక రకమైన ఆకర్షణ. మగవాడికి, ఆడదానికీ మధ్య ఎప్పుడూ ఆరని చిచ్చులా రగులుకొనే కోరిక నన్ను మాటల్లోకి దింపింది ఆ క్షణం.

''కమాన్ ... ఆ మాత్రం వూహించలేరా'' తను ఒక పేషెంట్ అన్న సంగతి మర్చిపోయి వుల్లాసంగా మాట్లాడింది తెరీసా.

# భేతాళుడు మరచిన మరో కథ

''అసలు విషయం మర్చిపోతున్నారు.''

''ఏమిటది ?''

''కథ మీరు చెప్తున్నారు .. నేను వింటు న్నాను.''

క్షణకాలం నివ్వెరపోయింది తెరీసా నా మాటలకి.

''మీ యిండియన్ మగవాళ్ళు యింత తెలివిగా మాట్లాడగలరని నాకు యింతవరకూ తెలీదు సుమా'' అంది మునిపంటితో పెదవి కొరుకుతూ.

కథ చేయిజారి కాలంలోకి ప్రవహిస్తోంది అని పసిగట్టాను. నా జాగ్రత్తలో నేను వుండటం మంచిది అనిపించింది.

''ఏమిటి ఆలోచిస్తున్నారు'' నెమ్మదిగా అడిగింది తెరీసా.

''అదే నేను అసలు మిమ్మల్ని అడగాలను కున్నది ఏమిటా అని . . ''

''సేవ్ యిట్ డాక్టర్...ముందు నన్నో ప్రశ్న అడగనివ్వండి ''

ఏమిటన్నట్లు చూశాను.

''మీకు పెళ్ళి అయ్యిందా ?''

''మీరు ఆ ప్రశ్న ఎందుకు అడుగుతున్నారో తెలుసుకోవచ్చా ?''

''మీరు కంటికి ముచ్చటగా కనిపిస్తుంటేను.''

అదే తేడా హిందూ స్త్రీకి, ఆంగ్లేయ యువతికీ సిగ్గు మనకి తెర అయితే తెగింపు వాళ్ళకి తెరచాప. జీవితంలో ఎలాంటి చోటకైనా తేలికగా చేరుకోగలుగుతున్నారు అందుకేవాళ్ళు.

''ఎవరి కంటికి .. ''

''ఫలానా కంటికి అని చెప్తే ఏం చేస్తారు?''

''ఏముంది చేయటానికి.''

''వోంట్ యు ఈవెన్ కిస్ హెర్.''

నాకు అర్థమయ్యింది, పరిస్థితి చేతిలోంచేకాదు చరిత్రలోకి కూడా ప్రాకుతోందని.

''నో . అయ్ వోంట్.''

''అది చాలా తప్పు సుమా.''

''తప్పించుకోటానికి మీ ఆంగ్లేయులు ఉపదేశించిన మంత్రం వుంది కదా ''

''వ్వాట్ ''

''అదే, థేంక్స్ చెప్తే సరిపోతుందను కుంటాను...''

''మై గుడ్‌నెస్... యు మెన్ ఆర్ రియల్లీ సమ్‌తింగ్.''

''నన్ను కూడా కలుపుతున్నారా వాళ్ళలో'' మొదటిసారిగా గట్టిగా నవ్వాను.

క్షణకాలం మౌనం నాట్యం చేసింది. వుత్సాహంగా సాగుతున్న టి. వి సీరియల్ మధ్య చిన్న కమర్షియల్ ప్రకటనలా,

''ఇంతకీ మీరు నా ప్రశ్నకి సమాధానం చెప్ప లేదు'' అంది తెరీసా.

''ఏ ప్రశ్నకి.''

''మీ పెళ్ళి గురించి'' వెటకారం ధ్వనించింది ఆమె గొంతుకలో.

''ఏముంది చెప్పటానికి.''

''ఏమీ లేదా...''

''లేదనే చెప్పాలి. .''

''అంటే మీకు యింకా పెళ్ళికాలేదన్నమాట... యిప్పుడు నాకు చాలా హాయిగా వుంది సుమా...''

''పెళ్ళి అయ్యిందంటేనో...'' కావాలనే అడిగాను.

''మీరు కనికరంలేని డాక్టరనీ... పేషెంట్ అని కూడా కాస్త జాలిపడరనీ, కసాయివాడిలా ప్రవర్తిస్తారనీ అందరికీ చెప్తాను . ''

ఆమె కళ్ళల్లో ఏదో తెలియని వింత అనుభూతి చిరునవ్వుల మధ్య దోబూచులాడింది.

''మీరు చెప్పినంత మాత్రాన వాళ్ళు నమ్ము తారని ఎందుకు అనుకోవాలి...''

''నేను ఈ డాక్టర్ చేతిలో చచ్చిపోయినా కూడా నమ్మరంటారా.''

''ప్లీజ్... మనం ఈ సంభాషణ యింతటితో ఆపేస్తే మంచిదనుకుంటాను.''

కంగారుపడటం నావంతు అయ్యింది.

''ప్రస్తుతానికి మీరు చెప్పినట్లు చేయటం తప్పించి నేను చేయగలిగింది ఏమీ లేదు అను కుంటాను...''

నేను చురుకుగా చూశాను— 'ఏమిటి మీ వుద్దేశం' అన్నట్లు.

''అదే మీరు డాక్టరు . నేను పేషెంటు . మీరు చెప్పినట్లు వినవద్దా మరి'' చిలిపిగా అంది ఆ మాటలు.

''ఆల్‌రైట్ మిస్ పామర్ ... అయ్ విల్ సి యు లేటర్'' అన్నాను అక్కడనుంచి కదిలే ప్రయత్నం చేస్తూ.

''వెయిట్ ... వోంట్ యు కిస్ మి బిఫోర్ యు గో'' అంది గోముగా చూస్తూ.

''మీరు పేషెంటు, నేను డాక్టరు అని ఇప్పుడే గుర్తుచేశారు. మర్చిపోయారా అప్పుడే'' మాటలతో త్రోసిపుచ్చాను.

''పేషెంటు అయినా—డాక్టర్ అయినా ముద్దు మంచితనాన్నే గుర్తుచేస్తుంది. మనసుకి నచ్చిన వాళ్లని ముద్దుపెట్టుకోటంలో ఏమీ తప్పులేదు. ఎవరూ తప్పు పట్టలేరు.''

''అయ్‌సీ.''

''అయితే ఆలోచనదేనికి ?''

''మనం కాస్త మితిమీరి ప్రవర్తిస్తున్నాం అనుకుంటాను.''

''చూడండి డాక్టర్ రాజేష్...పసిపాప చేతులు చాపి ఎత్తుకోమని ఎగిరి గెంతేస్తుంటే చూసీ చూడనట్లు ప్రక్కకు తప్పుకునే మనిషిని ఏమంటారో మీకు తెలుసా ?''

''ఏమంటారట ... ''

''మొండివాళ్ళకి చెప్పినా ప్రయోజనంలేదు. చెవిటివాడి చెవిలో శంఖం వూదినట్లే అవుతుంది.''

''మీ బాధేమిటో నాకు అర్థం అయ్యిందికాని, దానికీ దీనికీ తేడా లేదంటారా చెప్పండి.''

''మీ దేశంలో ఆ తేడాలు వుంటే వుండొచ్చు నేమోకాని .. మాకు అలాంటి భేదాలు, భావాలు లేవు. ఈపాటికి మీరు గుర్తించే వుండాలే ఆ విషయం.''

''బోసినవ్వులు నవ్వే చిన్నారి పాపని ముద్దు పెట్టుకోటంలో అర్థం వుందికాని...మాటలు నేర్చిన చిలకని ముద్దాడటంలో నాకేమీ ప్రత్యేకత కనిపించ టంలేదు, కేవలం ఆకర్షణ తప్పించి.''

''అదే పొరపాటు ముద్దుకి చాలా అర్థం వుంది. మనసులో వుప్పొంగే మంచితనాన్ని, గుండెల్లో పొంగి ప్రవహించే ప్రేమనీ, మాటల్లో చూపించలేని అభిమానాన్ని ముద్దులో ఎంతో తియ్యగా అందివ్వ వచ్చు మాటలు నేర్చిన చిలకయినా—ఆటలు నేర్చిన గోరింకకయినా — అది కేవలం మాటలు రాని పసిపాపలకే పరిమితంకాదు మహాశయా ! ఏమైనా ముద్దు విలువ తెలుసుకోవాలంటే మనిషిలో కాస్త చైతన్యం, మనసుకి కాస్తంత స్పర్శజ్ఞానం వుండా లనుకుంటాను'' ఆ ప్రసంగంలో వున్న ఎత్తిపొడుపు గుర్తించకపోలేదు నేను

''అలాగా... వింటానికి చాలా ఆసక్తిగా వుంది ఏమైనా మన యిద్దరిమధ్యా మాటల్లో చెప్పుకో లేవంత ఏమీలేదుకదా ముద్దుతో మధ్యపెట్టుకో టానికి. . నిజానికి మన యిద్దరిమధ్య వున్న పనంతా మాటలతోనే అనుకుంటాను. డాక్టర్‌గా అడగటం నా పని .. పేషెంట్‌గా చెప్పటం మీ వంతు. ఏమంటారు...'' అన్నాను తేలికగా.

''ఏమో నాకు మాత్రం చెప్పలేనిది ఏదో చాలా వుంది అనిపిస్తోంది.''

ఆమె చూపులు నన్ను కలవరపెట్టాయి

''సేవ్ యిట్ మిస్ పామర్ . కలుసుకున్న ప్రతీ ఆడా మగా రోమియో జూలియట్‌లూ కాలేరు... అన్ని సంఘటనలూ ప్రేమ కథలూ కాలేవు...''

''మీ అభిప్రాయంతో ఏకీభవించాలని ఏమీ రూల్ లేదుగా.''

''అయితే ఏమంటారు యిప్పుడు ?''

''ఆడదాని అభిమానాన్ని కాలదన్నటం మగతనం అనిపించుకోదనుకుంటాను.''

ఆమె మనసంతా ఆ మాటల్లో వుందా అనిపిం చింది. ఆ చూపుల్లోంచి చూపు తప్పించుకోటం నాకు కాని పనే అయ్యింది.

''ఆల్‌రైట్... మీరు పేషెంట్... నేను డాక్టర్‌ని... మిమ్మల్ని కోలుకునేటట్లు చేయటం నా కర్తవ్యం... దానికి మందు ముద్దే అయితే... వై షుడ్ అయ్ సే. . నో'' అంటూ ఆమె చేయి అందుకుని సున్నితంగా ముద్దుపెట్టాను వణికే పెదవులతో.

''నో... నాట్ లైక్ దట్... ఎదిగిన మనుషులు ముద్దు పెట్టుకునే తీరే వేరు'' అంటూ హఠాత్తుగా నా మెడచుట్టూ చేయివేసి మీదకు లాక్కుని ఎర్రని పెదిమలతో నా పెదవులు మూయించింది, వుక్కిరి బిక్కిరి చేసే ఆ గాఢ చుంబనతో.

ఆ క్షణం ఆ దృశ్యం ఎవరి కంటపైనా పడివుంటే ?

ఆ వాతావరణంలో నా పిరికి మనసులో ఆ కలవరపాటు బెదిరిన లేడిపిల్లలా పరుగు తీయటంలో ఆశ్చర్యం లేదేమో !!

* * *

మా బాస్ డాక్టర్ హెండర్‌సన్ వయసులో యాభై ఐదు ఏళ్ళు పైబడ్డా యింకా యవ్వనం అంచులమీద ఒంటికాలితో నేర్పుగా నడుస్తున్నట్లే కనబడుతుంటాడు. అతను వయసులో వున్నప్పుడు అనేక సుందరాంగులు అతని చుట్టూ ప్రదక్షిణ

చేస్తుండేవారనీ, అప్పుడప్పుడూ చంద్రగ్రహణాలతో పాటు సూర్యగ్రహణాలు కూడా అతని జీవితంలోకి తొంగి చూశాయనీ, కథ కంచికి చేరేముందు ఒక నెరజాణ అతణ్ని చేజిక్కించుకుని పేరుకి సతీమణి అయి పెర్మనెంట్‌గా అతడి ముక్కుకి త్రాడు వేసిందనీ ఒక పుకారు.

నిజం దేముడికే తెలియాలి!

గతంలోని అనుభవాల సారం యిప్పటికీ డాక్టర్ హెండర్‌సన్‌లో కొట్టవచ్చినట్లు కనిపిస్తూనే వుంటుంది, ఆడవాళ్ళతో అతను ప్రవర్తించే తీరులో.

కొత్తగా నర్స్ స్టూడెంట్ మా వార్డ్‌కి వస్తే బుగ్గమీద చిటికవేసి, భుజాలచుట్టూ చేతులు వేసి ఆప్యాయంగా ఆహ్వానిస్తాడు, పాఠాలు చెప్పినా చెప్పకపోయినా, అన్న ఘనత డాక్టర్ హెండర్‌సన్ దక్కించుకున్నాడని వేరే చెప్పక్కర్లేదు.

అతనిలో ఏమి ఆకర్షణ వుందోకాని ముద్దుపెట్టకుండా అతనికి వీడ్కోలు చెప్పిన యువతిని నేను యింతవరకూ చూడలేదనే చెప్పాలి మరి.

ఒకసారి ఎప్పుడో మా వార్డ్ సిస్టర్ అంటుంటే విన్నాను— "హెండర్‌సన్‌కి జేమ్స్‌బాండులా ఒక ప్రత్యేకమైన సెక్స్ అప్పీల్ వుంది— దాన్ని తప్పించుకోటం ఎవరి తరం ?"

వార్డ్ రౌండ్స్‌కి వచ్చాడు డాక్టర్ హెండర్‌సన్

"హల్లో . యు ఆర్ మిస్ పామర్ . నేను సరిగ్గా గుర్తుపట్టాననుకుంటాను."

ఎప్పటిలా తన చిరునవ్వులు చిందిస్తూ ఎలకరించాడు డాక్టర్ హెండర్‌సన్.

"ఓ హల్లో" వీణ మీటినట్లు ప్రత్యుత్తరం యిచ్చింది తెరీసా పామర్.

తనని తాను పరిచయం చేసుకుని "ఎలా వుంది వంట్లో" అని అడిగాడు

"అయామ్ ఒకె. ఐ సపోజ్ . థ్యాంక్యూ"

"నా ఎంగ్ అసిస్టెంట్ డాక్టర్ రాజేష్" అని నావైపు ఒక చిత్రమైన చూపు విరిచి విసిరి—

"చెప్తుంటే విన్నాను, నువ్వు చాలా ఎక్కువ సిగరెట్లు కాలుస్తావట నిజమేనా ?" అన్నాడు హెండర్‌సన్

"నిజమేనని కాస్త భయపడూ్త చెప్పాలనుకుంటాను" కాస్త వెక్కిరింపు ధ్వనించింది దొరసాని ధోరణిలో.

"అబద్ధం చెప్పలేనప్పుడు నిజాన్ని వెళ్ళగక్కటమే మంచిది. భయపడి దాచుకుంటే అదికూడా ఒకోసారి గొంతుక్కి అడ్డం పడవచ్చు. వూపిరాడకపోతే ఎంత ప్రమాదమో నీకు తెలుసుగా" తన హాస్యధోరణిలో మాటలు ప్రారంభించాడు హెండర్‌సన్.

"అఫ్‌కోర్స్ . వుపయోగపడితే అబద్ధానికి కూడా చాలా విలువ వుంటుంది మరి ెక్కడ దాచినా."

తెరీసా అంత తెలివిగా తెగింపుతో సమాధానం చెప్తుందని అనుకోలేదు నేను పెద్ద డాక్టర్ వస్తే గడగడా వణికిపోతూ వున్న జబ్బు మరిచిపోవటం మన దేశ సాంప్రదాయం. ఎంత పెద్దమనిషి వచ్చి ఎదురుగా నిలబడినా వాక్ స్వాతంత్ర్యాన్ని వదులుకోకుండా ఎదిరించి నిలబడగలగటం వీళ్ళ ఆచారం చిత్రంగా వుంటుంది. ఆ రెండింటిమధ్య నిలబడి ఏంచేయాలో తోచక తికమకపడే నాలాంటివాడికి

"అఫ్‌కోర్స్ . నువ్వు అన్న మాటల్లో కూడా నిజం లేకపోలేదు. ఇంతకీ ఎన్ని సిగరెట్లు కాలుస్తూంటావు మై డియర్. ." అంటూ నాడి చూస్తున్నట్లు చేయి పట్టుకుని చివరికి తన అరచేతిలో ఆమె అరచేతిని ఆప్యాయంగా నొక్కాడు

"రోజుకా . నెలకా" ఫక్కున నవ్వింది తెరీసా హెండర్‌సన్ చేతిని అలాగే పట్టుకుని.

"నీదంత కంప్యూటర్ బ్రెయిన్ అయితే సంవత్సరానికి ఎన్ని కాలుస్తావో చెప్ప పోని..." ఆమె చేతిని రెండు చేతుల్లోకి తీసుకుని బెడ్‌మీద ఆమె ప్రక్క చోటు చేసుకుని కూర్చుని మరింత ఆప్యాయంగా నొక్కాడు.

"ష్యూర్ వై నాట్..." అంటూ ప్రక్క చూపులు మా వైపు విసిరింది, మేము గమనిస్తున్నామో లేదో ఆమె అమోఘమైన నటనని అన్నట్లు చిలిపిగా చూస్తూ.

"డోంట్ వర్రీ... ముందు రోజుకి ఎన్ని సిగరెట్లు కాలుస్తావో చెప్ప... నీ సంవత్సరం ఎకౌంట్స్ తరువాత ఎప్పుడో తీరుబడిగా కూర్చుని చూడొచ్చు..." హెండర్‌సన్ నావైపు, సిస్టర్ జోన్స్ వైపు చూసి కన్నుగీటాడు పరిహాసానికే యిదంతా అన్నట్లు.

"సుమారు యిరవై అనుకుంటాను." నావైపు చూసింది తెరీసా, అదేదో నా ఒక్కడికే తెలుసున్న విషయం అన్నట్లు "ఏమ్ ఐ రైట్" అని అడుగుతూ.

నేను వినీవిననట్లు వూరుకున్నాను

"యిరవై సిగరెట్లా... యు మస్ట్ బి వెరీ రిచ్. . మై గుడ్‌నెస్... చూడు సుందరీ యింతకంటే మంచి అవకాశం దొరకదు కాని సిగరెట్లు త్యాగం చేయి నా మాట విని."

"త్యాగమా" వెటకరించింది తెరీసా

"అదే తల్లీ.. కాల్చటం మానేయమని అభ్యర్థిస్తున్నాం."

హెండర్‌సన్ లాంటి పెద్ద డాక్టరు ఒక సర్వసాధారణమైన రోగితో మాట్లాడుతున్నతీరుకు నవ్వాలో ఏడ్వాలో అర్థం కాలేదు.

"అదేమంత పెద్ద కష్టమైన పని కాదనుకుంటాను. మంచి తోడు ఒకరు దొరకాలేకాని సిగరెట్లు త్యాగం చేయటం ఎంతసేపు"

ఆ మాటలంటూ తెరీసా గుచ్చిగుచ్చి నావైపు చూస్తోంది అన్న సంగతి గుర్తించకపోలేదు నేను, ఎవరిమాట ఎలావున్నా.

"ఏం నీ బోయ్‌ఫ్రెండ్ ఆ మాత్రం సహకరించలేడా నీతో. ఒక చేయివేయమను సరిపోతుంది"

"సహకారం మాట దేముడెరుగునుకాని — ఒక రెగ్యులర్ బోయ్‌ఫ్రెండ్ అంటూ ఒకడు వుంటే — నాకీ బాధలే వుండేవికావేమో."

హద్దులు దాటి దండయాత్ర సాగిస్తున్న వాళ్ళమాటల్ని శ్రద్ధగా వినటంకంటే నేను చేయగలిగింది ఏమీలేకపోయింది.

"మై గుడ్ నెస్ .. ఈ కాలం ఆడపిల్లల్ని కాస్తంతైనా అదుపులో పెట్టలేమంటే నమ్మండి. కనీసం మాటైనా వినిపించుకోరుకదా ఏం చెప్పటానికైనా."

హెండర్ సన్ మారుతోన్న వాతావరణాన్ని వెంటనే పసిగట్టాడు.



''మగపిల్లలు మాత్రం తీసిపోయారను కుంటున్నారా'' అప్పటివరకూ మౌనం వహిస్తూ వచ్చిన సిస్టర్ జోన్స్ విరుచుకు పడినంత పని చేసింది.

''అఫ్‌కోర్స్ ... అఫ్‌కోర్స్ ... ఓ పని చేద్దాం. ముందు నువ్వు ఓ పెర్మనెంట్ బోయ్ ఫ్రెండ్‌ని సంపాదించి పట్టుకో. ఆ తరువాత నీ సిగరెట్ల మాట ఆలోచిద్దాం.''

''అయిడియా బాగానేవుందికాని — వున్న పళంగా బోయ్ ఫ్రెండ్ ఎక్కడ దొరుకుతాడబ్బా.''

''నువ్వు కాస్త గట్టిగా ప్రయత్నించాలేకాని అదెంతపని?''

హెండర్ సన్ ఛలోక్తి విసిరి తెరీసా భుజాల చుట్టూ చేతులువేసి మెల్లగా తట్టాడు.

''ఎవరో ఒకరు ప్రత్యక్షం కాకపోరు నన్నీ ప్రమాదం నుంచి కాపాడటానికి — ఏమంటారు?''

''నిజమే ఎవరికి తెలుసు — అయినా యింత సుందరాంగిని ఏ మగాడు మాత్రం తప్పించుకు పోగలడు చూపులు కలిశాక'' హెండర్ సన్ మనసుని మాటల్లో పెట్టకుండా వుండలేకపోయాడు.

''ఈజ్ దట్ సో'' తెరీసా చూపులు నా మీద నిలిచాయని గుర్తించగానే గుండె దడదడలాడింది.

సిస్టర్ జోన్స్ ఆ మాత్రం పసికట్టలేని అమాయకురాలు కాదు.

నావైపు చూసి చిన్నగా నవ్వింది. అందులో ఎలాంటి వెటకారం, ఏహ్యాభావంలేదు. ఏవో తెలిసీ తెలియని వూహాలకి అస్పష్టమైన గుర్తింపు తప్పించి.

*　　*　　*

తెరీసా చూడటానికి ఆమె వుంటున్న వార్డులోని ప్రత్యేక గదిలోకి వెళ్ళాను. ఆ చిత్రంచూసి చివుక్కుమంది వంటరి మనసు.

''అయామ్ సారీ'' చాలా కాలంగా దొరల దేశంలో వుండటంవలన అనుకుంటాను. ఆ మాటలు యాంత్రికంగా గొంతు చీల్చుకుని వూడిపడ్డాయి, ఎదురుగా హాస్పిటల్ బెడ్‌మీద సరసాలు ఆడుకుంటున్నంత పనిచేస్తున్న ఆ జంటని బెదిరిస్తూ —

వాళ్ళు యిద్దరూ ఏదో లోకంలోంచి భూమి మీద వూడిపడ్డట్లు తెప్పరిల్లారు.

''ఓ... హాయ్'' తెరీసా ఎంతకైనా తెగించగల ఆడపిల్లేనని వేరే చెప్పక్కర్లేదు ఆ పలకరింపు వింటే.

''అయ్ డోంట్ మీన్ టు యింటరప్ట్ యు... సారీ.''

అక్కడ ఓ క్షణంకూడా నిలబడబుద్ధి కాలేదు. గిరుక్కున వెనక్కు తిరిగాను.

భారతదేశంలో పుట్టి పెరిగిన మనసేమో అతి తేలికగా అసూయతో రగులుకుంది. ఆ మనసుకి పెట్రోలు కిరసనాయిలతో ఏమీ పని వుండదను కుంటాను యిలాంటి విషయాలల్లో.

''ప్లీజ్ డోంట్ గో'' తెరీసా గొంతుక వణికింది.

అది తడబాటో, తప్పు కప్పిపుచ్చుకోటమో నా ఆలోచనలకి అందలేదు.

''ఓ డాక్టర్ రాజేష్... అయామ్ డాక్టర్ లాయిడ్... థొరాసిక్ సర్జరీ రిజిస్ట్రార్... మిస్

# భేతాళుడు మరచిన వ:రో కథ

పామర్‌ని చూడమని రిక్వెస్ట్ చేసింది చేసింది మీరే అనుకుంటాను...''

ఆ యువకుడు తెరీసా భుజాలమీద నుంచి చేతులుతీసి బెడ్‌మీద నుంచి లేచి నావైపు తిరిగాడు తిరుబడిగా.

''ఓ ఎస్.. ఎస్'' కంగారు పడడం నావంతు అయింది.

''మీతో మాట్లాడాలి... బయటకు వెళ్దామా'' అంటూ నా దగ్గరకు వచ్చి చనువుగా భుజంమీద చేయి వేశాడు డాక్టర్ లాయిడ్.

''ష్యూర్...''

చురుకైన నా చూపులు సూటిగా తగిలినట్లు వున్నాయి. చటుక్కున చేయి వెనక్కు తీసుకున్నాడు డేవిడ్ లాయిడ్ తప్పు తెలుసుకున్నట్లు.

''మీతో నేనూ మాట్లాడాలి... మీ పని అయ్యాక ఒకసారి యిలా వస్తారా ?''

వెనుకనుంచి తెరీసా గొంతుక స్తుతి చేసిన ఎలక్ట్రానిక్ ఆర్గన్‌లా మృదువుగా వినిపించింది.

లాయిడ్, నేనూ ఒకేసారి వెను తిరిగి చూశాం ఆశ్చర్యంగా.

''మిమ్మల్నే డాక్టర్ రాజేష్...''

లాయిడ్ నావైపు చూసి చిరునవ్వు నవ్వి మెల్లగా వీపుతట్టి బయటకు నడిచాడు.

వుత్సాహంగా నాటకం సాగుతుంటే పొరపాటున ఎవరో తెర వేసినట్లు అంతా అయోమయంగా తోచింది ఆ క్షణం.

''యు మీన్ మి...'' అన్నాను పిచ్చిగా.

''మీ పేరే తలచాను అనుకుంటాను'' చిలిపిగా నవ్వింది ఒంటరితనానికి వంతపాడుతూ.

''అదేమిటో యిప్పుడే చెప్పొచ్చుగా... అవతల నాకు చాలా పని వుంది. మీరు ఎలా వున్నారో చూసిపోదామని వచ్చానంతే'' అన్నాను.

''ఆహా... ఆశ .. చూసిపోటానికి నేనేమైనా ఎగ్జిబిషన్‌లో వస్తువును అనుకున్నారా ఏమిటి... అదేం కుదరదు... మీరు మళ్ళీ రావాల్సిందే, నాతో చాలాసేపు మాట్లాడాల్సిందే ఎన్ని పనులు వున్నా సరే... ప్లీజ్'' చిన్నపిల్లలా మారాం చేసింది.

''లుక్ మిస్ పామర్...''

''అహ... తెరీసా... పేరైనా గుర్తుంచు కోండి మహాశయా...''

''ఆల్‌రైట్... తెరీసా... ఓ విషయం చెప్తాను వింటారా ?''

''నాకు తెలుసు మీరు చెప్పబోయేది ఏమిటో... తెరీసా యిది హాస్పిటల్... నువ్వు రోగివి... నేను పెద్ద వైద్యవేత్తను... యిలా మంతనాలు సాగించటం చాలా తప్పు — ఆంతరంగిక వ్యవహారాలకీ అమూల్యమైన మా సేవలకీ మధ్య పొత్తు కుదరటం అసంభవం...''

''అన్నీ తెలిసివుండికూడా మీరు యిలా ఎందుకు ప్రవర్తిస్తున్నారో నాకు అర్థం కావటంలేదు.''

ఆమె మాటలకి అడ్డుపడి కథకి చిన్న మెలిక పెడదామని ఆవేశపడ్డాను. మాటలు త్రుంచి విసిరి చేతనైతే పొగుడుచేసుకుని మాలలు కట్టుకోమన్నట్లు చురుకుగా చూస్తూ,

''పిలిచినా పలికే ప్రాణి లేని ఓ ఎడారిలాంటి దీవిలో మిమ్మల్ని ఏ కంచెకో చెట్టుకో కట్టిపారేస్తే తెలుస్తుంది ఆ బాధ ఏమిటో.''

చుక్క మాట దేముడెరుగును కనీసం కామా గుర్తుకైనా చోటు లేకుండా కథని పొడిగించింది, ఆ వయ్యారిభామ తన తెలివైన మాటలతో.

''ఐ సీ.''

కోలుకోటానికి కాస్త బ్రైవ్ కావాల్సివచ్చింది నాకు.

''మనిషి మొండివాడయితే నయానో భయానో నచ్చచెప్పవచ్చు. మనసు మొండిదయితేనో...''

''మనసు మొండిదని తెలిశాక దాని జోలికి పోవటంలో అర్థం వుండదనుకుంటాను.''

అదంతా వ్యర్థ ప్రసంగమేనని నాకు బాగా తెలుసు. కాని తెరీసాలో ఏదో తెలియని నిక్షిప్తమైన ఆకర్షణ వుంది. అది నన్ను అన్నివిధాలా కట్టిపడేసి మాటలతో ఆటలాడిస్తోంది అని తెలుసుకోటానికి క్షణకాలం పట్టలేదు.

కాని ఆమె కంటిలో ఏమి కనికట్టు వుందోకాని ఆ చిక్కుకున్న వలయంలోంచి బయట పడటం నాకు చేతకాని పనే అయ్యింది ఆ నిముషం.

''మొండిదని చెప్పి మంచి మనసుని గాలికి వదిలేయమంటారా చెప్పండి... స్వారీ చేసే వాడికి కాస్త ఓర్పు, నేర్పు వుండాలేగాని ఆడవిగుర్రాన్నైనా మచ్చిక చేసుకోటం ఎంతసేపు...''

''మనసు గుర్రమే అయితే మీరు ఆ పనే చేయొచ్చు.''

''డోంట్ వర్రీ ... పరుగెట్టే మనసుకి పగ్గాలు ఎలా వేయాలో నాకు తెలుసు.''

''కంగారులో కాలుజారితే చాలా ప్రమాదం మరి.''

''ఎవరికట ... ''

''చూడండి యిప్పుడు మీతో వాదించేటంత ఓపికలేదు. బ్రైవ్ అంతకంటే లేదుకాని దయచేసి నన్ను విడిచిపెడ్తారా' అన్నాను అసహనంగా.

ఫక్కున నవ్వింది తెరీసా. ఎలాంటి ప్రవరాఖ్యుడైన ఆ నవ్వే చూపుల్లో మంచులా కరిగిపోవల సిందేనేమో.

''మిమ్మల్ని ఎవరూ కట్టేసి కూర్చోపెట్టలేదే. యు ఆర్ ఫ్రీ ఆంట్ యు ?''

''మై గుడ్ నెస్.''

విసురుగా బయటకు నడిచాను.

''మీ కోసం చూస్తుంటాను మరి ... ''

గుమ్మం దగ్గరకి వచ్చాను.

''ప్లీజ్ ... డోంట్ డిజప్పాయింట్ మి.''

క్షణం గుమ్మందగ్గర ఆగి ఏదో చెప్పాలను కున్నాను. కాని అలాంటి ఆడదానితో మాటలు పెంచడం చిన్నమొత్తంమీద పెద్దవడ్డీ చెల్లించటమే అవుతుందని గ్రహించటానికి అదృష్టవశాత్తు రెప్పపాటు కాలం సరిపోయింది.

బయట వరండాలో డాక్టర్ లాయిడ్ నా కోసం ఎదురుచూస్తూ విలువలేని చిరునవ్వు ఒకటి విసిరాడు గాలిలోకి !

(ముగింపు పైవారం)

వేలాది కుటుంబాలు అనాదిగా వాడబడుతున్న
లవంగనూనె ప్రభావాలన్నింటినీ ప్రామిస్‌లో మళ్ళీచూసారు.

# లవంగనూనెతో కూడిన సాటిలేని టూత్‌పేస్ట్ ప్రామిస్

మీరూ ఎందుకు వాడి చూడకూడదు మరి!




**ప్రామిస్**
దంతక్షయంనుండి రక్షణకు
తోడ్పడుతుంది నోటినితాజాగా
రూపొందించి
దుర్వాసనను అరికడుతుంది.




బల్సారా ఉత్పాదన




ఆరోగ్యంచిందే పళ్ళు,
చిగుళ్ళు, తాజాశ్వాస–
అదే మరి ప్రామిస్ వాగ్దానం

CHAITRA BLS-453R TEL

ఇప్పుడు ఖాళీ ట్యూబ్ ఆఫరును 31 డిశంబరు 82 వరకు ఆఖరిసారిగా పొడిగించబడింది

బుద్ధి పదునెక్కిన జీవులు జీవితంలో తమకు అందవలసినవన్నీ అందలేదనీ, అన్యాయం జరిగిపోతున్నదనీ భావించినప్పుడు ఏ దోవన పోతారో అందులోకే అడుగు పెట్టాను నేను.

# హాసీనా

వేంక్

దీపావళి కథల పోటీలో రు.600/ బహుమతి పొందిన కథ



వ్యవస్థ యిట్లా కుళ్ళిపోతున్న దేమిటి? అది సక్రమంగా ఎందుకు లేదూ? అంటూ తెగ మదనపడిపోతున్నాను. అబద్ధం, మోసం, అవినీతి సర్వత్రా సామాన్యమైపోయాయి. నీతిగా బ్రతికి పైకి రావటం యీ దేశంలో యీ కాలంలో కల్ల. నీతిపరులు అడుక్కే పోతున్నారు.

లక్షమంది నీతిపరుల్లో ఏ ఒక్కడో పైకి తేల్తాడేమో! పైకి తేలే వాళ్ళలో చాలాభాగం అవినీతి పరులేనన్నది ప్రత్యక్ష సత్యం. లంచమూ, నల్ల డబ్బూ, దొంగ లెక్కలూ లేకుండా బాగుపడ్డ వాళ్ళు అరుదు.

ఈయనగారు ప్రభుత్వం వారికి నమ్మకస్థుడైన వుద్యోగిగా పాతికేళ్లనుంచీ పని చేస్తున్నారు. వుద్యోగంలో ఆఫీసరే. అయినా రిటైరయ్యేనాటికి మాకు నెత్తిమీద అద్దెకప్పేగాని సొంతకప్పండదని స్పష్టమైంది. లోకరీతిగా పోయుంటే కథ మరోవిధంగా వుండేది! శిబిచక్రవర్తీ, రంతి దేవుడూ, హరిశ్చంద్రుడూ కూడా చాలా కష్టాలు పడ్డట్లు మా చిన్నబ్బాయి తెలుగు వాచకంలో మంచీ వల్లెవేస్తుంటాడు. మేము చిన్నప్పుడు చదివిన పాఠాలే! వాళ్లకు లాగా మాకూ దేవుడు ఆఖర్లో సకల సంపదలూ

దయనీయంగా వున్నాడన్న అనుమానం కూడా లేదు నాకు! నాచకాల నీతికీ ఆనందానికీ అవినాభావ సంబంధమున్నట్టూ, నీతికి తోబుట్టువే తృప్తి అయినట్టూ, నీతిమంతులకు ఆఖరికి స్వర్గలోకం దొరికి తీరుతుందన్న భ్రమలూ ఎందుకోగాని కల్పించబడుతున్నాయన్న పశ్న కలుగుతుంటుంది.

ఇప్పుడు ఇన్ని ఆలోచనలూ నా చుట్టూ ముసిరి నన్ను పీడిస్తున్నాయంటే దానిక్కారణం ఇప్పుడు మా అమ్మాయి ఇంటరు పరీక్షలు రాస్తున్నది, రోజూ నసుగుడే — "నేనెప్పుడూ రోజూ కష్టపడి పుస్తకాలన్నీ అర్ధరాత్రిదాకా చదివాను! మా క్లాసమ్మాయిలు చక్కగా అవుటయిన ప్రశ్నాపత్రాలు చూసుకుని ఎనిమిదింటికే నిద్రపోతున్నారు. నాకేమో ఎవరూ పేపర్సు తెచ్చివ్వరు! ... నిన్న నా స్నేహితురాలు లక్ష్మికి ఎంత కోపం వచ్చిందో. 'రేపు రాబోయే జువాలజీ పేపరు ఇంగ్లీషుది దొరకలేదు, తెలుగుది దొరికి చచ్చింది, దీన్ని ఇంగ్లీషులోకి మార్చుకోవాల్సివచ్చింది' అని తెగతిట్టుకుంది ... నాలాగా మొత్తం చదవాల్సి వుంటే ఏమనేదో!" ఈ ప్రకారంగా రోజూకోరకంగా గొణుక్కుంటున్నది పాప. దాని అవస్థ చూడలేక దానికి సమాధానం చెప్పలేక నేను ఇన్ని ఆలోచనలు చేస్తున్నాను. ఏదో ఒక సందర్భంగా ఇలాంటి ఆలోచనలు చాలాసార్లు చేశాను. ఈ వ్యవస్థలో ఇంత అన్యాయం ఇలాగా పండిపోయింది గనుక, ఇహ ఇది నాశనమై పోవాల్సిందేనన్న నిశ్చయానికి వస్తున్నాను ...

నేను ఇలాగా ఆలోచించుకుంటూ బాధపడుతూ వుండగా పనిమనిషి హసీనా ధనధనా లోపలికి వచ్చింది. ఆ మనిషి నడక తీరే అంత. ఐదున్నర అడుగుల ఎత్తూ, పలుచగా వుండి గట్టితనం గల ధృఢమైన శరీరమూ, పోషణలేక మోటు తేలినా ఆకర్షణీయమైన ముఖకవళికలూ, మెడని కావలించుకున్న బహునల్లని పూసలదండా, ఖంగున మోగే గొంతూ— ఒకసారి చూసిన వారెవరైనా ఆసక్తితో రెండోసారి చూసి తీరతారు హసీనాను. దానికి ముప్ఫైఏళ్లు దాటి వుండొచ్చుగాని ఇరవైఏళ్ల బాల కుమారి నన్నట్టు చకచకలాడిపోతూ, తనలో ఎవరికీ తెలిని నిగూఢమైన గొప్పదనమున్నట్టు విరగబడిపోతూ వుంటుంది.

ధన ధనా నడుస్తూనే 'గిన్నెలు బయటేశారా?' అన్నది. యజమానురాలి నన్న గౌరవంలేదు. అడగటంలో వినయంలేదు!

'సాయెబులంతే!' అన్నాడు జవాను కొండయ్య.

'దూదేకుల వాళ్లు కూడానా?' అంటూ కొక్కిరించాడు ప్రక్కింటి జవాను త్రిమూర్తులు మెల్లగా.

హసీనాని ఎదురుగా ఎవరూ ఏమీ అనరు!

రంజాన్ నెలలో భర్త, పిల్లల క్షేమం కోసమంటూ పగలంతా ఉపవాసముండి, ఎంగిలి కూడా మింగకుండా వుమ్మేస్తుంది హసీనా. గారిపీ నెల్లో దస్తగిర్ స్వామి మొక్కు తీర్చుకోవడానికి ఫకీర్లని పిలిచి, మేలా చేయించి, ఒక మేకను కోసి విందు చేసింది... చెయ్యాలనుకున్న ప్రతి పనినీ ఎలాగో పూర్తిచేస్తుంది మేకని ఏ వూళ్లోనో రాత్రికి రాత్రి దొంగలించి తెచ్చివుంటుందని నాకు అనుమానం. ఎందుకంటే పండుగ ఖర్చుకు లేదని అంతకు ముందు రోజే నన్ను అయిదురూపాయలు ఎడ్వాన్సు అడిగింది. మేకను కొనడం సామాన్యమా? యాభై రూపాయలు లేనిదే పిల్ల మేక కూడా రాదు! అయినా అలగా వాళ్లకి నీతినియమాలేమిటి?! ఇహ సినిమాల సంగతి సరేసరి! వారానికో సారైనా పిల్లాజెల్లాతో ఒక సినిమా చూస్తుంది. మర్నాడంతా చాలా హుషారుగా వుంటుంది. డబ్బులా? గేటు కీపరు తెలిసినవాడై పిల్లలందర్నీ టికెట్టు లేకుండానే లోపలికి ఒదుల్తాడట సినిమాకథ, జోకులు, పాటల కూనిరాగాలు— అబ్బో, రెండురోజుల వరకూ మాటాడ్డానికి చాలా సరుకు. నిజం చెప్పాలంటే హసీనాని చూస్తే నాకు కొంత అసూయ కలుగుతుంది కూడా. నేను సినిమా చూసివస్తే విమర్శిస్తానుగాని సంతోషించలేను. హసీనా కంటే ఎక్కువగానే పండుగలు చేస్తాను గాని అందులో తృప్తిలేదు!... ఆ ఒక అలగా మనిషిని గురించి యిన్ని ఆలోచనేమిటి?

'అబ్బో, పెద్దబాబు! అదసలెవరో అడగండి!' అన్నాడు త్రిమూర్తులు ఒకనాడు హసీనా లేనప్పుడు.

నేనడిగినప్పుడు ఒక్క నిముషం సమాధానం చెప్పకుండా నావేపు సూటిగా చూసింది. దాని సొంత విషయాలు అడిగే హక్కు నాకు లేదని ఆ చూపుతో ఆ నిముషంలో నాకు తోచింది తరువాత సౌమ్యంగానే చెప్పింది: 'నేను గెడ్డపిల్లని' అని. మిగతాది కొండయ్య చెప్పాడు తర్వాత. ఇది మొగుణ్ణొగ్గేసి దూదేకుల సుబానీతో లేచొచ్చింది. సుబానీ యిక్కడ వెల్ఫేర్ హాస్టల్లో పనిచేస్తాడు. వాళ్లకు ఆరుగురు కొడుకులు. అబ్బో, వాళ్లు అసాధ్యులు. పిల్లడికి పదేళ్లు నిండకుండానే ఏ హోటల్లోనో పనికి పెడతారు. వాడికి తిండి జరగా జీతం యింటికొస్తుంది అంతా సంపాదనే వాళ్లకి అందుకే అంత స్టైలా పచారుగా కన్పిస్తుంది హసీనా

రెండు నెలల క్రితం సుబానీ వాసెక్టమీ ఆపరేషన్ చేయించుకోగా ఏదో గొడవై పోయి బరువు పనులకు పనికి రాకుండా పోయాడు. వుద్యోగం పోయింది అప్పుడే వాణ్ణి చూశాను. చూసి ఝడుసుకున్నాను. పొట్టిగా, నల్లగా, బుంగపిసాలో వున్నాడు. అందులోనూ అనారోగ్యంతో బాధపడుతున్నాడేమో, మరీ వికారంగా కన్పించాడు నా కళ్లకి వాడి చిన్న కళ్లు మాత్రం మెరుస్తూ వున్నవి. వాడిని



## హసీనా

మాశాక హసీనా గర్వానికి కారణం అసలు అర్థం కాకుండా పోయింది

"మా నాలుగో వాడికి ఎనిమిదో ఏడు. అయినా మా పెద్దాడికంటే బలంగా వుంటాడు. వాడిని చూసిన వాళ్ళంతా పద మూడేళ్ళా? అని అడుగుతారు అంత పుష్టిగలవాడు! వాణ్ణి యీ నెల్నించీ యీ పక్కవీధిలో కొత్తగా పెట్టిన హోటల్లో పనికి పెట్టాను" అన్నది మొన్న. ఆ మాట తీరులో వింత గర్వమో! తన కొడుకు బలానికి ఏదో ఒలింపిక్ మెడల్ రాబోతున్నట్లు! గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్సులో పేరు ఎక్కబోతున్నట్లు!

"ఆ, ఎనిమిదేళ వాడినా! అప్పుడప్పుడూ ఇక్కడికి నీ వెంటబడి వస్తుండేవాడే, ఆ చిన్న పిల్లాడేనా? అంత చిన్నవాడినా! వెళ్ళాడా?" అన్నాను సిరియాళుడి తల్లితో పార్వతీదేవి అన్నట్లు. హసీనా నవ్వేస్తూ "వాడికి నా దగ్గరే పడుకోవటం అలవాటు. హోటల్లో పడుకోనని పారిపోయొచ్చాడు ఏడుస్తూ. మళ్ళీ పొద్దున్నే తీసుకెళ్ళి దిగబెట్టి వచ్చాడు వాళ్ళయ్య: పని నేర్చుకోవాలి గదా" అన్నది ఇది రాక్షసత్వానికి పరాకాష్ఠగా అనిపించింది నాకు ఎనిమిదేళ్ళ వాడంటే ఎంత పసివాడు! సినిమాల కోసం, సరదాల కోసం డబ్బులు తెమ్మని బండ పనిలో దింపేసింది! డబ్బు మనిషిలోని మమకారాల్ని మింగెయ్యడమంటే యిదే! అలగా వాళ్ళకి మమకారాలూ వుండవా?

మా చిన్నవాడు మూడేళ్ళ బాబీకి విరేచనాలు పట్టుకున్నవి. పేరున్న పిల్లల స్పెషలిస్టుకి చూపించి అతను చెప్పినట్లు మందులు తెచ్చి వేస్తూనే వున్నాము. మూడు రోజులు గడిచినా అవి తగ్గనేలేదు. నాలుగో రోజుకు పిల్లవాడు వాడిన తోటకూర కాడలాగా వాలిపోతున్నాడు. నాకు కళ్ళనీళ్ళు తరవాయిగా వున్నది. పిల్లవాడిని చూస్తే ఎన్నో భయాలు పుట్టుకొస్తున్నవి. ఒక చిన్న పిల్లవాడి విరేచనాలు నయం చెయ్యలేని వైద్యశాస్త్రం మీద విరక్తి పుట్టింది... అప్పుడు నేనైతేంయీ మందులన్నీ వెయ్యను!" అన్నది హసీనా గర్వంగా వింటబడి. ఎంతైనా ఆరుగురు బిడ్డల్ని పెంచిన మనిషి దాని వుపాయమేమిటో కనుక్కుని పిల్లవాణ్ణి బాగు చేసుకుందామన్న ఆత్రంతో "అయితే నువ్వేం

చేస్తావ్?" అనడిగాను. ఏదో గొప్ప రహస్యాన్ని దాచి పెడుతున్నట్లు గుంభనగా నవ్వింది హసీనా "మాకో పద్ధతి వుంది లెండి. ఆ పనిచేస్తే విరేచనాలు తగ్గి తీరుతాయి. కట్టుకు పోవాల్సిందే!" అన్నది "ఆహా! అదేమిటో నాకు చెప్పాలి?" అన్నాను బలవంత పెడుతూ. కాసేపు బెట్టుచేసి ఆఖరికి చెప్పింది: "ఒక వస్తువు తీసుకోవాలి... దాని పేరు చెప్ప కూడదు... దాన్ని నిప్పుమీద కాల్చి మణికట్టు మీద వాత పెడితే తగ్గిపోతై" అన్నది ఇంతకీ ఆ వస్తువేమిటో చెప్పదేమిటి? అది మనింట్లో వుండేదో, వుండనిదో. దాన్ని సంపాదించుకొని చికిత్స ప్రారంభించటానికి ఆలస్యమౌతుందేమో! కొంతసేపు బతిమాలాక నా మీద దయతలచి వరమిస్తున్న రాణి లాగా మొఖం పెట్టి సెలవిచ్చింది: "దాని పేరు చెప్పకూడదు! పేరు చెప్తే మందు పనిచెయ్యదు! అది మన యింట్లో వుండేదే. చారులో వేసేది. తెల్లటిది" అన్నది. కొంచెంసేపు ఆలోచించి "వెల్లుల్లిపాయా?" అన్నాను అడిగితే అవుననదు, కాదనదు. ఆఖరికి నవ్వుతూ దయగా అన్నది: "నేను రేపు దాన్ని తెచ్చి మీకు చూపిస్తానులెండి" అని.

దేవుడి దయవల్ల బాబిగాడి విరేచనాలు ఆ రాత్రికి తగ్గినై డాక్టరుగారి మందు పని చేసింది. వైద్యవిజ్ఞానం యింతగా ప్రగతి సాధించాక విరేచనాలు తగ్గకపోవటం ఏమిటి! చాలా సంతోషంగా వున్నాను

హసీనా నవ్వుకుంటూ వచ్చింది "బాబుకి ఎట్లా వుంది?" అన్నది రాగానే. నిన్నటి మాట జ్ఞాపకం వచ్చి "ఆ వస్తువు తెచ్చావా?" అన్నాను. బొడ్లో నుంచి వెల్లుల్లి రెబ్బ తీసి చూపించింది నాకు నవ్వు ఆగలేదు అలగా వాళ్ళ మూర్ఖత్వం యిట్లా వుంటుందన్నమాట! "దీన్ని కాల్చి వాత

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

## కుందుర్తి కాలధర్మం:

'నయాగరావలె దూకుతూ, 'నగారాగా' మ్రోగి 'యుగే యుగే' విలువగల వచన కవితను చెప్పి,వచన కవితా పితామహుడుగా ప్రశంసలు అందుకొన్న మిత్రుడు శ్రీ కుందుర్తి ఆంజనేయులు అక్టోబర్ 25 వ తేదీన హైదరాబాద్‌లో స్వగృహంలో కన్ను మూశారు. కుందుర్తి ఒక్కమాటలో మంచిమనిషి. కవితను— వచన కవితను సొంత ఆస్తిగా భావించే వారు. పరిచయమయిన పది నిమిషాలకే హృదయములో చొచ్చుకొని పోయేవారు. మెదడులో నరాలు తెగి మతిపోయేవరకు కవిత చెప్పారు. వచన కవితే వూపిరిగా, ధ్యేయంగా, బ్రతుకుగా భావించి, దానిని ఉద్యమంగా నడిపిన ఏకాంగవీరుడు కుందుర్తి. యువ కులలో ఏ మాత్రం కైతరవ్వ కనిపించినా, వెన్ను తట్టి నన్నుతించే ఉదారుడు. ఏ గతిరచియించిరేని సమకాలమువారలు మెచ్చరేగదా— అనేచేమకూర వేంకటకవి ఆవేదనకు అపవాదం కుందుర్తి. ఆయన గుంటూరు జిల్లా, నరసారావు పేట తాలూకా కోటి వారి పాలెం గ్రామంలో 1922 డిసెంబర్ 16వ తేదీన జన్మించారు. వినుకొండలో శ్రీ జాషువాకవి వద్ద, విజయవాడలో కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వద్ద విద్యాభ్యాసం చేశారు. గుంటూరు ఆంధ్ర క్రైస్తవ కళాశాలలో చదివి, అర్థిక శాస్త్రంలో బి. ఏ. పట్టం పుచ్చుకొన్నారు. బెల్లం కొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యంగార్లతో కలిసి 'నయాగరా' అనే కవితా సంపుటితో కవితా రంగంలో దూకారు. గుంటూరుపొగాకు బోర్డులో కొంత కాలం పనిచేసి, రాష్ట్ర ప్రభుత్వం సమాచార పౌర సంబంధ శాఖలో చేరారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత హైదరాబాద్‌కు వచ్చి "ఫ్రీ వర్స్ ఫ్రంటు"ను స్థాపించి, ఏటా బహుమానాలుకూడా ఏర్పాటు చేశారు. తెలంగాణా ప్రజల పోరాటాన్ని "తెలంగాణా" అనే వచన కవితాకావ్యంగారూపొందించారు. 1970 లో ఆయన రచించిన 'నగరంలో వాన' అనే కావ్యానికి రాష్ట్ర సాహిత్య అకాడెమీ బహుమతి లభించింది. 'కుందుర్తి కృతులు' కవితా సంపుటి కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి పొందింది. మరొక కావ్యానికి సోవియట్ ల్యాండ్ అవార్డు లభించింది. సమాచార శాఖ ప్రచురించే ఆంధ్రప్రదేశ్ పత్రికకు సంపాదకుడుగా వుండి ఉద్యోగ విరమణ చేశారు. ఆయనకు కుమారుడు, ఐదుగురు కుమార్తెలు వున్నారు. రచనలు— నయాగరా, తెలంగాణా, యుగే యుగే (ప్రాచీన ఛందోబద్ధ కవిత), నగరంలో వాన, నాలోని నాదాలు, దండియాత్ర, భగవంతునికి బహిరంగ లేఖ, భవిష్యత్కవిత, సౌప్తికం, కుందుర్తి కృతులు, హంస ఎగిరి పోయింది (భార్య మరణించినప్పుడు రచించిన కావ్యం) మేఘమాల, పెక్కు వ్యాసాలు. నవంబర్ 4వ తేదీన కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో శ్రీ సోమసుందర్ అధ్యక్షతన జరిగిన సంతాప సభలో పలువురు కుందుర్తిని ప్రశంసించారు. శ్రీ గోపాల చక్రవర్తి మాట్లాడుతూ కుందుర్తి సమాచార శాఖలో పని చేయడం ఆ శాఖకు గర్వకారణమన్నారు. ఆయన పొలాలకు హలాలు, చేనేతకు చేయూత— వంటి కవితాసుమయశీర్షికలు పెట్టేవాడని, ఆయన చిరంజీవి అని అన్నారు. కుందుర్తి పేరుతో అవార్డు పెట్టాలని డాక్టర్ దాశరథి సూచించారు. కుందుర్తి కవిత ఆలోచనలు రేకెత్తించేది, జ్ఞాన బోధ కలిగించేదని, శ్రీ గజ్జెల మల్లారెడ్డి అన్నారు. ఆయన కవితలో శిల్పం, తత్త్వం మేళవించాయని డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు అన్నారు. కుందుర్తి సామాన్యుని కోసం, సంఘం కోసం వ్రాశాడని శ్రీ ఎల్లోరా అన్నారు. ఆయన మంచి మనిషి, ఇతర కవుల వలె పదవుల కోసం పాకులాడకపోయినా కవిత్వం కోసమే పాకులాడాడని శ్రీ పోతుకూచి సాంబశివరావు అన్నారు. ఆయన ప్రభుత్వాన్ని ఏనాడూ అర్థించలేదని శ్రీ పుల్లాభట్ల వెంకటేశ్వర్లు అన్నారు. తెలంగాణా పోరాటం గురించి మరెవ్వరూ కావ్యం వ్రాయలేదని డాక్టర్ చేకూరి రామారావు అన్నారు. వచన కవితకు,లాంగ్ పొయెమ్స్‌కు వరవడి పెట్టారని శ్రీ శివారెడ్డి అన్నారు. కవితను సొంతంగా భావించేవారని డాక్టర్ ఎన్. గోపి అన్నారు. కుందుర్తి ప్రజా కవి, వివరణలో ఆయన అపస్మారక స్థితిలో ఛందోబద్ధమైన కవిత చెప్పారని డాక్టర్ వాసా ప్రభావతి అన్నారు. దుఃఖం ఎక్కువయినందు వల్లనో ఏమో ఎక్కువగా చాలా మంది అధ్యక్షుణ్ణి సంబోధించడం విస్మరించారు. దానిని చూచి విధానసభాధ్యక్షులను సంబోధించక మాటాడే విధానసభ సభ్యులు జ్ఞాపకం వచ్చారు.



## శ్రీమతి మనోరమా మహాపాత్రా:

విఖ్యాత ఒరియా కవయిత్రి శ్రీమతి మనోరమా మహాపాత్రా నవంబర్ 5 న ఆంధ్ర కళాభవన్‌లో తన ఒరియా కవితను వినిపించారు. ఆధునిక ఒరియా సాహిత్య ధోరణులను వివరించారు. శ్రీమతి శారదా అశోక్ వర్ధన్, శ్రీ ఎల్లోరా, శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులు తమ కవితను ఆమెకు వినిపించి తెలుగులో వివరించారు. ఒరియాలో వ్యంగ్యం తక్కువనీ, కాల్పనికతే ఎక్కువని శ్రీమతి మహాపాత్రా అన్నారు. ఆమె మగ్, శతరాత్రి, మొదలయిన తన కవితను వినిపించారు. ఒరియా సాహిత్య రంగంలో మహిళలు చాలతక్కువలన్నారు. సాహిత్య అకాడెమీ కార్యదర్శి డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి ప్రారంభంలో ఆమెను పరిచయం చేశారు. చివరన ధన్యవాదాలు చెప్పారు.

## ఉపశ్రుతి:

ఏంసార్ విచారంగా వున్నారే? అడిగాను, ఒక అత్యాంధ్ర నాయకుణ్ని. ఏం చెప్పమంటావ్ గొర్రెలలోనైనా మనది అగ్రస్థానమా అంటే దానిని ఈ సారి రాజస్థాన్ ఆక్రమించింది అన్నారు ఆయన విచారంతో. ఏమండీ, బాధపడకండి. సుఖరోగాలలో మనదే ప్రథమ స్థానమని డాక్టర్ ధరమ్‌పాల్ అన్నారు. ఆంధ్రుల పౌరుషం చావలేదు అని మనం నిరూపించుకున్నాం అన్నారు. మా సంభాషణ వింటున్న ఒకరు.

# ఉత్తరాలు

## పూర్వీకులు – నేటివారు

ఆంధ్రపత్రిక దసరా సంచికలో ప్రచురించిన "ధర్మో రక్షతి రక్షితః" సీరియల్‌పై శ్రీ పి. వి ఎస్. కృష్ణబాబు, శ్రీ రాజారావుగార్ల అభిప్రాయాలతో బాటు అంతకుమునుపు ప్రచురించిన రచయిత అభిప్రాయాలను చదివిన తరువాత నాకు కలిగిన భావాలను వెల్లడిస్తున్నాను. ప్రజాస్వామ్య వ్యవస్థలో ఏ ఇద్దరి అభిప్రాయాలూ ఒక్కటిగా వుండనవసరం లేదు. దీనికి రచయిత కూడా మినహాయింపు కాదు. అలా అని ఈ ఉత్తరంఉద్దేశ్యం రచయితను సమర్థించడం కాదు. "3000సంవత్సరాల నుండి" అంటూ ఉదహరించడం అంకెల గారడీకాదా? సమస్యని తప్పుదోవ పట్టించడం కాదా? ఇది "తోడేలు—మేకపిల్ల" కథని జ్ఞప్తికి తెస్తుంది. "మీ పూర్వీకుల్లో కొందరు ఏదో చేశారు కాబట్టి నువ్వు శిక్ష అనుభవించి తీరాలి" అనే మనస్తత్వం విపరీతపు ధోరణి వహించినది. అలాగే విమర్శ కువిమర్శ కానంతవరకు సంగ్రహనీయమే. వేదాలకీ, సనాతన గ్రంథాలకీ "లోకోభిన్నరుచిః" అని వేరు వేరు అర్థాలు కల్పించవచ్చు. ఉదాహరణకి "బ్రాహ్మణుడు" అంటే సాధారణమైన "శ్రేష్టుడు" అనే ఈ శబ్దం కుల విశేషం కాదు. ఈ శబ్దానికి కుల మతాలు అతీతం. "బ్రాహ్మణా నేస్సంతు నిర్భయాః గో బ్రాహ్మః భృశ్శుభమస్తు నిత్యం లోకఃస్స మస్తాస్సుఖినోభవంతు" అంటే "శ్రేష్టులైనవారు సుఖింతురు గాక" అని తాత్పర్యం. ఇప్పుడు ఆలోచించాల్సింది ఇన్ని విధాలుగా వాదించుకునే వాళ్ళు కుల వర్గ రహిత సమాజాన్నెందుకు ఆశించరు? అనే. ప్రభుత్వం ప్రచురించే అప్లికేషన్లలో 'కులం' "కాలమ్" ని ఎందుకు వ్యతిరేకించరు? "ధర్మో రక్షతి రక్షితః" మీద జరిగిన చర్చకి కులం ప్రాతిపదిక కావడం విచారకరం. నిజానికి భారతదేశంలో వున్నన్ని కులాలు, వాటి శాఖలు మరే దేశంలోనూ లేవు. కులాల సంకుల సమరం ఈనాటిది కాదు. ఉజ్వలమైన భారతీయ సంస్కృతిలోని విషబిందువు కుల వ్యవస్థ అని అందరూ అంగీకరిస్తారు. దీనికి అర్థం అగ్ర కులం అని చెప్పబడేవారు తల వంచుకు పోవాలనికాదు, దీన్ని ఆసరాగా చేసుకొని మరొకరు ప్రత్యేక సౌకర్యాలు పొందుతూ వుండిపోవాలనీ కాదు.

అకెళ్ల శ్రీనివాసరావు, హిందీ విద్వాన్,
18—303—7, కపిల తీర్థంరోడ్, తిరుపతి—
517507. ★

**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3, Editor : S. Radhakrishna.**